# చతుర

సంపుటి : 7 సంచిక : 12
జనవరి : 1985

## ఈ నెల సమగ్ర నవల

"ఈమధ్య చావు అంటేనే భయం లేకుండాపోయింది..." అందో యువతి నిర్లిప్తంగా!

"జీవితంలో ఎప్పటికయినా ఆడపిల్ల మనసు, హృదయం అర్థం చేసుకునే ప్రయత్నం చేయండి. ఎవరినైనా ఒక్కసారే మోసం చేయవచ్చు. కాని, ఆ మోసానికి భవిష్యత్‌లో శిక్ష, ఫలితం ఉండకపోదు" అంది మరో యువతి ఆగ్రహంతో.

ఉత్తర దక్షిణ ధృవాల్లాంటి ఆ ఇద్దరూ ఏ అనుభవాల అనంతరం అలా అనే స్థితికి వచ్చారు? వారిద్దరి మధ్య ఉన్న అనుబంధం ఏమిటి? ఆ ఇద్దరితో "అతని"కి గల సంబంధం ఎంతవరకు? అతను అమాయకుడా...? మోసగాడా...?




...గా అందంగా, ఆహ్లాదకరంగా అతని మనసులో చేరి హృదయాన్నాక్రమించుకున్న ఆ యువతి చివరికేమయింది?

**భమిడి వెంకటేశ్వర్లు**

యువతరంలోని విభిన్న మనస్తత్వాల విశ్లేషణగా రచించిన ప్రేమగాథ 'హరియాలీ' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

ముఖ చిత్రం : దేవదాస్ కుసుమ్

రెండవ కవరు:
మూడవ కవరు: } సూరజ్ ఎస్ శర్మ

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-, అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

# ఉరితీసే వృత్తి

సదాశివ నెతారే మహారాష్ట్రలోని పూనేలో గల యెరవాడ జైల్లో తలారిగా వుద్యోగం చేస్తున్నాడు. గత 29 ఏళ్లగా ఆ ఉద్యోగంలోవున్న నెతారే ఇంతవరకూ 75మంది నేరస్థుల్ని ఉరితీశాడు. 'మాతంగ' తెగకుచెందిన నెతారేకి అది వంశానుగతంగా వచ్చిన వృత్తి.

1955లో తలారి వృత్తిలో చేరిన నెతారే వయసు ఇప్పుడు 51ఏళ్లు. అతను మొదట భరోడా జైల్లో నియమింపబడ్డాడు. అప్పట్లో గుజరాత్, మహారాష్ట్రలు ఒకే రాష్ట్రంగా వుండేవి. 1960లో ఆ రాష్ట్రాలు విభజింపబడినప్పుడు సుప్రసిద్ధమైన యెరవాడ జైలుకి బదిలీఅయాడు. 1955 నుంచి 63 వరకూ, ఎనిమిదేళ్ల పాటు నెతారే ఒక్కరినికూడా ఉరితీయవలసిన అవసరం రాలేదు.

1963లో నెతారే మొట్టమొదటిసారి



ఓ నేరస్థుడిని ఉరితీశాడు. పొడుగ్గా, దృఢంగా, కండలు తిరిగివున్న అతన్ని ఉరితీసేందుకు నెతారేకి పదిసిముషాలు పట్టింది.

ఉరితీత అయేంతవరకూ నెతారే ధైర్యంగానే వున్నాడు. అది ముగిశాక నెతారేకి ఏదోగా అన్పించడం మొదలెట్టింది. ఆ మృత్యుదోషం నుంచి బైటపడటానికి అతను గంటలతరబడి నీళ్లు గుమ్మరించుకుని స్నానంచేశాడు. ఆ బాధను మర్చిపోయేందుకు అతిగా సారాయి తాగాడు. రెండురోజులపాటు ఆహారం తీసుకోలేదు, కునుకు తీయనూ లేదు.

ఆ మొదటి ఉరితీతకి నెతారేకి జీతంకాక అదనంగా 5 రూపాయలిచ్చారు. ఇప్పుడది



30 రూపాయలయింది. నెతారే తన జీతం సరిపోదని చెబుతూ పెరుగుదలకై పోరాడుతూనే ఉంటాడు.

"ఇదో దౌర్భాగ్యపు ఉద్యోగం. ఇది నాకు మనశ్శాంతిని దూరంచేస్తుంది. నాగరీకుడైన ఏ మనిషీ ఈఉద్యోగంచేయడు"

అంటుంటాడతను. 75మంది నేరస్థుల్ని ఉరితీయమని ఆజ్ఞాపించింది చట్టమే అయినా, వారి చావులో తనకుకూడా భాగం వుందనుకుంటాడు నెతారే. అందుకే అతను నడిచే దోవలో ఏ గుడి కనబడినా దేవుడికి దండం పెట్టి క్షమాభిక్ష




వేడుకుంటాడు.

"నన్ను ఎక్కువగా బాధించేదేమంటే నేను రాతిగుండెగలవాడినని అందరూ అనుకోవడం" అంటాడు నెతారే వేదనగా. ప్రస్తుతం 'హవల్దార్'గా ప్రమోషన్ పొందిన నెతారే 1988లో రిటైరయిపోతాడు!

## సమురాయీలు

జపాన్‌లో 'సమురాయీ'లనేవాళ్లు వీరత్వానికి ప్రసిద్ధిచెందిన జాతి! సమురాయీలను గుర్తించడం సులభం. వారెప్పుడూ వంటికి రెండు బాకులు తగిలించుకుని తిరుగుతారు. ఓ ప్రత్యేక రకమైన శిరస్త్రాణాన్ని ధరిస్తారు.

తమ సాంప్రదాయం పట్ల ఎనలేని మక్కువగల సమురాయీలు 'పుషిదో' అనే పూజా విధానాన్ని పాటిస్తారు. ఆ పూజ తమలో ఆత్మవిశ్వాసం, ధైర్యాలను నింపుతుందని వారి నమ్మకం. సమురాయీలు పూరికే చలించిపోయే స్వభావం గలవారు. వాళ్ళకి ఏమాత్రం అవమానం ఎదురైనా ఆత్మహత్య చేసుకుంటారు.

సమురాయీలు చాలామంది జపాన్ రాజులకి అంగరక్షకులుగా పనిచేసేవారు. 1185లో జపాన్‌లో రాజరికం తొలగిపోవడంతో సమురాయీలు తమ ఉద్యోగాలు కోల్పోయారు. దాంతో వారు ఇతరులకు యుద్ధవిద్యలు నేర్పడం మొదలుపెట్టారు. యుద్ధవిద్యలు నేర్పడానికి సమురాయీలు నెలకొల్పిన స్కూళ్ళలో 'షోగన్' అనేది చాలా ప్రముఖమైనది.

జపాన్‌ని జయించేందుకు మంగోలియన్ రాజు 1274లోనూ, 1281లోనూ దండయాత్రలు జరిపాడు. కాని రెండు

సార్లూ అతను విఫలుడే అయ్యాడు. పోర్చుగీసు నౌకాదళంవారు 1542లో జపాన్ వచ్చారు. 1549లో సెయింట్ ఫ్రాన్సిస్ జేవియర్ అనే క్రిష్టియన్ మిషనరీ క్రీస్తు మతాన్ని ఉపదేశించటానికి జపాన్ వచ్చాడు. ఓ శతాబ్దంపాటు మాత్రమే జపాన్‌లో క్రైస్తవ మతానికి కొంచెం ప్రోత్సాహం లభించింది. తర్వాత అక్కడ క్రైస్తవ మతాన్ని నిషేధించారు. 1854లో అమెరికన్లు జపానీయులతో వర్తక సంబంధాలు ప్రారంభించినపుడు ఆ నిషేధాన్ని తొలగించారు.

ఆవిధంగా జపాన్‌లో జరిగిన అనేక మార్పులవల్ల సమురాయీలకి ప్రాధాన్యత నశించి, వాళ్లు ఎన్నో ఇబ్బందులకు గురయ్యారు. కాని 1868లో జపాన్‌లో మళ్ళీ రాజరిక విధానం వచ్చింది. జపాన్ ప్రజలు తిరిగి తమ సంస్కృతి పట్ల శ్రద్ధ వహించనారంభించారు. ఆవిధమైన సంస్కృతీ పునరుద్ధరణతో సమురాయీలకి తమను అభివృద్ధిచేసుకునేందుకు అవకాశం కనబడింది.

కాని, జపాన్ ప్రపంచ యుద్ధాల మధ్య ఇరుక్కుని, తర్వాత భారీయెత్తున పారిశ్రామికీకరణ చెందడంతో సమురాయీలు గతించిపోయారు! నేడు సమురాయీలను సినిమాలలో చూడవల్సిందే తప్ప నిజజీవితంలో కనబడరు!

## పునర్జీవం

ప్రపంచం ఒకవైపు జనాభా సమస్యతో కిందుమీదులవుతుంటే, మరోవైపు కొందరు శాస్త్రవేత్తలు మృత్యువును ఓడించే ప్రయత్నాలలో లీనమైవున్నారు. అలాంటి ప్రయోగమొకటి కొన్ని దశాబ్దాల క్రితమే జరిగింది. 1934లో కాలిఫోర్నియా యూనివర్శిటీకి చెందిన డాక్టర్ రాబర్ట్ కార్నిష్ ఓ చచ్చిపోయిన కుక్కకి పునర్జీవం ప్రసాదించడంలో విజయం సాధించాడు.

కొందరి సమక్షంలో డాక్టర్ కార్నిష్ 'ఫాక్స్ టెర్రియర్' అనే జాతి కుక్కను ఈథర్, నైట్రోజన్ గేస్‌ల విష ప్రయోగంతో చంపేశాడు. ఆ కుక్క హృదయ చలనం ఆగిపోయింది. అన్ని విధాలా పరీక్ష జరిపి అది చచ్చిపోయినట్టు నిర్ధారించారు. ఆరు నిమిషాల తరవాత డాక్టర్ కుక్క కాలు దగ్గిర ఓ ధమనిని కోసి దానిలోంచి అడ్రెనలిన్, ఆక్సిజన్‌తో కలిపిన సెలైన్‌వాటర్‌ని ఎక్కించాడు. తర్వాత మరో మందుని ఇంజెక్ట్‌చేసి, కుక్కకి రక్తాన్ని కూడా ఎక్కించాడు ఇదంతా జరుగుతున్న సమయంలో డాక్టర్ సహాయకుడు చచ్చిపోయిన కుక్క శరీరానికి మర్దన చేస్తూనేవున్నాడు.

డాక్టర్ కార్నిష్ కుక్క నోటిపై నోరుపుంచి గాలిపూది కృత్రిమ శ్వాసను కల్పించాడు. అలా కొద్దిసేపు జరిగాక కుక్క కాళ్ళు కొంచెం కదిలాయి. దాని గుండె నిరసంగా కొట్టుకోవడం ప్రారంభించి, క్రమేణా కొన్ని గంటల తర్వాత యథాప్రకారం చలించసాగింది.

8 గంటల 13 నిమిషాల తర్వాత ఆ కుక్క మూలుగుతూ నీరసంగా మొరగసాగింది. ఆ కుక్క తిరిగి చాలా కాలం బతికేదేకాని కార్నిష్‌వల్ల ఒక పొరపాటు జరిగిపోయింది. కుక్క త్వరగా కోలుకోవాలని కార్నిష్ దానికి గ్లూకోజ్ ఇంజెక్షన్ ఇచ్చాడు. అయితే గ్లూకోజ్ వల్ల రక్తం గడ్డకట్టుకుని ఆ కుక్క చచ్చిపోయింది. మరోసారి దాన్ని






బతికించడానికి వీల్లేకపోయింది.

ఇదంతా గమనించిన ప్రేక్షకుల్లోంచి ఓ స్త్రీ, ఆరుగురు పురుషులు స్వచ్ఛందంగా ముందుకువచ్చి తమపై ఆ ప్రయోగం జరపమని డాక్టర్ కార్నిష్‌ని కోరారు. కాని ఆయన మనుషులపై తన ప్రయోగం జరపడానికి నిరాకరించారు. "నా ప్రయోగం జంతువులపై నూటికి నూరుపాళ్ళు విజయవంతమయ్యాక అపుడు మనుషుల గురించి ఆలోచిస్తాను" అని చెప్పాడాయన.

ఆ తర్వాత డాక్టర్ కార్నిష్‌గాని, కాలిఫోర్నియా యూనివర్శిటీగాని ఆ ప్రయోగాలను ఎంతవరకూ కొనసాగించిందీ తెలీదు!

## ఒబెరాయ్

ప్రస్తుతం ఒబెరాయ్ హోటళ్ళు ప్రపంచవ్యాప్తంగా విస్తరించుకుని, వేలాదిమందికి ఉద్యోగాల్ని కల్పిస్తున్నాయి. వాటి అధిపతి ఒబెరాయ్‌కి 84 ఏళ్ళు. ఆ వయసులో చాలామంది తమ చివరిరోజులు లెక్కపెట్టుకుంటూ, మంచంలో కాలం గడుపుతుంటారు. కాని, ఒబెరాయ్ ప్రత్యేకమైన వ్యక్తి. నేటికీ అతను రోజుకి కనీసం 10 గంటలపాటు పనిచేస్తూ, తన వ్యాపార వ్యవహారాలను స్వయంగా చూసుకుంటాడు.

ఈనాడు కోట్లకు పడగెత్తిన ఒబెరాయ్ 1900 సంవత్సరంలో ఆగస్టు 15న

ఓ పేద కుటుంబంలో జన్మించాడు. ప్రస్తుతం పాకిస్తాన్ భూభాగంలో వున్న 'బేస్' అనేచోట ఓ చిన్న గుడిసెలో పుట్టాడతను. అతని తండ్రి ఎ. యస్. ఒబెరాయ్ చిన్నచిన్న కాంట్రాక్టు పనులు చేస్తుండేవాడు.



ఒబెరాయ్ ఎంత ధనవంతుడైనప్పటికీ ఎలాంటి భేషజాలూలేవు. ఢిల్లీ దగ్గరలోని తన 'ఫార్మ్ హౌస్'లో వుంటూ, తన దగ్గిర పనిచేసేవారితో తానే స్వయంగా మాట్లాడతాడు.

కేవలం 25 రూపాయల పెట్టుబడితో హోటల్ వ్యాపారంలోకి దిగిన అతనికి నేడు 11 దేశాలలో 31 లగ్జరీ హోటళ్లు వున్నాయి. అతని సంపాదన కోట్లలో వుంది. అతని ఆస్తులు మొత్తం 200 కోట్ల రూపాయలుంటాయని ఓ అంచనా.

ఒబెరాయ్ బాల్యం అనేక కష్టాలతో గడిచింది. తను పుట్టిన ఆరు నెలలకే తండ్రి చనిపోయాడు. తల్లి అతన్ని ఎంతో క్రమశిక్షణతో పెంచింది. పాఠశాల చదువు రావల్పిండిలోనూ, కళాశాల చదువు లాహోర్‌లోనూ సాగింది.

డబ్బు లేకపోవడం వల్ల ఒబెరాయ్ కాలేజీ చదువు రెండవ సంవత్సరంలోనే ఆగిపోయింది. అమృతసర్‌లోని ఓ ఛారిటబుల్ ఇన్‌స్టిట్యూషన్ అతనికి టైపు, షార్టుహేండ్ నేర్పించింది. ఆ రెండిటి వల్లనే అతను ఇంతటి ఉన్నత స్థానానికి చేరుకోగలిగాడు.

ఒబెరాయ్ 20 ఏళ్ళ వయసులో 15 ఏళ్ళ యువతిని వివాహమాడాడు. ఆ సమయంలో లాహోర్‌లో భయంకర మైన ప్లేగువ్యాధి ప్రబలివుంది. అప్పుడు తల్లి అతనికి 25 రూపాయలిచ్చి సిమ్లా పంపుతూ, అక్కడ ఉద్యోగం చూసుకుని కుటుంబాన్ని తీసుకెళ్ళమని చెప్పింది.

సిమ్లాలో ఒబెరాయ్ ఓ ప్రభుత్వ పరీక్ష రాశాడు. తర్వాత అక్కడున్న 'సెసిల్' అనే హోటల్‌కి వెళ్ళి, దానికి మేనేజర్‌గా వుంటున్న 'గ్రోవ్' అనే బ్రిటిష్ వ్యక్తిని కలుసుకుని ఉద్యోగం

అడిగాడు. అదే ఒబెరాయ్ జీవితాన్ని మంచి మలుపు తిప్పింది.

గ్రోవ్ అతనికి నెలకి 40 రూపాయల జీతంపై ఓ ఉద్యోగం ఇచ్చాడు. ఆతర్వాతజీతం50రూపాయలకి పెరిగింది. అతను వుండటానికి క్వార్టర్స్ కూడా ఇచ్చారు. ఒబెరాయ్ భార్యనూ, తల్లినీ తన దగ్గరకు తెచ్చుకున్నాడు. భారతీయ పౌరసత్వాన్ని కూడా స్వీకరించాడు.

ఒబెరాయ్ పనిచేస్తున్న హోటల్‌కి క్లార్క్ అనే కొత్త మేనేజర్ వచ్చాడు. అతను ఒబెరాయ్‌ని తన పర్సనల్ అసిస్టెంటుగా తీసుకున్నాడు. ఆ కాలంలోనే ఒబెరాయ్ హోటల్ వ్యాపారంలోని అన్ని మెలకువల్ని నేర్చుకున్నాడు.

క్లార్క్‌తో వుంటూనే,కస్టమర్లు కావాలన్న చోటికి ఆహారాన్ని సప్లయిచేసే 'కేటరింగ్ కాంట్రాక్ట్స్' చేపట్టాడు ఒబెరాయ్. కొన్నేళ్ళ తర్వాత కార్ల్‌టన్ అనే హోటల్ అమ్మకానికిరాగా ఒబెరాయ్ తన భార్య నగల్ని తాకట్టుపెట్టి, స్నేహితులు, బంధువుల దగ్గిర అప్పుచేసి, ఆ హోటల్‌ని తనే కొనేశాడు.

1970లో ఒబెరాయ్ ప్రముఖ 'ఒబెరాయ్ టవర్స్ హోటల్'ని నిర్మించతలపెట్టాడు. ఇప్పుడా హోటల్‌గల స్థలాన్ని అప్పట్లో వేలంలో అమ్మకానికి పెట్టగా ఎవరూ చదరపు గజానికి 450 రూపాయలకి మించి పాడలేదు. కాని ఒబెరాయ్ గజం 750 రూపాయల చొప్పున ఆ స్థలం మొత్తం కొన్నాడు.

తర్వాత అతను అమెరికా సంయుక్త రాష్ట్రాలకి చెందిన షెరాటన్ గ్రూప్ హోటల్స్‌తో ఉమ్మడి వ్యాపారంలోకి దిగాడు. ఆ అమెరికన్ కంపెనీ బాంకు ఫైనాన్స్ రూపంలో 40 కోట్ల రూపాయలు పెట్టుబడి పెట్టింది. మరో 20 కోట్ల రూపాయలు ప్రజలనుంచి షేర్ల రూపంలో రాబట్టారు. ఆవిధంగా 500 గదులతో అత్యంత విలాసవంతమైన ఒబెరాయ్ షెరాటన్ హోటల్ నిర్మింపబడింది. భారతదేశంలో అత్యంత పెద్ద హోటల్‌ని నిర్మించిన ఘనత ఒబెరాయ్‌కి దక్కింది.

1939నాటి రెండవ ప్రపంచయుద్ధం కూడా తన వ్యాపారం అభివృద్ధి చెందడానికి తోడ్పడిందని ఒబెరాయ్ చెబుతుంటాడు. ఆ సంవత్సరంలో చాలా మంది సైనికులు కలకత్తాలోని తన 'గ్రాండ్‌హోటల్'లో బసచేశారట. కేవలం వాళ్ళనుంచే అతను 70 లక్షలు సంపాదించాడట.

1962లో ఒబెరాయ్ పార్లమెంటు సభ్యుడైనప్పుడు, టూరిజమ్, హోటల్ వ్యాపారాలు అభివృద్ధి చెందడానికి ఎంతో కృషిచేశాడు.

ప్రస్తుతం ఒబెరాయ్‌కి ఇండియాలోనే కాక జాంజిబార్, ఈజిప్ట్,సౌదీఅరేబియా, ఆస్ట్రేలియా,నేపాల్,శ్రీలంక, సింగపూర్, ఇండోనేషియా, ఇరాన్‌లలో 31 హోటళ్ళు వున్నాయి. మరో 7 హోటళ్లు నిర్మించబోతున్నాడు. అందులో 4 భారతదేశంలో నిర్మింపబడతాయి. కనీసం 50 హోటళ్ళు నిర్మించాలనేది ఒబెరాయ్ లక్ష్యం!

ఒబెరాయ్ హోటళ్ళలో సాదరంగా, సత్వర సేవలతో కస్టమర్లను ఆదరిస్తారు కాబట్టి ప్రతివారూ ఆ హోటళ్ళకి మళ్ళీ మళ్ళీ వెళ్లాలని కోరుకుంటారు. హోటల్ పరిశ్రమలో ఓవిధంగా చరిత్ర సృష్టించాడు ఒబెరాయ్. ఇంతటి అభివృద్ధికి కారణం అతని కఠోర పరిశ్రమ, పట్టుదలలే! *




అర్జునరావుకు హఠాత్తుగా మెలకువ వచ్చింది. ఎదురుగావున్న అలారంకేసి చూశాడు. ఏడున్నర దాటుతోంది. తను ఇంతవరకూ నిద్రపోవటానికి కారణం రాత్రి చూసిన రెండో ఆట సినిమా. సినిమా చూసి ఇంటికొచ్చేసరికి ఒంటి గంటి దాటింది. ఓ గంటసేపు ఏదో నవల యధాలాపంగా చదివి నిద్రపోయాడు.

హడావిడిగా మంచం దిగి బాత్ రూము లోకి దూరాడు. టూత్ బ్రష్ మీద పేస్టు వేసుకుని దంతధావనానికి వుపక్రమించాడు. ముఖం కడుక్కుని వచ్చి స్టవ్ మీద కాఫీకి నీళ్ళు పెట్టాడు. మరో స్టవ్ మీద పాలగిన్నె పెట్టాడు. అయిదు నిమిషాల్లో పాలు కాగాయి. తరువాత వేడి నీళ్లు పెట్టేందుకుగిన్నె కోసం బాత్ రూములో కెళ్ళాడు. కుళాయి తిప్పాడుగాని నీళ్లు రాలేదు. 'ఈరోజు త్వరగానే కుళాయి బందయిపోయింది' అనుకున్నాడు.

బావి దగ్గరికెళ్ళి రెండు బకెట్లు నీళ్లు తోడేడు.

కాఫీ కలుపుకుని తాగాక వేడి నీళ్ళ గిన్నె స్టవ్ మీదపెట్టి పేపరు చదివేందుకు ఉపక్రమించాడు.

ఈమధ్య అర్జునరావు మనసు నిలకడగా వుండటంలేదు. దానికితోడు రాత్రి చూసిన సినిమామీద ఆలోచనలు ... అతను ఒంటరి మనిషి. తల్లి, తండ్రి, స్నేహితులు, శ్రేయోభిలాషులు-అందరూ తనని పెళ్ళిచేసుకోమని చెప్పేవారే! కాని అతనికి పెళ్ళి చేసుకోవాలని లేదు. వారి పోరు పడలేక పెళ్ళిచూపుల పేర అమ్మాయిలను చూడటం, వారిచ్చే కాఫీ, టిఫిన్లు సేవించటం అర్జునరావుకిష్టం వుండదు. ఈరోజుల్లో పెళ్లిచూపులు ఓ పెద్ద ఫార్సుగా తయారవుతున్నాయి.

తనకేం తక్కువని!

మంచి ఉద్యోగం... పన్నెండువందల జీతం. హాయిగా, దర్జాగా ఖర్చు పెట్టు కోవచ్చు. ఇంటికేమీ పంపనవసరంలేదు. తన సంపాదనమీద తల్లిదండ్రులు ఆధారపడనవసరంలేదు.

తల్లి, తండ్రి సొంత వూరులో వుంటు న్నారు. తండ్రికి నెలకు ఆరువందలదాకా పెన్షను వస్తుంది. ఆ వూళ్లో సొంత ఇల్లు వుంది. ఖర్చులు, బాధ్యతలు లేని సంసారం. కాని అర్జునరావు కూడా వివాహం చేసేయాలన్నదే ఆ కన్నవారి ఆలోచన. కాని కొడుకు అంగీకరించటం లేదు. తనని బలవంత పెట్టవద్దని చెప్పాడు. అందుకే ఈమధ్య అంతగా ఒత్తిడి చేయటంలేదు.

అరగంటసేపు పేపరు చూశాక అర్జునరావు స్నానానికెళ్ళాడు. అతనికి బద్ధకం వదలలేదు. వంట చేసుకోవాలని లేదు. హోటలుకెళ్లి భోజనం చేయాలను కున్నాడు.

స్టెనోగ్రాఫరు ఉద్యోగానికి, గుమాస్తా ఉద్యోగానికి తేడా చాలా వుంది. మొదటి ఉద్యోగంలో ఆఫీసరు రాకుండానే ఆఫీసుకువెళ్ళవలసిన ఆగత్యంవుంటుంది. కాని రెండోదానిలో అదేంలేదు. ఆఫీసరు ఎదురుగా అటెండెన్సు రిజిష్టర్లో సంతకం చేసినా కొందరు ఏమీ అనరు.

అర్జునరావు క్రమశిక్షణకు ప్రాముఖ్యత నిచ్చేవాడనే చెప్పాలి. ఈ అయిదేళ్ల ఉద్యోగ జీవితంలో అతను పాతికమంది ఆఫీసర్ల దగ్గర పనిచేశాడు. అటెండెన్సు రిజిష్టర్లో ఎర్రమార్కు పడనివ్వలేదు. అయ్యగారి స్టెనోనన్న అతిశయం, అహంభావం అతనిలో లేవు. బాస్ల చేత సొంతపనులు చేయించుకోవాలన్న

ఆలోచన, ఆరాటం లేవు. తన పలుకుబడి వుపయోగించుకోటం ఇష్టంవుండదు.

టైము తొమ్మిదిన్నరయింది.

అర్జునరావు ఆఫీసుకు బయలుదేరాడు. బస్టాపులో జనం బాగానే వున్నారు. ఆఫీసులకెళ్ళేవారు, కాలేజీలకెళ్లేవారు, ఒకరనేమిటి...సిటీ బస్సులతో అవసర మున్నవాళ్ళందరూ బస్సులకోసం ఎదురు చూస్తున్నారు.

పదినిమిషాలకు అతనికి బస్సు దొరికింది.

ఆఫీసు చేరేసరికి పదింపావు అయింది. సాధారణంగా ఆఫీసరు పదిన్నరదాటితే గాని రాడు. కాని ఆరోజు పది గంటలకే వచ్చి కూర్చున్నాడు. ఆ సంగతి తెలీక అర్జునరావు తన రూముకెళ్లి రిలాక్సవుతున్నాడు.

అంతలో అటెండరొచ్చాడు.

"అయ్యగారు వచ్చేశారా?" అడిగాడు అర్జునరావు.

"వచ్చారండి ... పది నిమిషాలవుతోంది. మీరు రాగానే రమ్మనమని చెప్పారండి" చెప్పాడు అటెండరు.

అసలు విషయం అప్పుడే గుర్తుకొచ్చింది. ప్రతినెలా చివరివారంలో క్రమశిక్షణా చర్యలమీదవిచారణలు జరపటం... ఫలితాలను ఎస్టాబ్లిష్‌మెంట్ సెక్షనుకు తెలియజేయటం జరుగుతుంది. ఆ తీర్పుల వల్ల ఉద్యోగుల భవితవ్యంలో మార్పు అంతగా వుండలేకపోయినా పాలనా వ్యవస్థలో ఆదొక ఆనవాయితీగానే కొనసాగుతోంది.

అటెండరు మళ్ళీ వచ్చాడు.

"అయ్యగారు పిలుస్తున్నారు"

అర్జునరావు షార్టుహేండు బుక్, పెన్సిలు తీసుకొని బయలుదేరాడు.

"ఏమిటి... ఆలస్యంగా వచ్చావ్!" అన్నట్లున్నాయి ఆఫీసరు చూపులు.

"సారీ సర్... రాత్రి రెండో ఆట సినిమాకు వెళ్ళేను. పొద్దున లేచే సరికి ఆలస్యమయింది. బస్సు దొరకటం కష్టమయింది...." చెప్పాడు సంజాయిషీగా.

"ఇట్సాల్ రైట్... నేను నిన్ను కారణం అడిగేనా? బైదిబై, యివాళ ఎన్ని ఎంక్వయిరీలున్నాయి. ఫైళ్ళు అన్నీ సిద్ధంగా వున్నాయా...పార్టీలు వస్తున్న టైగా?"

"అన్నీ రెడీయే సార్...ఫైళ్ళు అన్నీ నిన్ననే పెట్టాను. పార్టీలు బహుశా ఈరోజు రాకపోవచ్చు. మనం ఎంక్వయిరీ కండక్టు చేయనవసరం లేదు.. మనరొటీను ప్రొసీడింగ్స్ పాలో అవ్వచ్చు సార్"

ఆ ఆఫీసరుకు ఏమీరాదు. తెలియదు. అదృష్టం బాగుండి మూడు వేల రూపాయలజీతస్థాయికి ఎదిగాడు.పొలాల్లో ఎరువులు వేసినా ఫలితం లేకపోయినా, ఈ ఆఫీసరు ఎటువంటి ప్రయత్నం లేకుండానే కాగితాల మీద వ్యవసాయం చేసి, దేశంలో ఆహార సమస్యని నివారించవచ్చు. అందుకు అర్జునరావు మీదే ఆధారపడతాడు సదరు ఆఫీసరు. అతను బుట్టలో వేయడని ఆఫీసరుకు పూర్తి నమ్మకం, గౌరవం వున్నాయి.

ఇటువంటి ఆఫీసర్లని అర్జునరావు ఎందరినో చూసాడు. కాని వారికంటే ప్రస్తుతం వున్న ఆఫీసరే నయం. ఆఫీసును సొంతపనులకు వాడుకోడు.

ఆరోజు ఎంక్వయిరీలు లేవు. పార్టీలు, సాక్షులు రాలేదు, అప్పటికి మూడు నెలల్నుంచి విచారణలు జరుగుతున్నాయి. టేబులు మీద పదహారు ఫైళ్ళున్నాయి.

ఎంతోరుచి...
ఎంతోరుచి...

ప్రియలోనే
వుంది.




అన్ని రకాలలోను అనంతమైన రుచులు
కలబోసి అందిస్తై ప్రియ పచ్చళ్ళు.
తలచుకొంటే చాలు తరగిపోని
రుచిరానుభూతికి- ప్రియ.
ఈనాడే మీ ప్రియను మీ ఇంటికి
తీసుకు వెళ్ళండి.

ంతో రుచి... ఎంతో రుచి...- ప్రియ

ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI MARKETING
PRIVATE LIMITED

"సార్.... ఫైళ్ళకు చేయవలసిన నోటింగ్స్ చేశానా్సర్. తమరు ఓసారి చూసి సైన్ చేయండి" చెప్పాడు అర్జున రావు.

"మళ్లీ నేనెందుకు చూడటం? నువ్వు చూసావుగా... ఎక్కడ సైను చేయాలో చెప్పు...చేసేస్తాను. ఇంతకీ రాత్రి ఏ సినిమాకు వెళ్ళావ్?" అడిగాడు ఆఫీసరు.

అర్జునరావు చెప్పాడు.

"నువ్వు హాయిగా పెళ్లి చేసుకోవచ్చు కదా...అఫ్‌కోర్స్. ఇది నీ వ్యక్తిగతమే ననుకో" అన్నాడు ఆఫీసరు.

"సారీ సర్.... నాకా ఆలోచనలేదు" క్లుప్తంగా చెప్పాడు.

అటెండరు ఫ్లాస్కులో కాఫీ రెండు కప్పుల్లో పోసి వారిముందు వుంచాడు.

"హేవిట్..." అన్నాడు ఆఫీసరు.

తనొక ఆఫీసరన్న భావం ఆయనలో లేదు. స్టెనోని ప్రేమగా చూస్తాడు. సిగరెట్ ఆఫరు చేస్తాడు. సినిమాలకు ఆహ్వానిస్తాడు. షికారుకు రమ్మంటాడు. పండగలకు ఇంటికి భోజనంకు ఆహ్వానిస్తాడు.

ఆఫీసరు గ్రీన్ సిగ్నలు ఇచ్చాడు కదాని, అతి చనువు తీసుకోడు అతడు.

అర్జునరావు తన సీట్లోకి వచ్చేసరికి పన్నెండు దాటింది.

"వాట్ మిస్టర్ అర్జున్... ఏమిటీ రోజింత ఆలస్యం! బాస్‌ని వదిలి రాబుద్ధి కాలేదా. ఎవరో నీ కోసం వచ్చారు.... పాపం, ఇంతవరకూ కూర్చుని వెళ్ళిపోయాడు. నీకిమ్మని ఉత్తరం ఇచ్చాడు. నీ డ్రాయర్లో పెట్టాను" చెప్పాడు కొలీగు స్టెనోగ్రాఫరు.

తనకోసం ఎవరూ రారు. ఎప్పుడైనా తండ్రి వస్తాడు. అప్పుడప్పుడు పెళ్లి కూతుళ్ళ తండ్రులు వస్తుంటారు. అంతకుమించి ఎవరూ రారని అర్జున రావుకు తెలుసు.

"ఎలా వున్నాడు?" అడిగాడు అర్జునరావు.

"అతనికి ముప్ఫైఏళ్ళుంటాయి" చెప్పాడు కొలీగు.

ఆ వ్యక్తి ఎవరై వుంటాడాని అర్జున రావు ఆలోచిస్తూనే, డ్రాయరులో వున్న వుత్తరం తీసాడు.

కవరు మీద "అర్జునరావు, స్టెనోగ్రాఫరు" అని రాసి వుంది. దస్తూరి పరిచయమైనదిగా లేదు. కనీసం 'ఫ్రం అడ్రెస్, కూడా లేదు. ఆత్రంగా కవరు చింపాడు.

కవరులో ఒక ఉత్తరం, రెండు ఫొటోలు వున్నాయి.

ఒక ఫొటో అర్జునరావుది. దాని వెనుక తను ఇది వరకు పనిచేసిన ఆఫీసు చిరునామా వుంది. అది తన దస్తూరీయే! రెండో ఫొటో ఓ అమ్మాయిది. ఒకప్పుడు తన మనసుని పూర్తిగా ఆక్రమించుకున్న ప్రమీల. మొదటిసారి ఆమెని ఆకు పచ్చనిచీర, జాకెట్టు, బొట్టు తోచూశాడు. పూర్తిగా ఆకుపచ్చ రంగు... "హరియాలీ'' అనుకున్నాడు మనసులో.

ఉత్తరంలో సంతకంకోసం చూశాడు. కనీసం పేరు కూడా లేదు. 'డియర్ అర్జునరావ్' అనే సంభోధనతో ఆరంభ మయింది ఉత్తరం.

"మొదటి ఫొటో మీదేనని నేను ప్రత్యేకంగా చెప్పనవసరం లేదనుకుంటాను. రెండో ఫొటోలోని వ్యక్తి ప్రస్తుతం నా భార్య.

నా భార్య కాక ముందు ఆమె బహూశా

మీ ప్రేయసి అనుకుంటాను. అందుకే నేమో మీ ఫొటో ఆమె ఫొటో పక్కనే వుండటం.. అది నా కళ్ళబడటం జరిగింది.

ప్రస్తుతం మీకు ఓ ముఖ్య విషయం చెప్పి తీరాలి.

ఆమెకు నాలుగు నెలల్నుంచి ఆరోగ్యం సరిగా లేదు. డాక్టర్లకు చూపిస్తే, అనారోగ్యంతో బాధపడటంలేదనీ...ఏదో మానసిక దౌర్బల్యంతో తన ఆరోగ్యాన్ని నిర్లక్ష్యం చేస్తోందనీ చెప్పారు. నా భార్య.. అయ్‌మీన్ మీ మాజీ ప్రేయసి నాతో ఈ విషయం చెప్పి మిమ్మల్ని తీసుకు రమ్మంది. బహుశా మీరిది నమ్మలేక పోవచ్చు. కాని ఇది ఎవరూ నమ్మలేని నగ్నసత్యం.

అదృష్టవశాత్తూ మీ చిరునామా ఫొటో వెనుక కనబడింది. కాని, మీ పాత చిరునామా ప్రకారం ఆ ఆఫీసుకు వెడితే, మీరు నాలుగేళ్ళ క్రితమే అక్కడినుంచి బదిలీ అయిపోయారని చెప్పారు. ఈ ఆఫీసులో విచారించాను. చాలా సేపు ఎదురుచూశాను. కానీ మిమ్మల్ని కలుసు కోలేకపోయాను.

ఈ ఉత్తరం చూడగానే బయలుదేరి రండి. మీ ప్రేయసిని చూసి ఆమెకు ధైర్యం కలిగించండి. నా భార్యను నాకు దక్కించండి. ఏమాత్రం ఆలస్యంచేసినా, ఏం జరుగుతుందో చెప్పలేను.

మీ ప్రేయసి ఎక్కడుంటుందో మీకు తెలుసు. అందుకే చిరునామా రాయటం లేదు. మీ రాకకై ఎదురుచూస్తుంటాను."

ఉత్తరం చదివాక అర్జునరావు కొంచెం సేపు ఎలాగో అయిపోయాడు. ఏమీ తోచలేదు. ఎవరీ అపరిచితుడు? శరీరంలో వణుకు బయలుదేరింది. కాళ్ళు, చేతులు వేడెక్కిపోతున్నట్లు అనిపించింది. ఆశ్చర్యంతోపాటు అనుమానం...ఎన్నో సందేహాలు తనని చుట్టుముట్టాయి. ప్రమీల తన ప్రేయసే....అందులో అబద్ధం లేదు. తనకు ఆమెమీద ప్రేమ ఇంకా మునుపటి లాగానే వుంది. మరిచిపోలేకపోతున్నాడు. తన మనస్సును పూర్తిగా ఆక్రమించేసిందామె. అయినా ఇదొక మిస్టరీగా ఉంది. భార్య గత ప్రేమాయణం భర్తకు తెలిస్తే.. అతను అనుమానపడి ఆమెని బాధిస్తాడు. అంతేగాని సహృదయంతో వచ్చి ఆ మాజీ ప్రియుడి భార్య దగ్గరకు తీసుకువెళ్ళి ఆనందించలేడు. ఇందులో ఏదో గొడవ వుండి తీరాలి.

ఈ అగంతకుడు ఒకవేళ తనమీద ప్రతీకారం తీర్చుకోవాలనే వుద్దేశంతోనే ఆఫీసుకొచ్చాడేమో! అదృష్టమో, దురదృష్టమో...తను కలవలేదు. కలిస్తే ఎలా వుండేదో మరి!

ఏడాదిక్రితం ఓసారి ప్రమీలను చూసేందుకెళ్లాడు.నిజానికి ఆమెను చూడాలనుకోలేదు.

విజయవాడ వెళ్ళి తల్లిదండ్రుల దగ్గిర రెండు రోజులు గడిపాక తిరుగుప్రయాణం గురించి ఆలోచిస్తుండగా ప్రమీల గుర్తుకొచ్చింది.

వెళ్ళాలా వద్దా అని చాలా సేపు ఆలోచించాడు.

ఆమెను చూసి నాలుగేళ్ళయింది. ఇపుడామె మరొకరి సొత్తు. అయినా పాత జ్ఞాపకాలు, పరిచయాలు, అనుభూతులు తనని మరిచిపోనివ్వటంలేదు.

అందుకే, ఆరోజు పన్నెండు గంటలకు–

అర్జునరావు ప్రమీల వుండే ఇంటికి బయలుదేరాడు. కాని ఆ ఇంట్లో ప్రమీల కనబడలేదు. ఆ వాటాలో మరెవరో వున్నారు. వారిని అడిగితే తెలియవచ్చు

నను కుంటూంటగా...

"ఎవరు కావాలి?" ఆ ఇంట్లో వుంటున్న యువతి అడిగింది.

"ఇక్కడ ప్రమీల పేరుతో ఓ అమ్మాయి వుండేది...ఆమె అక్క, తల్లి కూడా వుండేవారు..." వివరాలు చెప్పాడు అతను.

"మీకేమవుతారు?" అడిగిందామె.

"తెలిసినవాళ్లు" అన్నాడు.

"వారు ఈ ఇల్లు మారిపోయారు. పోస్టాఫీసుదగ్గర విచారించండి...."

"వాళ్లెళ్లాక మీరే వచ్చారా..వేరెవరైనా వచ్చారా?"

"మేమే వచ్చాము...." అని ఆ యువతి లోపలికెళ్ళిపోయింది.

అర్జునరావు అక్కడినుంచి వెళ్ళక తప్పలేదు. పోస్టాఫీసువేపు నడిచాడు.

ఓ వైపు ఎండ దంచేస్తోంది. మరో వేపు ప్రమీల ఇల్లు దొరకలేదు. ఎలాగ? పోనీ వెళ్ళిపోతే! కాని ఇంత దూరం వచ్చాక చూడకుండా ఎలా వెళ్ళేది? ఆ తరువాత ప్రత్యేకంగా రావాలంటే ఎంతో ఖర్చు... శ్రమ....

పోస్టాఫీసు దగ్గిర నిలబడి, పోస్టుమాను కోసం అటూ ఇటూ చూస్తున్నాడు. కాని ఆచూకీ లేదు.

ఓ ముసలాయన అర్జునరావుని చూసి అనుమానించాడు. ఆ ప్రాంతంలో అతన్ని ఎప్పుడూ చూడకపోవటంతో

"ఎవరు కావాలి?" అడిగాడాయన.

ప్రమీల కావాలని ఆయనకెందుకు చెప్పటం అనిపించింది. ఎలా చెప్పాలో తెలియలేదు. ఏదో చెప్పబోయేంతలో. ఆయనకు అనుమానం పెరిగింది.

"మీరేం చేస్తుంటారు? ఎక్కడినుంచి వస్తున్నారు??" అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు.

ఆయన అడగటంలో ఆశ్చర్యం, అసహజం లేవు. పగలు అలా ఇళ్ళవైపు పరిశీలనగా చూడటం... రాత్రిళ్ళు దొంగతనాలకు బయలుదేరటం.... రోజులు బాగోలేవు... ఎన్నో జరుగుతున్నాయి.

అర్జునరావు జేబులోనుంచి ఆఫీసువా ఇచ్చిన గుర్తింపుకార్డు తీసి చూపించాడు. ఆయన సంతృప్తి చెందాడు.

"నా వుద్దేశం అదికాదు... ఎవరికోసమో వెతుకుతున్నారు కదా.... సాయపడాలన్న వుద్దేశంతో అడిగానంతే" అన్నాడాయన.

"అవుననుకోండి... నేను ఈ వూళ్ళో పెరిగినవాడిని. పదిహేనేళ్ళ క్రితం ఇక్కడికొచ్చాం. ఈ వూళ్ళో ఏడాది ఉద్యోగం చేశాను" అంటూ మరిన్ని వివరాలు చెప్పేసరికి ఆయన వెళ్ళిపోయాడు.

"ఆ మేడమీద అడిగి చూడండి... రెండు మూడుసార్లు ప్రమీలగారిని అక్కడ చూశాను" అంది మొదట చూసిన యువతి. అటు వెడుతూ అర్జునరావుని చూసి చెప్పింది.

ఆమెకు థాంక్స్ చెప్పి ఆ మేడ వేపు నడిచేడతను. తలుపులు వేసి వున్నాయి. కాలింగు బెల్ నొక్కేడు.

ప్రమీల తల్లి సుభద్రమ్మ తలుపు తీసింది. అర్జునరావుని గుర్తించింది.

"మీరా అర్జునరావుగారూ.... బాగు న్నారా? చాలా కాలానికి వచ్చారు.... ఎంతలో బయలుదేరేరు.... ఎక్కడుం టున్నారు? మంచి నీళ్ళు కావాలా?" సుభద్రమ్మ అడుగుతోంది.

"ఈ వూళ్ళో బంధువులింటికొచ్చేను. ఇక్కడికొచ్చానుకదాని మీ ఇంటి

కొచ్చాను.... అంతా బాగున్నారా?" కుశలప్రశ్నలేశాడు.

"మా ఇల్లు ఎలా తెలిసింది?"

"మీ పాత ఇంటికెళ్ళేను. ఆ ఇంట్లో వున్నావిడ చూపించింది" చెప్పాడు అర్జునరావు.

"ఇంకేమిటి విశేషాలు? హైదరాబాదు వెళ్ళిపోయారు.... ఇక్కడుంటే బాగుం డేది కదా..."

"అవుననుకోండి... పరిస్థితులు అలా వచ్చాయి"

అర్జునరావు ప్రమీల కోసం ఆరాట పడుతున్నాడు.ఆవిడేమో కూతురి గురించి చెప్పటం లేదు. కొంపదీసి ఏ వూరైనా వెళ్ళలేదుకదా? అనిపిస్తోంది అతనికి.

"మీ అమ్మాయి లేదా?" అడక్క తప్పలేదు.

"వుంది... పడుకుంది" చెప్పింది సుభద్రమ్మ.

"మీ అల్లుడుగారు కులాసాయేనా! ఇంతకీ ఆయన ఎక్కడ పనిచేస్తు న్నారు!!" మాటవరసకు అడిగాడుకాని, కావాలని అడిగిన ప్రశ్న కాదది.

"స్టేట్ బాంకులో కాషియరు"

"పిల్లలెంతమంది?"

సుభద్రమ్మలో ఏదో అశాంతి గుర్తించాడు. కళ్ళు అద్దుకుంటోందావిడ.

"అడగకూడని ప్రశ్న అడిగానా?" అనుకొన్నాడు.

ఆవిడ లోపలికెళ్ళింది ప్రమీలను లేపేందుకు. అర్జునరావు ముందరి గది గుమ్మం దగ్గిర కూర్చోవటంతో, మధ్య గదిలోకెళ్ళిన సుభద్రమ్మ ప్రమీలను లేపుతున్నట్లు చూస్తూనే వున్నాడు. తల్లీ కూతుళ్ళ మాటలు వినిపిస్తున్నాయి.

"ప్రమీలా.. లేవే! ఆయనొచ్చారు!" తల్లి అంది.

"ఎవరాయన?" అడుగుతోంది ప్రమీల.

"ఎవరేమిటి... అర్జునరావు"

నిజానికి ప్రమీల మొదట్నుంచీ ఆ మాటలు వింటూనే నిద్ర నటిస్తోంది. ఏం జరుగుతుందో చూద్దామనుకుంటోంది.

"ఎందుకొచ్చేరట!" ప్రమీల అడిగింది.

"నువ్వు లేచి ముఖం కడుక్కునిరా! అతను కూర్చున్నాడు పాపం. నేను వెళ్ళి కాఫీ కలిపి తీసుకువస్తా." సుభద్రమ్మ వంటింటిలోకెళ్ళిపోయింది.

అయిదు నిముషాలు భారంగా దొర్లి పోయాయి.

పాల గిన్నె చూసేసరికి సుభద్రమ్మకు నిరాశ కలిగింది. పాలు తోడుకుపోయాయి. మజ్జిగ తను వేసిన గుర్తులేదు.

"ఏమిటి ఆ మొద్దు నిద్ర! అర్జున రావుగారు ఒక్కరే కూర్చుంటే, లేవ వేమిటి!" అందావిడ మళ్ళీ.

ప్రమీలకు అతనిముందరకెళ్ళాలని లేదు.

"వెళ్ళమంటే ఎందుకు వెళ్ళవు. ఏమిటో మొండితనం....పాపం అతను ఎండలో కష్టపడి వస్తే, కనిపించకపోతే ఏం బాగుంటుంది...? లేచి వెళ్ళు!"

"ఇప్పుడు వద్దమ్మా...మీ అల్లుడుగా రొచ్చేవేళయిందికదా! ఆయన చూస్తే ఏం బాగుంటుంది.... ఇప్పటికిభాగోతం చాలు. దయచేసి అతనిని త్వరగా పంపేసెయ్" ప్రమీల మొండిగా చెప్పింది.

సుభద్రమ్మ అర్జునరావు ముందరి కొచ్చింది.

"ప్రమీలకు రాత్రి నుంచి జ్వరం....




అందుకే ఎంత లేపినా లేవటంలేదు''
సర్ది చెప్పింది సుభద్రమ్మ.

అర్జునరావు వారి సంభాషణ వినక పోతేకదా!

"పోనీలెండి...పడుకోనివ్వండి. అనవసరంగా ఎందుకు లేపటం" అన్నాడు అర్జునరావు మరేం తోచక.

ప్రమీల మొండితనానికి మనసులోనే విచారించాడు. ఆ క్షణంలో అక్కడ్నుంచి వెళ్ళిపోవాలనిపించింది. కొంచెం సేపయినా మాట్లాడకుండా ఎలా వెళ్ళేది? ఒక్కసారి కనబడితే బాగుండును...

మరో పదినిముషాల తర్వాత ప్రమీల వచ్చి కుర్చీలో కూర్చుంది.

సుభద్రమ్మ వాళ్ళిద్దరిని మాట్లాడుకోనివ్వాలన్న వుద్దేశంతో లోపలికెళ్ళిపోయింది. అర్జునరావు ఆశ్చర్యపోయాడు.

"ఏమిటి...బాగున్నారా? రాత్రినుంచి జ్వరంగా వుందిటకదా...ఇప్పుడెలావుంది? మందు వేసుకుంటున్నారా?" తల్లీకూతుళ్ళ సంభాషణ విననట్లుగా పలకరించాడు అతను.

ఆమె నిర్లిప్తంగా నవ్వింది.

అతనికి అర్థం కాలేదు.

మళ్ళీ అడిగాడు.

" ఎందుకొచ్చారు?" అందామె హఠాత్తుగా.

ఆశించని, ఎదురుచూడని ప్రశ్న కావటంతో అర్జునరావుఆశ్చర్యపోయాడు.

ఇప్పుడు భర్త వస్తే? ఇప్పటికే తమ వివాహ జీవితం అంతంతమాత్రంగా వుంది. భార్యాభర్తలవి ఏకాంత జీవితాలే. నలుగురి దృష్టిలో ఆమెకు వివాహమయింది. కాని వారి శరీరాలు ఇంత వరకూ కలవలేదు.

ఇద్దరూ ముఖాలు చూసుకోటం తప్పించి మాట్లాడుకోవటంలేదు.

అతనికి బాధగావుంది ... తృప్తిగా నాలుగు మాటలు ప్రమీల నోటిద్వారా వినాలని, ఆనాటి మధుర క్షణాలని ఒక్కసారి ఆమె గొంతులో వినాలని ఆరాటపడుతున్నాడు.

కాని ప్రమీల మూగనోము పట్టినట్లు మవునం దాల్చింది.

మరో పది నిమిషాలు అలాగే గడిచాయి.

ప్రమీల ప్రవర్తనమీద అతనికి కోపం, చికాకు కలిగాయి. తనేంచేశాడని అర్థంకాలేదు అర్జునరావుకు.

అంతలో సుభద్రమ్మ వచ్చింది.

"రాత్రి భోజనం చేసి వెళ్ళండి" అందావిడ.

తల్లివైపు కోపంగా చూసింది ప్రమీల. అతనది గమనించాడు.

"లేదండీ! రాత్రి మా పిన్నిగారింటి కెళ్ళాలి...'' చెప్పాడు.

"పోనీ రేపు రండి!"

"రేపు మీద నాకు నమ్మకం లేదు. ఎందుకంటే రేపు మనదికాదు. మరుక్షణం ఏమవుతుందో? ఏ పరిస్థితులు ఎదురవుతాయో?? నేనే బాల్చీతన్నేస్తానేమో.... ఎవరు చెప్పగలరు?" అన్నాడు వేదాంత ధోరణిలో.

"ఛ ఛ... ఆవేం మాటలండీ" నొచ్చుకుంది సుభద్రమ్మ.

"ఆయనకేం బాధలున్నాయో,మనకేం తెలుసు!'' అంది ప్రమీల అదోరకంగా చూస్తూ.

నిజానికి ఈ మాటలు అర్జునరావుని బాధించలేదు. తన మాజీ ప్రియురాలు నోటినుంచి ఒక్కమాట వినాలనుకుంటున్నాడు. అదే తనకెంతో తృప్తినిచ్చింది.





సుభద్రమ్మ ప్రమీల వైపు 'అలా మాట్లాడకూడదు' అన్నట్లుగా చూసింది, కళ్ళచిట్లిస్తూ.

"మీకేమీ ఇవ్వలేకపోయాను" ఆందా విడ నొచ్చుకుంటున్నట్లుగా.

"ఫరవాలేదండీ. ఆమాత్రం అభిమానం వుండేవాలు" అన్నాడు.

ప్రమీల గోడగడియారం వైపు చూస్తోంది.

"మరిక నేను వస్తాను" లేవబోయాడు అర్జునరావు.

"ఎప్పుడైనా వస్తూవుండండి...." సుభద్రమ్మ అంది.

"తప్పకుండా...మరోసారి వస్తాను"

ఈసారి సుభద్రమ్మకు ఏంచెప్పాలో అర్థంకాలేదు.

అర్జునరావు వెళ్ళిపోయాడు.

"ఏమిటే నీ మొండితనం....అతనొస్తే ఏమీ మాట్లాడవేం, బెల్లంకొట్టినరాయిలా!" అంది తల్లి కోపంగా.

"ఏం మాట్లాడాలి...ఏముందని!" చెప్పింది ప్రమీల. కూతురి మూర్ఖత్వానికి, మొండితనానికి మరోసారి బాధపడింది ఆ కన్నతల్లి.

అర్జునరావు ఇంట్లోంచి బయటికి రావటం దూరాన్నుంచి అటే వస్తున్న ప్రమీల భర్త చూశాడు. ఆమె కూడా అది గమనించింది. జరగబోయేదాని గురించి ఆలోచిస్తోందామె.

* * *

ప్రమీల ఇంటినుంచి బయటకురాగానే అర్జునరావుకు పట్టపగలే చిమ్మచీకట్లు కమ్మినట్లుగా వుంది. ఆమె తనని అవమానించినట్లుగా ఫీలయ్యేడు.

దారిలో ఏలూరు కాలువదగ్గిర ఆగేడు.

కిందకు చూశాడు. నీళ్ళు సుళ్ళు తిరుగుతున్నాయి. భయంకరమైనహోరుగా వుంది. ఒక్కసారి కళ్ళు మూసుకుని కిందకు దూకితే, మరుక్షణంలో ఈ శరీరం ఆ ప్రవాహంలో కొట్టుకుపోతుంది. తన కోసం బాధపడేది కేవలం కన్నవాళ్ళు... తెలిస్తే స్నేహితులు, బంధువులు. కాని ప్రమీలకీవిషయం తెలిసే అవకాశంలేదు. ఒకవేళ తెలిసినా, అంతగా బాధపడదేమో!

అర్జునరావుకు ఎందుకో చావబుద్ధి కాలేదు. ప్రమీల గురించి తను చావటం దేనికి? కన్నవాళ్ళకు గర్భశోకంఎందుకు కలిగించాలి?? తెలివితక్కువపని అనిపించింది.

అందుకే ముందుకు వెళ్ళిపోయాడు.

అయినా ప్రమీలగురించే ఆలోచనలు. సుభద్రమ్మ మాట్లాడినదాంట్లో పదోవంతయినా ప్రమీల మాట్లాడకపోవటమే అర్జునరావుని బాధిస్తోంది.



## 2

హైదరాబాదు తిరిగివచ్చినప్పట్నుంచీ అర్జునరావులో ఆ విజయవాడ అనుభవాలే, ప్రమీలతోటి పరిచయాలే, ఆ జ్ఞాపకాలే ఫ్లాష్ అవుతున్నాయి.

అయిదేళ్ళగతం కదిలిందికళ్ళముందు.

అర్జునరావు టైపిస్టుగా ఉద్యోగంలో చేరినపుడు అతనికున్నది టైపులో లోయరు సర్టిఫికేటు మాత్రమే. షార్టు

హేండు అంతక్రితమే పాసయ్యాడు. ఎప్పట్నుంచో టైపు హయ్యరుకూడా పాసవ్వాలనే సంకల్పం. కాని అంతగా అభిలాష చూపించకపోవటానికి కారణం– అప్పట్లో తను ఉద్యోగస్తుడు కాకపోవటమే. అదృష్టం బాగుండి నిరుద్యోగ సామ్రాజ్యాన్ని ఎక్కువకాలం పాలించకుండానే ఈ ఉద్యోగం దొరికింది.

పేపర్లలో రోజూ ఉద్యోగప్రకటనలు చూసేవాడు మంచి ఉద్యోగం కోసం.

అందరికీ టైపు హయ్యరు....లేదా హైస్పీడు కావాలి. టైపిస్టు ఉద్యోగం అంటే ఉదయంనుంచి సాయంత్రందాకా టైపుమిషను దగ్గిర కూర్చుని టైపు చేస్తూనే వుండాలి. అందులో ఈ గుమాస్తాగాళ్ళు అవసరమున్నా లేకపోయినా ప్రతిదీ టైపిస్టు ముఖాన పారేసి చక్కాపోతారు. కొంచెం చేసినదే మరిన్నిసార్లు టైపు చేయిస్తారు. అడ్డమైన చాకిరీ టైపిస్టే చేయాలి.

వేళ్ళ నొప్పులు.. ఏకాగ్రత కావాలి. టైపిస్టుమీద ఎవరికీ సదభిప్రాయం వుండదు. ఎంత చదువుకున్నా 'టైపిస్టు' ఉద్యోగం అనేసరికి ఏదో ప్యూను ఉద్యోగంలాంటిదనే భావన కలుగుతుంది.

కాని స్టెనోగ్రాఫరు అనేసరికిగుర్తింపు, గౌరవం కలుగుతుంది. ఆఫీసరు దగ్గిరుండటంవల్ల... భయం వుంటుంది. షార్టుహేండు తాలూకు అదనపు అర్హత ఈ గుర్తింపు, గౌరవం, భయం సంపాదించిపెట్టాయి.

ఆఫీసులో రెండు మూడు నెలల అనుభవంలోనే తెలుసుకున్నాడు అర్జునరావు. కొన్ని ఆఫీసుల్లో టైపిస్టులనే స్టెనోగ్రాఫరులుగా తీసుకుంటుంటారు, ప్రమోషన్లు ఇచ్చేప్పుడు.

దాంతో టైపు హయ్యరు ప్రాక్టీసు చేయాలన్న ఆలోచన అతనిలో బాగా నాటుకుపోయింది. నిజానికి తనకు అంతగా ప్రాక్టీసు అవసరంలేదు. కాని పరీక్షకెళ్ళాలంటే ఓ టైపురైటరు కావాలి. ఆఫీసు మిషను పరీక్షహాలుకు తీసుకువెళ్ళేందుకు ఆఫీసువాళ్ళు అంగీకరించరు. కాబట్టి తప్పనిసరిగా ఏదో టైపు ఇన్‌స్టిట్యూటులో చేరాలి.

"పరీక్ష పాసయ్యేందుకు ఎన్ని తిప్పలురా దేవుడా!" అనిపించింది.

"కోణార్క టైపు ఇన్‌స్టిట్యూట్‌లో చేరు. వ్యక్తిగత శిక్షణ వుంటుంది. మంచి మిషన్లు వున్నాయి. మిగిలినవాటికంటే ఛార్జీ ఎక్కువ. ఓ అరగంట ఎక్కువ ప్రాక్టీసుచేసినా ఎక్కువ డబ్బు ఇవ్వవల్సి వస్తుందని అనడు ప్రొప్రయిటరు" అన్నారు చాలామంది.

ఇంటికి దగ్గిరలోవున్న అయిదారు ఇన్‌స్టిట్యూట్లలో విచారణ చేశాడు అర్జునరావు. తను విన్నది నిజమేననిపించింది.

అతను కోణార్కలో చేరిపోయాడు.

కాని ప్రాక్టీసు సరిగాచేసేవాడు కాదు. క్రమంగా వెళ్ళేవాడు కాదు. తన స్పీడు చాలు, పాసవగలనన్న ధీమా అతన్ని ఆవిధంగా చేయించేది. తను చేరింది పరీక్షకు మిషను తీసుకెళ్ళేందుకని ప్రొప్రయిటరుకేంతెలుసు?

"అర్జునరావుగారూ! మీరు వెళ్లేది హయ్యరు పరీక్షకు. ఈ స్పీడు చాలదు. మామూలు స్పీడుకంటే మూడింతలు ఇక్కడుంటేనే పరీక్ష హాల్లో స్పీడు వుంటుంది. మీకంతగా ఇష్టంలేకపోతే పరీక్షకు కట్టకండి. మా ఇన్‌స్టిట్యూట్‌కు ఫలితాల్లో మంచి పేరుంది.మరోలా భావించకండి. అనవసరంగా ఫీజు వృధా చేసుకో

కండి!"

అది డైవు ఇన్‌స్ట్రిక్టరు సలహా రూపంలో మందలింపు.

అర్జునరావుకు పౌరుషం కలిగింది. అహం దెబ్బతింది.

"అయితే ఏం చేయమంటారు?" అడిగాడు అతను.

"రోజూ వదలకుండా ప్రాక్టీసు చేయండి" చెప్పాడు ఇన్‌స్ట్రిక్టరు.

"చేయచ్చు...కాని నాకు సాయంత్రం వీలుపడదు. మా బాస్ వెళ్ళేవరకూ వుండాలి. మా బాస్ అంటే హెడ్ డైపిస్టులెండి. ఉదయంపూట ఎనిమిదినుంచి తొమ్మిది దాకా నాకు కేటాయించగలరా?" అడిగాడు అతను.

ఇన్‌స్ట్రిక్టరు టైము చార్టు చూశాడు.

"సారీ....ఆ టైములో ఈ మిషను మీద ప్రమీల ప్రాక్టీసు చేస్తుంది. ఆమెకు కొత్త గనుక వేరే మిషనుమీద ప్రాక్టీసుచేసినా లేదా మరో టైముకు మార్చుకున్నా మాకభ్యంతరం వుండదు"

"అయితే ఆలస్యందేనికి ... ఆమెను అడిగిచూడండి" అర్జునరావు చెప్పాడు.

"ఆ పని మీరే చేస్తే బాగుంటుంది. మేము ఇటువంటి విషయాల్లో కల్పించుకోము" ఇన్‌స్ట్రిక్టరు అన్నాడు.

అర్జునరావు సాయంత్రాలు ప్రాక్టీసు చేసాడు. తన మిషను మీద ఉదయం ప్రాక్టీసుచేసేది ఓ అమ్మాయి అని తెలిసిందప్పుడు. తనకింతవరకూ అమ్మాయిలతో పరిచయంలేదు. నిజానికి ఆడవాళ్ళకంటే ముందర తనే సిగ్గుపడిపోతాడు. అమ్మాయిలవైపు చిలిపిగా చూడటం, రాచుకు తిరగటం, ప్రేమాయణం సాగించటం,వారిని సినిమాలకు షికార్లకు ఆహ్వానించడం ఎన్నడూ జరగలేదు.

అటువంటిది ప్రమీలను సరాసరి అడగటమా? ఎందుకో అతనికి ధైర్యం చాలలేదు. ఆ ఏర్పాటు ఇన్‌స్ట్రిక్టరుచేస్తే, బాగుంటుందని అర్జునరావు అభిప్రాయం. కాని అతను ముందరే చెప్పేశాడు. తనిపుడు ఎలాగో ధైర్యంతెచ్చుకుని అడిగితే ఆమె అంగీకరిస్తుందో లేదో?

రెండు రోజులు అలా ఆలోచనలతోనే దొర్లిపోయాయి.

ఆరోజు తొమ్మిదిగంటలకు కొంచెం ముందే వచ్చి ప్రమీలను చూసి వెళ్ళి ఇన్‌స్టిట్యూట్‌కు కొంచెం దూరంలో నిలబడి ఆమెకోసం ఎదురుచూడసాగాడు అర్జునరావు.

ఆమె కాగితాలు చేతపట్టుకుని నెమ్మదిగా వస్తోంది.

అతనికి ఇన్‌స్టిట్యూట్‌లో అందరి ముందర అడిగే ధైర్యం లేదు. పైగా అడిగి వీలులేదనిపించుకోవడం అసలే ఇష్టం లేదు. అందుకే ఈ ఏర్పాటు!

ప్రమీలకు పద్దెనిమిదేళ్ళ వయసుంటుంది. తెల్లగా, పొడుగ్గా వుంటుంది. మెడలో ఏదో రోల్డ్‌గోల్డ్ గొలుసుంది. ఆకుపచ్చని చీర...అదే రంగు జాకెట్టు... ఆకుపచ్చ తిలకం...హవాయి చెప్పులు.. తలెత్తిచూస్తే తన అందాన్ని కీచకులెవరైనా దోచుకుంటారేమోనన్న భయమేమో-తల వంచుకుని నడుస్తోంది. ధరించిన బట్టలనుబట్టి పెద్దగా ఏమీ తెలియటంలేదు. మధ్యతరగతి కుటుంబానికి దిగువస్థాయితోవున్నట్లనిపించింది అర్జునరావుకు.

ఇద్దరిమధ్యా దూరం పది అడుగులు.

ఆ దూరాన్ని మరింత దగ్గరకు ఎలా తీసుకురావాలి?

అర్జునరావు ప్రమీల పక్కగావచ్చి

నెమ్మదిగా నడుస్తున్నాడు. ఆమె అతని వైపు చూడగానే "ఎక్స్‌క్యూజ్ మీ!" అన్నాడు.

"ఏం కావాలి?" అన్నట్లు అందమైన కళ్లు ఆశ్చర్యంగా ప్రశ్నించాయి.

"మీకభ్యంతరం లేకపోతే అలా పక్కకు వెళ్ళి రెండు నిమిషాలు మాట్లాడుకుందాం. నావల్ల మీకు ఏ ప్రమాదమూ వుండదు...ప్లీజ్!" అన్నాడు వణుకుతూనే.

ప్రమీల అతని అవస్థకు జాలిపడింది.

"ఇక్కడ మాట్లాడితే ఏమట?" అందామె.

"ఏమీలేదు ... ఎవరైనా చూస్తే ఏం బాగుంటుంది?"

"ఫరవాలేదు...చెప్పండి" ప్రమీల అతన్నే పరిశీలనగా చూస్తూ అంది.

"అబ్బే....ఏంలేదు. మీరు మీ టైముని మార్చుకున్నాసరే లేదా మరో టైపు మిషనుమీద అదే టైముకు ప్రాక్టీసు చేసుకున్నా సరే. ఇన్‌స్ట్రక్టరు మిమ్మల్ని అడగమన్నాడు" చెప్పాడు అర్జునరావు.

"అతనే అడగవచ్చు కదా!"

"అఫ్‌కోర్స్ ... అడగచ్చు. కాని మనమిలా కలుసుకునే భాగ్యం కలిగేది కాదుకదండీ! మీకిబ్బంది అయితే వద్దులెండి!"

అతని మాటల్లో అభ్యర్థన, అర్థింపు మిళితమయ్యాయి.

ఇద్దరూ దగ్గిరలో వున్న పార్కు గేటు దగ్గర నిలబడ్డారు.

"మీరేం చేస్తున్నారు?" అడిగిందామె.

"అయామ్ సారీ....నా పేరు అర్జునరావు. టైపిస్టు ఉద్యోగం. మా ఇల్లు గాంధీ నగరం పార్కు ఎదురుగా" చెప్పాడు అర్జునరావు.

"నేనడిగేది అది కాదండీ!"

అతను గ్రహించాడు.

"నేను హయ్యరు పరీక్షకు ప్రాక్టీసు చేస్తున్నాను. అది పాసయితేగాని, నాకు ముక్తి మోక్షం లభించవు. అవి వుంటేనే జీవితానికి గుర్తింపు. లేకపోతే ఇలాగే టైపుమిషనుమీద కొడుతూ కూర్చోవాలి. అందుకే ఈ ఆరాటం"

"ఆలోచించి రేపు చెప్తాను"

ప్రమీల వెళ్ళిపోయింది. అతనికి మాట్లాడే అవకాశం మరి లేకపోయింది.

అర్జునరావు రోడ్డుమీద నడుస్తున్నాడు. అతని ఆలోచనలు హరియాలీ మీదే వున్నాయి. ఆమె రూపం, సొగసు, సౌందర్యం!

రేపు ఏం జవాబు చెబుతుందో?

మర్నాడు రావటానికి ఎన్నో యుగాలుగా తోచింది.

తొమ్మిది గంటలయింది. అర్జునరావు పార్కు దగ్గర ప్రమీల రాకకోసం ఎదురు చూస్తున్నాడు.

మరో అయిదు నిమిషాలు గడిచాయి.

హరియాలీ వస్తోంది.

"నమస్తే" అన్నాడు అర్జునరావు.

హరియాలీ ఆశ్చర్యపోయింది.

"ఏమాలోచించారు?" అడిగాడు.

మరో రెండు నిముషాలు దొర్లిపోయాయి నిశ్శబ్దంగా.

"అన్ని టైపు రైటర్లు ఒక్కటేకదా! నాదే ఎందుకు కావాలి..అయ్ మీన్ టైపు మిషను" అంది ప్రమీల పెదిమలమధ్య బిగించిన నవ్వుని కనబడనీయకుండా.

"అక్కడే మీరు పొరబడుతున్నారు. అది మీదికాదు. మీదికాకముందు నాదే అది. ఐ మీన్ ముందర నేను టైపు చేస్తున్నాను. అలవాటయిన మిషనుకాబట్టి





ఇంకా సులభంగా వుంటుందని అడిగాను"

మంచి చమత్కారే అనుకుందామె.

"నిజమేననుకోండి ... కాని కొత్త మిషనుకు మారితే అది అలవాటయేందుకు కొంతకాలం పట్టచ్చు అదే ఆలోచిస్తున్నాను" ప్రమీల ఆకాశం వేపు చూడసాగింది.

అర్జునరావు ఆలోచనలో పడ్డాడు.

"మీకంతగా ఇష్టం లేకపోతే పోనీలెండి. నేనే మరో ఏర్పాటు చేసుకుంటాను. తంటాలు పడతాను'' చెప్పాడు అతను.

అర్జునరావు బాధపడ్తున్నట్లుగా గ్రహించింది ప్రమీల.

''సరే అయితే, మీ దారికి నేను అడ్డు రానులెండి!'' చివరికి ప్రమీల ఒక నిర్ణయానికి వచ్చి చెప్పింది.

''థాంక్స్ ప్రమీలా! నన్నర్థం చేసుకుని నీది నాకిచ్చినందుకు చాలా సంతోషం. రేపే ఇన్‌స్ట్రక్టరుతో ఈ విషయం చెప్తాను''

అర్జునరావు మాటలకు ప్రమీల ఆశ్చర్యంతో చూసింది.

కొన్ని సెకన్లు నిశ్శబ్దం.

"ఏమిటీ...అలాగే చూస్తూండిపోయావు?'' అన్నాడు.

''ఏమీలేదు. నిన్నటివరకూ మీరెవరో, నేనెవరో కాని ఇంతక్రితం మీ సంబోధన ఏకవచనంలోకి మారినందుకు..అందుకే!" ప్రమీల తల వంచుకుని సిగ్గుపడుతోంది.

''ఓహో...అదా! అయాం సారీ...'' చెప్పాడు అర్జునరావు.

''పరవాలేదులెండి ... నేను తప్పుగా భావించటంలేదు. అయినా మీసమాత్రం నన్ను అలా పిలవాలనుకోలేదు కదా! లీవిట్!''

ప్రమీల ముందుకు వెళ్ళిపోయింది.

పదుగెత్తుకెళ్ళి ఇన్‌స్ట్రక్టర్‌కు ఆ శుభవార్త చెప్పాడు.

"మీరు అదృష్టవంతులు అర్జునరావుగారూ!'' ఇన్‌స్ట్రక్టరు అభినందిస్తూ చెప్పాడు.

"ఎందుకూ?'' అడిగాడతను.

''మొత్తంమీద ప్రమీలను ఒప్పించగలిగావు. మీలా ఆవిడతో మాట్లాడే ధైర్యం ఎవరికీ లేకపోయింది....''

'మిగిలినవాళ్ళకు ఎందుకు ధైర్యం లేదు? ఇన్‌స్ట్రక్టరు ద్విపాత్రాభినయం చేయటం లేదు కదా' అనుకున్నాడు అర్జునరావు.

అతని మస్తిష్కంలో ఎన్నో ప్రశ్నలు.

మరో మూడు రోజులు తర్వాత...

అర్జునరావు డ్యూటీచేసి ఇంటికెడుతోంటే హరియాలీ దుస్తుల్లో ప్రమీల కనబడింది రోడ్డుమీద. ఆమెను చూడగానే ఆగాడు.

"గుడ్ మార్నింగ్ మిస్ హరియాలీ!" అన్నాడు అర్జునరావు.

'ఎవరు?'అన్నట్లుగా చూసింది ఆమె.

"సారీ... ఇవాళ నువ్వు హరియాలీ రంగులో.... ఐ మీన్ పూర్తి ఆకుపచ్చ రంగు దుస్తుల్లో వున్నావు. మన తొలి పరిచయం కూడా ఇదే హరియాలీలో జరిగింది. ఐ లైక్ దిస్ కలర్ వెరీమచ్!" నవ్వాడతను.

'నిజంగానా?' అనలేకపోయింది.

"నేను బ్లూ కలరంటే ఇష్టపడతాను. తరువాత ఆకుపచ్చ రంగు. దేశానికి ఆహారం సమకూర్చేది ఈ ఆకుపచ్చ రంగు వున్న పొలాలే! ప్రకృతిలో చెట్లు ఈ రంగులోనే వుంటాయి. హరియాలీ అంటే దేవుడికెంత ప్రాణమో ఇప్పుడు నిన్ను చూస్తోంటే అర్థమవుతోంది"కవిత్వ

ధోరణిలో చెప్పాడు.

"మీరు రచయితలా?" అడిగింది హరియాలీ నవ్వుతూ.

"కాదు... మామూలు పాఠకుడిని!"

"ఇంతకీ ప్రాక్టీసు ఎలా వుంది?" అడిగిందామె.

అర్జునరావుకు అసలు విషయం అప్పుడే గుర్తుకొచ్చింది. ఆమెను చూసిన తన్మయత్వంలో అడుగుదామనుకున్న విషయం మరిచేపోయాడు.

"నువ్వు టైపుకు రావటంలేదే!" అన్నాడు.

ప్రమీల దిక్కులు చూసింది.

అతను ఆమె మెడవైపు పరిశీలనగా చూశాడు. బంగారపు గొలుసు కాదది. లాకెట్ మంగళసూత్రంలా లేదు. పైగా పాతబడిపోయివుంది.

"నీ సహజ సౌందర్యానికి ఆ గొలుసు ఎబ్బెట్టుగా వుంది" అన్నాడు.

ప్రమీల కళ్ళ వెంబడి కన్నీళ్లు!

"సారీ...నువ్వెందుకో బాధపడ్తున్నట్టుంది!" అర్జునరావు మాటల్లో స్వరంకు బ్రేకు పడినట్లనిపించింది.

"నువ్వు నాతో చెప్పకుండా టైపు మానకూడదు... ఈ మూడు రోజులు నాకెంతో అనీజీగా వుంది. ఎలా చేశానో తృప్తిలేదు... కాబట్టి నువ్వు నా పక్కనుంటే, స్పీడు పెరుగుతుంది. ఆ స్పీడులో వేగం వుంటుంది. అక్షరాల పొందిక వుంటుంది... నా లక్ష్యం నెరవేరుతుంది"

ప్రమీల అతని మాటల్లోని చమత్కారాన్ని చవిచూస్తోంది.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?" ప్రశ్నించాడు అర్జునరావు.

"ఆహా... ఏమీలేదు. మీ మాటలు నన్ను ఆలోచింపజేస్తున్నాయి. మీరుతెలిసే మాట్లాడుతున్నారో లేక..."

"నేను ముందే చెప్పానుగా, నా అభిమాన రంగు హరియాలీ. బహుశా అదే నన్నిలా మాట్లాడిస్తోందేమో!" అన్నాడు.

"కాని మీరభిమానించే రంగుల్లో హరియాలీకి రెండో స్థానమే గా!" చెప్పిందామె.

"కోపమొచ్చిందా.... బ్లూ కలరులో అందం వుంటుంది. హరియాలీలో ఆకర్షణ వుంది....కాబట్టి దేని ప్రత్యేకత దానికే వుంది నా దృష్టిలో. సారీ .... మనమిలా నడిరోడ్డుమీదే మాట్లాడుకుంటున్నాం. నీకు వేరే పని లేకపోతే టైపుకు పది నిముషాలు ముందర రాగలవా?" అర్థించాడతను.

"నేను రాగలను...కాని మీ గురించి నేను ఇన్‌స్టిట్యూట్ ముందు ఎదురు చూడవలసిందేగా. మీకు పనులుంటే, కాదని ఈ హరియాలీ కోసం ఎలా రాగలరు? కాబట్టి...కాబట్టి .... ఇదే.... ఇదే బాగుంటుందేమో"

"లేదు. నీకోసం ముందరే వస్తాను. ఆలస్యంగా ఇంటికెడతాను. ఫరవాలేదు. కాని నువ్వు మాత్రం రెగ్యులర్‌గా టైపుకు రావాలి"

హరియాలీ వెళ్ళిపోయింది.

ప్రమీల వెనుకనుంచి కూడా అందంగానే వుంది. పొడుగాటి జడ పిరుదులమీద సన్నగా కదులుతోంటే ... అర్జునరావు ఆమెనే చూస్తున్నాడు.

అప్పట్నుంచీ అర్జునరావు, ప్రమీల పక్కపక్క టైపు మిషన్లమీద టైపు చేయసాగారు. అతనిది హయ్యరు స్పీడు కావటం వల్లనో, హరియాలీ పక్కనుండటం వల్లనో అతనివేళ్లకి బోర్డుమీద




వేగంగా కదిలిపోతున్నాయి. తన స్పీడుకు హరియాలీ ఆశ్చర్యపోతోంది.

'ఏమిటి .... అంత స్పీడా? టైపు మిషను తట్టుకోగలదా?' అన్నట్లు అర్జున రావునే చూస్తుందామె.

ఆ ఏడు కోణార్క ఇన్‌స్టిట్యూట్ నుంచి హయ్యరు పరీక్షకు పదిమంది వెళ్ళగా, అర్జునరావు మాత్రమేపాసయ్యేడు. లోయరు పరీక్షకు పదహారుమంది హాజరయితే, హరియాలీతోపాటుఆరుగురుపాసయ్యేరు.

ఫస్ట్ అటెంప్ట్‌లో అర్జునరావు హయ్యరు పాసయినందుకు ఇన్‌స్ట్రక్టర్ ఆశ్చర్యపోయాడు. సాధారణంగా రెండు మూడుసార్లు హాజరయితేనేగాని విజయం పొందటం జరగదని ఇన్‌స్ట్రక్టరు ఉద్దేశం.

"మీ విజయానికి నాకెంతోసంతోషంగా వుంది. మీరు తప్పకుండా పార్టీ ఇవ్వాలి" అన్నాడు ఇన్‌స్ట్రక్టరు.

"అయితే సాయంత్రం ఇస్తాను పార్టీ... ఆ ఏర్పాట్లు మీరే చేయండి. డబ్బు నేను ఇస్తాను" చెప్పి వెళ్ళిపోయాడు అర్జునరావు, ప్రమీలతో చెప్పేందుకు.

"సారీ అర్జునరావుగారూ! నాకు పార్టీలంటే ఇష్టం వుండదు. అందులో నలుగురిముందూ నిలవటం అంటే కూడా నాకు చిరాగ్గా వుంటుంది. అసలు మీతోనే నేనిలా మాట్లాడగలుగుతున్నానంటే నాకే ఆశ్చర్యంగా వుంది. మీ మనసు నొప్పిస్తున్నానని అనుకోకపోతే, మీ ఇంటికొచ్చి మీ ఆతిథ్యం స్వీకరిస్తాను. ఈ విషయంలో మాత్రం నన్ను బలవంతపెట్టకండి"

హరియాలీ మాటలకు అర్జునరావుకు ఎంతో ఆశ్చర్యం వేసింది.

"సరే నీ ఇష్టం" అని అర్జునరావు కాగితంమీద తన ఇంటి అడ్రెస్సు రాసిచ్చి వెళ్ళిపోయాడు.

నాలుగు రోజుల తరువాత ప్రమీల అర్జునరావు ఇంటికెళ్ళింది అరగంటలకు. తల్లికి పరిచయం చేసాడతను.

ప్రమీలకు ఇద్దరక్కయ్యలు, ఓ తమ్ముడు, చెల్లెలు. తండ్రి ఆమె చిన్నతనంలోనే అంటే పదేళ్ళ వయసులోనే చనిపోయాడు. విమల ఆమె పెద్దక్కయ్య. వివాహం చేసుకోలేదు – కేవలం కుటుంబ భారాన్ని నెత్తిన వేసుకున్నందుకు. స్టేట్‌బ్యాంకులో పనిచేస్తూ వారినందరినీ పోషిస్తోంది. వారికి వేరే ఆస్తిపాస్తులు లేవు. తండ్రి పోయేనాటికి పదిహేనువేలు అప్పు మిగిలింది... అంతే.

నెలకు రెండువందలు చొప్పున తండ్రి చేసిన అప్పు తీరుస్తూంది విమల. కాబట్టే సామాన్య జీవితం.... ప్రమీలకు మెడలో ఏ ఆభరణం లేకపోవటం.

హరియాలీ – అర్జునరావుల మధ్య కాలక్షేపం అరగంట నడిచింది. అతనికి తెలియకుండానే, ఆమెపట్ల ప్రేమాభిమానాలు ఏర్పడ్డాయి. కారణం తెలియదు. ప్రమీలను చూస్తుంటే ఒక్క విషయంలో మాత్రం అతనికి బాధగా వుంటోంది... అది ఆమె మెడ!

ప్రేమ గుడ్డిదో లేక ఆకర్షణకు కళ్ళు బానిసో అర్జునరావుకు తెలియదు.

అతని తల్లి ప్రమీలకు కాఫీ ఇచ్చింది. మరికాసేపటికి హరియాలీ ఇంటికెళ్ళిపోయింది. ప్రమీల అదే ఇన్‌స్టిట్యూట్‌లో హయ్యరు ప్రాక్టీసు చేస్తూనే వుంది. దాదాపు ఇరవై రోజుల తరువాత –

అర్జునరావు ఆఫీసుకొచ్చేసరికి, ప్రమీల అతని సీటు పక్కనే స్టూలు మీద కనబడింది. ఆశ్చర్యంతో, "ఏమిటి హరియాలీ!" అన్నాడు.




"ఊరికెనే... ఇంట్లో తోచటం లేదు. అక్కయ్య బాంకు కెళ్ళిపోయింది. బోరుగా వుంది...ఇలా వచ్చేసాను" అంది హరియాలీ నవ్వుతూ.

అందమైన పెదవుల వెనుక దాగిన ముత్యాల పలువరుసకు అతను ముగ్ధుడయ్యాడు.

టైపు మిషను పక్కన టైపు చేయవలసిన ఫైళ్ళు పడివున్నాయి.

"ఇవన్నీ టైపు చేయాలా మీరు... ఆ పక్క మిషను ఖాళీదేనా? నేను సహాయం చేయనా!" అందామె.

"ప్రభుత్వ ఉద్యోగంలో మొదట నేర్చుకోవలసినది – పని పెరగనీయటం. పని పెండింగులో వుంటేనే బాగా పని చేస్తున్నట్లు లెక్క. చేసేవాడికి పని ... చేయనివాడికి జీతం ఇక్కడి రాజనీతి! ఎంత బద్ధకంవుంటే అంత పనివాడికింద లెక్క! పని నిలిపేసి ఎదుటివాడికి మనమెంతో పనితో సతమతమవుతున్నట్లు పోజు పెట్టాలి. అప్పుడే జాలి, సానుభూతి కలుగుతాయి. అంతగా ముఖ్యంగా కావలసిన పనుంటే వారే వచ్చి అడుగుతారు"

"మీరు గీతాసారాన్ని బాగా గ్రహించేరు" అంది హరియాలీ.

"కాఫీ తాగొద్దాంపద" అన్నాడు.

ఇద్దరూ హోటలుకెళ్ళారు.

"నువ్వేం తీసుకుంటావ్?" అడిగాడు అతను బేరరు చెప్పిన పదార్థాలు విన్నాక.

"నాకేం తీసుకోవాలనిలేదు ... ఊరికేనే మీ ఆఫీసుకు వచ్చాను. ఇంటికెళ్ళి ఎటూ భోజనం చేస్తానుకదా!" అందామె నవ్వుతూ.

"రెండు కాఫీ" చెప్పాడు అర్జునరావు.

ఇద్దరూ కాఫీ తాగాక బయటికి నడిచారు.

"మీరు మా ఇంటికోసారి రావాలి ఎప్పుడొస్తారు?" అడిగింది ప్రమీల.

"ఇప్పుడేగా ఆహ్వానించింది. అడ్రస్ చెప్తే ఎప్పుడో ఓసారి వస్తాను" అర్జునరావు అన్నాడు.

* * *

భూమిలో విత్తనం పెట్టాక అది మొలకెత్తక మానదు. మొక్క పెరగక మానదు. ఆ మొక్కకు మరికొన్ని కొమ్మలు, వాటికి తీగలు, ఆకులు రాక పోవు. మొక్క వేగాంకదాని దానికి నీళ్ళు, ఎరువు వేయకుండా వుండరు. తర్వాత అది పూలు పూస్తుంది... ఆ పూలు కాయలు అవుతాయి. అయితే ఎన్ని నిలబడతాయన్నదే ప్రశ్న.

అర్జునరావు వేసిన మొక్క హరియాలీ రూపంలో పువ్వులు స్థాయికి ఎదిగింది.

ఒకరోజు ప్రమీల వాళ్ళింటికెళ్ళాడు. ఆమె తనవారికి పరిచయం చేసింది. అతను వెళ్ళిపోతుంటే చెమర్చిన కళ్ళతోటే వీడ్కోలు చెప్పింది.

ఒక ఆదివారం పన్నెండు గంటల సమయంలో అర్జునరావు హరియాలీ ఇంటికెళ్ళాడు. విరబూచిన మల్లెమొగ్గలా మంచంమీద పడుకుని ఏదో నవల చదువుకుంటోంది. అతను బెల్ కొట్టాడు.

ప్రమీల తలుపు తీసింది.

'ఎవరీ మెరుపుతీగె!' అనుకున్నాడు స్వగతంలోనే.

"ఎవరూ లేరులావుందే! దేవిగారు ఏకాంతంగా పుస్తకపఠనంలో నిమగ్నమయ్యేవులావుందే!" అన్నాడు అర్జునరావు.

"అవును .... మావాళ్ళు అనకాపల్లి వెళ్లారు అక్కయ్య దగ్గరకు. వాళ్లబ్బాయికి అన్న ప్రాశనంపుందంటే!"

"మరి నువ్వెళ్ళేదిలేదా?"

"వెళ్లాలనుకున్నాను కాని టైపు ప్రాక్టీసొకటి నా కర్మానికి. పైగా పరీక్షలు దగ్గరవుతున్నాయి" తొలగిన పమిటను సర్దుకుంటూ చెప్పింది హరియాలీ.

"అంతేనా...?"

కొన్ని సెకనులకుగాని ఆమెకు ఆ మాటల్లోని ఆంతర్యం బోధపడలేదు.

"చాలా రోజుల్నుంచీ మీకి స్పెషల్ టిఫిను చేసిపెట్టాలనుకుంటున్నాను. ఈరోజు అన్నీ కుదిరాయి" అందామె.

"ఏమిటి?" అడిగాడు అర్జునరావు.

"ఆమ్లెట్ తింటారా?"

"నేను పుట్టుకతో శాఖాహారిని...కాని ఎగ్గేరియన్ని అప్పుడప్పుడు"

"అయితే మీరలా బుద్ధిగా వీక్లీ చూస్తూవుండండి...పదినిమిషాల్లో ఆమ్లెట్ తీసుకువస్తాను"

హరియాలీ వంటింటిలోకి వెళ్లింది.

ప్లేటులో నాలుగు గుడ్లు వున్నాయి. పచ్చిమిర్చి, అల్లం, ఉప్పు, కారం తీసి స్టవ్వు దగ్గిర పెట్టింది.

కాసేపట్లో హరియాలీ రెండు ఆమ్లెట్లు ప్లేటులో వేసి అతనిముందు పెట్టింది,

"తినండి నేతితో వేశాను. వేడిగా తింటేనే బాగుంటుంది" అంటూ.

"నువ్వు తినిపిస్తేనే"

ఆమె సిగ్గుతో తల దించుకొంది బరువుగా!

"ఈ గొలుసు నీకోసం!" అన్నాడు అర్జునరావు జేబులోంచి బంగారుగొలుసు తీసి.

"ఎందుకండీ ఇది" అందామె తడి కళ్ళతో.

"ఆడవాళ్ళకు ఏది లేకపోయినా ఏదో వెలితిగా కనబడుతుంది. సరోజ్ మంచి చీరకు కింద అందమైన పరికిణీ వుండాలి. అలాగే మాచింగ్ జాకెట్, అందమయిన ముఖానికి స్నో, పౌడరు; నుదుట ఎర్రని బొట్టు, చక్కని జుట్టుకు అందమైన జడ... ఇలా ఏది లోపించినా బాగోదు కదా. అలాగే మెడకు ఓ ఆచ్ఛాదన... అదే ఓ చిన్న గొలుసు వుంటే నువ్వు ఇంకా బాగుంటావ్!"

"మీరు బాగా మాట్లాడతారు!" అంది హరియాలీ.

"ఇంతకీ గొలుసు ఎలా వుంది?" అన్నాడు అతను.

"గొలుసు బాగుంది. కాని దీనిని మా అమ్మ ఎదురుగా ఇవ్వండి. అక్కయ్య అసలే అనుమానపు మనిషి. వారికి నేనెలా చెప్పగలను? మీరు అంతగా నాకివ్వాలనుకుంటే అలా చేయండి!"

హరియాలీ ఎంతతెలివయినది! తనకా ఆలోచనే తట్టనేలేదు! మరుసటి ఆదివారం అర్జునరావు మళ్ళీ ప్రమీలఇంటికెళ్లాడు.

"మీరు మరోలా భావించకపోతే, నాదో చిన్నమాట!" అన్నాడు అతను సుభద్రమ్మతో. ఆవిడ ప్రమీల తల్లి.

ఆవిడ అర్థంకానట్లు పెద్దకూతురి వేపు చూసింది.

పక్కనే ప్రమీల నిలబడి వుంది.

ఆవిడ ముఖంలోని భావాలు కొద్దిగా మారినట్లు గమనించాడతను.

"నేనిలా ఇవ్వడంలో మరో ఉద్దేశం లేదు. మిమ్మల్ని అవమానపరచాలని కాదు. సహృదయంతో చేస్తున్న ఈ పనిని మీరంగీకరిస్తే..." నసిగాడు అర్జునరావు గొలుసు పైకి తీస్తూ.

 

సుభద్రమ్మకు అర్థమయింది. ఇద్దరు కూతుళ్ళతో లోపలికెళ్ళింది. ముగ్గురూ ఏం మాట్లాడుకున్నారో అప్పునరావుకు బోధపడలేదు.

"గొలుసు ఎంతకి కొన్నారు?" అడిగింది ప్రమీల అక్క విమల. చెప్పాలా వద్దా అని కొంచెంసేపు సంశయించాడు.

"నాలుగు వందలు" కొన్న ఖరీదుకు రెండువందలు తగ్గించి చెప్పాడు.

"చూడండీ... మీరిలా చేయటం మంచిది కాదు. మీ ఉద్దేశాన్ని మేమర్థం చేసుకోగలం. కాని లోకులు కాకులు. దీని ధర నేను ఇచ్చేస్తాను. అందుకు ఇష్టపడితేనే ఆ గొలుసు ప్రమీల మెడలో వుంటుంది" చెప్పింది అక్కయ్య.

ఏమనేందుకు తోచలేదు అతనికి.

తను అనుకొన్నదొకటి. ప్రమీల అక్క ఇలా అంటుందనుకోలేదు అప్పునరావు.

వారం తర్వాత అతను ప్రమీలను శివాలయం దగ్గర చూశాడు. ఆరోజు శని వారం. ఆలయంలో ఓ వేపు వెంకటేశ్వర స్వామి గుడి కూడా వుంది.

"అలా వస్తావా?" అడిగాడు.

హరియాలీ అనుసరించింది.

ఇద్దరూ విగ్రహం ఎదురుగా నిలబడగానే, పూజారి పరుగెట్టుకొచ్చాడు - వాళ్ళు ఏదో పూజ చేయించేందుకొచ్చారనుకుని.

"అష్టోత్తర పూజ చేయండి" అన్నాడు అప్పునరావు.

అతని పక్కనే హరియాలీ.. ఎవరికైనా సహజంగా కలిగే భావన... దంపతులని.

గోత్రనామాలు అడిగి పూజ చేయసాగాడు పూజారి.

పూజారి ఆ దైవం గుళ్ళో ప్రతినిధి.

ఆయన దృష్టిలో వారిద్దరూ భార్యాభర్తలు!

ఇద్దరూ ఆశ్చర్యంగా ముఖాలు చూసుకున్నారు.

రెండు జీవితాలు ఆరోజు నుంచీ మరో మలుపులో ప్రయాణమయ్యాయి.

ఒకరోజు ప్రమీల అక్క రెండు వందలు పంపించింది, తనకిచ్చేవని. ప్రమీల మనస్సు చివుక్కుమంది.

"అక్కా, నేనిస్తే బాగుండదేమో... నేను అతన్ని పిలుచుకొస్తాను. నీ చేతుల మీదుగా ఇవ్వు" అంది తెలివిగా.

సరేనంది. విమల మస్తిష్కంలో మరో ఆలోచన.

రెండురోజుల తరువాత అప్పునరావు ప్రమీల ఇంటికెళ్ళాడు.

హరియాలీ ప్రేమ వృక్షం పూలు విరగబూస్తోంది.

నెలకు మూడు నాలుగు సార్లయినా ఆమె అప్పునరావు ఇంటికి వెళ్ళటం... అతని తల్లికిది నచ్చకపోవడం జరుగుతోంది.



## 3

హరియాలీ - అప్పునరావుల స్నేహానికి ఎనిమిది నెలలు నిండుతూండగా ఒక రోజున ప్రమీల అతని ఆఫీసుకు వెళ్ళింది.

అప్పుడు టైము ఒంటిగంట అవుతోంది. నెల చివరిలో టైపిస్టులకు పని ఒత్తిడిగా వుంటుంది. ఏవో స్టేట్‌మెంట్లు, రిపోర్టులు హెడ్డాఫీసుకు పంపించాలి.

ముగ్గురు టైపిస్టులలో ఒకడు సిక్ చేసేడు. రెండోవాడు ఈ పనినుంచి తప్పించు కుందుకు, పెల్లిగ్రాం రప్పించుకుని వూరి కెళ్ళిపోయాడు. మిగిలినది అర్జునరావు మాత్రమే!

సరిగ్గా ఆ సమయంలో వచ్చింది ప్రమీల.

"హలో! అర్జునరావుగారూ .... గుర్తున్నానా?"

"హరియాలీ! ఏమిటి... కొత్తగా మాట్లాడుతున్నావ్! ఊపిరి తీసుకోవట మేనా మరుస్తానేమో, నిన్ను ఎలా మరిచి పోతాననుకున్నావు? ఇంకెప్పుడు అలా మాట్లాడకు" అన్నాడతను నొచ్చుకుంటూ.

అతని మనసు నొప్పించినందుకు విచారించింది ఆమె.

"ఏమిటి విశేషం?" అడిగాడు.

"ఏమీలేదు! అక్క, అమ్మ పనిమీద గుంటూరు వెళ్ళారు. ఇంట్లో బోరుగా వుంది. అందుకని మ్యాట్నీ సినిమాకెళదా మని బయల్దేరాను....వస్తారా?"

అర్జునరావు గతుక్కుమన్నాడు.

"మీ తమ్ముడు, చెల్లెలు లేరా?"

"అన్నీ మీకు గుర్తుంటాయి కాని ఈ విషయం ఎన్నిసార్లు చెప్పినా మీకు ఎందుకు గుర్తుండదు!"

"ఏమని చెప్పావ్"

"అదేనండీ... వాళ్ళిద్దరూ రెండో అక్కయ్య దగ్గరుంటున్నారని"

"బాగానే వుంది. ఇంతకీ మీ బావ గారు ఎక్కడ పనిచేస్తున్నారు?"

"బాంకులో ప్రొబేషనర్ ఆఫీసరు"

ప్రమీల రాకలోని ఆంతర్యం బోధపడ లేదు అర్జునరావుకు.

"శ్రీనివాసలో మంచి రొమాంటిక్ తెలుగు సినిమా వచ్చింది. వెళదాం... పదండి" అంది ప్రమీల.

"చంపేశావ్! ఈ వేళ అసలు వూపిరి సలపటం లేదు. ఇద్దరు టైపిస్టులు డుమ్మా కొట్టేశారు. బోలెడంత పనుంది. 'ఇది వదిలిపోతే ఇంతే సంగతులు... ఎలాగ కుదురుతుంది" అన్నాడు.

రానని డైరక్టుగా చెప్పకుండా ఈ ఫ్లాష్‌బాక్ ఎందుకు! ఆమెకు కోపం వచ్చేసింది.

ప్రమీలకు ఇట్టే కోపం వచ్చేస్తుంది.

"సినిమా ఎన్ని గంటలకు?" అడిగా డతను.

"మూడు గంటలకు... మనం వెళ్ళే సరికి పెద్దగా ఆలస్యం కాదు. న్యూస్‌రీలు, వ్యాపార ప్రకటనలు రోజూ చూసేవేగా" చెప్పింది ప్రమీల.

"నేనాలోచించేది పని గురించి"

"నేను హెల్ప్ చేస్తానులెండి... ఇంతోటి పనికి అంతగా బుర్రపాడు చేసుకోవాలా!" అర్జునరావుని లైనులో పెట్టాలన్న వుద్దేశంతో అందామె.

"కాని నువ్వు చేసేందుకు రూల్సు ఒప్పుకోవుగా..." అభ్యంతరం చెప్పాడు అతను.

"ఏమిటండీ రూల్సు... రూలు ప్రకారంగా అంతా నడుస్తున్నారా! పార్ట్‌టైం చేసేవారందరికీ ప్రభుత్వం అనుమతిఇస్తున్నదా?"

అర్జునరావు ప్రమీల తెలివితేటల్ని మెచ్చుకున్నాడు. సూపర్నెంటు అనుమతి కోరి, కొన్ని లెటర్లు ఆమెకిచ్చాడు– టైపు చేసేందుకు.

గంటలో వుత్తరాలన్నీ టైపు చేసేశారిద్దరూ కలిసి.

"అర్జంటు పనిమీద బైటకెళుతు న్నాను" అంటూ అర్జునరావు హాఫ్‌డే





సెలవు చీటీ సూపర్నెంటుకిచ్చాడు.

అతనామె పక్కగా నడుస్తుంటే థ్రిల్లింగ్‌గావుంది.

థియేటరు చేరేసరికి మార్నింగ్‌షో ఇంకా వదల్లేదు.

ప్రమీల చేతికి డబ్బు ఇచ్చాడు అర్జున రావు— ఆడవాళ్ళ లైనులో జనం అంతగా లేకపోవటంతో.

అరగంట తరువాత టిక్కెట్లివ్వటం జరిగింది.

ఇద్దరూ థియేటరులోకి అడుగు పెట్టారు.

• • •

ప్రమీల, వాళ్ళ రెండో అక్కయ్య వూరుకెళ్ళింది రెండురోజులక్రితం. విమల ఏదో నవల చదువుతోంది. సుభద్రమ్మ బియ్యం ఏరుతోంది.

"అర్జునరావుగారు ప్రమీలకు గొలుసు ఇవ్వటంలో ఉద్దేశం ఏమైవుంటుంది?" హఠాత్తుగా అడిగింది విమల.

"నేనూ అదే ఆలోచిస్తున్నాను" ఊహించని ప్రశ్నకు ఆశించిన విధంగా జవాబు చెప్పలేకపోయింది సుభద్రమ్మ.

"ప్రమీలను ఇక టైపు మానిపిద్దామంటే, షార్టుహేండు నేర్చుకోమన్నావ్- టైపు హయ్యరు చాలదని. అది అర్జునరావుతో ప్రేమాయణం నడుపుతోందని నా అనుమానం. ఎందుకిదంతా! అదేమయినా ఉద్యోగం చేస్తుందా! మానిపించేస్తేసరి"

"ఊరికే ఇంట్లో కూర్చుని ఏం చేస్తుంది? పోనీ నేర్చుకోనీ..." సమర్థించింది సుభద్రమ్మ.

"ఏమయినా, నువ్వు దాన్ని ఇలా సమర్థించబట్టే, నెత్తెక్కి కూర్చుంది. అర్జునరావు ఉద్దేశం ఏమిటో!'' విమల సందేహం వెలిబుచ్చింది.

"అతను అంగీకరించినా, తల్లిదండ్రులు ఒప్పుకుంటారా వారివివాహానికి. పెళ్ళనేసరికి ఎన్ని సరిపోవాలి? కులం గోత్రం, ఆస్తి అంతస్తు, మంచిమర్యాద" సుభద్రమ్మ మనసులో మాట బయట పెట్టింది.

"అతను చేసేది టైపిస్టు ఉద్యోగం. రోజులెలావున్నాయి ? భార్యాభర్తలిద్దరూ ఉద్యోగం చేస్తేనే రోజులు గడవటం లేదు. ఏది చూసినా కొనలేకున్నాం. అటువంటిది, అతనికొచ్చే స్వల్ప జీతంతో సంసారం ఎలా గడపగలరు? అతనేమీ ఊరికే దీనిమెళ్లో తాళికట్టడు. అతనికి ఇద్దరు చెల్లెళ్లున్నారుగా. మనం అంత వరకూ తూగగలమా? అదీగాక కులాంతర వివాహం చేసే, భవిష్యత్తులో పిల్లల పెళ్ళిళ్లు ఎలా జరుగుతాయి కథలు, సినిమాలు సందేశాలని, బోధనలని ఇవ్వగలవుగాని ఆచరణలో అసాధ్యం. వయసు, అందం, కాసేపు అన్నింటినీ మరిపిస్తుంది. అది కాస్త చల్లబడగానే ఇంతే సంగతులు"

సుభద్రమ్మ విమల అభిప్రాయం గ్రహించింది.

"మరి ఏం చేద్దామంటావు?"

"మా బాంకు మేనేజరుగారి కొడుకు వున్నాడు. రోజులనిబట్టి ఓ అమ్మాయితో ప్రేమాయణం నడిపాడు. కాని విధి వక్రించింది. ఆ అమ్మాయి చనిపోయింది. ఒకవిధంగా అతన్నిచ్చి పెళ్ళి చేసేందుకు మేనేజరుగారికి, ఆయన భార్యకు అభ్యంతరం లేదు. నిజానికి వారిదీ ప్రేమ వివాహమే. ఇద్దరూ కులాంతర వివాహం చేద్దామనుకుంటున్నారట తమ కొడుక్కి. ఆయనే ఓరోజు మన ప్రమీల

గురించి అడిగారు. ఏమంటావ్'' అంది విమల తల్లివైపు చూస్తూ.

"ఓపనిచేస్తేసరి రేపు అమ్మాయి వచ్చాక ఆ అబ్బాయిని, మీ మేనేజరుగారిని మనింటికి తీసుకురా. ఇంతకీ తనేం చేస్తున్నాడు?''

"మరో బాంకులో పని చేస్తున్నాడు''

సుభద్రమ్మకు కూతురు సలహామీద నమ్మకం ఏర్పడింది.

• • •

ఆరోజు-ఆదివారం. అప్పునరావుని ఆఫీసుకు రమ్మనమని సూపర్నెంటు కబురు పంపించారు.

రెండింటికి ప్రమీల వెళ్ళేసరికి ఇంట్లో అతని తల్లి మాత్రమే వుంది.

ఇద్దరిమధ్యా పదినిముషాలు కబుర్లు దొర్లాయి.

'ఈ అమ్మాయిని మావాడికి చెప్పారు. ఎలావుంది!' అని అడగాలను కుంటోంది అప్పునరావు తల్లి డ్రాయరు మీదున్న ఫోటో చూపించి.

కాని హఠాత్తుగా చూపిస్తే, ప్రమీల తట్టుకోలేకపోవచ్చు ననుకొందావిడ.

"చూడు ప్రమీలా... నువ్విలా తరచు మా ఇంటికి రావటం, ఎవరైనా చూస్తే ఏం బావుంటుంది? వాళ్ళేమను కుంటారు? మావాడితో తిరుగుతున్నావని నలుగురికీ తెలిస్తే నీకు పెళ్ళవుతుందా? మగాడికేముంది, ఎలాగైనా అవుతుంది! చూస్తున్నావుగా.... అన్నీ సవ్యంగా వుంటేనే ఈరోజుల్లో ఆడపిల్లలకు పెళ్ళిళ్లు అవటంలేదు. ఇటువంటిదేదో వుంటందే, ఈలోకం దానికి రంగుపూసి మరింతగా వ్యాఖ్యానిస్తుంది. కాబట్టి ఆలోచించుకో'' అంది అప్పునరావు తల్లి.

ప్రమీల గొంతు పెగలలేదు. గాలి మేడలు ఒరిగిపోయాయి. ఆమె చూపులు పక్కనే డ్రాయరు మీదున్న ఫోటో మీదకు మళ్లాయి.

'ఇదన్నమాట అసలు విషయం... వ్యవహారం చాలా దూరమే వచ్చిందన్న మాట.... ఫోటో చూపించకుండా,



చల్లగా దావుకబురు చెప్పిందన్నమాట' అనుకుంది.

అయితే తను నిబ్బరంగా కూచ్చుంది. కాని అలా ఎంత సేపని!

అర్జునరావు ఎంతకీ రాకపోయేసరికి ఆమె వెళ్ళిపోయింది.

సప్తసముద్రాలు పొంగి కన్నీళ్ళుగా మారినట్లుగావుంది ప్రమీల పరిస్థితి. అద్దంలో చూసుకుంది. కళ్ళు ఎర్రగా వున్నాయి. ముఖం పాలిపోయి వడిలి నట్లుగా వుంది. తను అర్జునరావుని పెళ్ళాడలేకపోతే ఆ ఏర్పాటు ఎంత దారుణంగా వుంటుందో ఆమెకిప్పుడిప్పుడే బోధపడుతోంది. కాని అక్కయ్యకు, తల్లికి తన పరిస్థితి తెలిస్తే వారేవిధంగా భావిస్తారో! వారికి తన పరిస్థితి తెలియకూడదు. అందుకే శుభ్రంగా ముఖం కడుక్కొని జడవేసుకుంది. చీర మార్చుకుంది. కొత్త పెళ్ళికూతురిలా కనిపిస్తోందామె. పరాకును తెలియనివ్వకూడదని ప్రమీల నవలా పఠనం చేయసాగింది.

కాని మనసు నవల మీద నిలవకపోయినా కళ్ళని అక్షరాల వెంబడే పోనిస్తూ ఏదో ఆలోచిస్తోనేవుంది.

అక్కడ-అర్జునరావుక్కూడా బడలికగా వుంది. ఉదయంనుంచి డ్రైవు చేస్తుండటంతో వేళ్ళు నొప్పులు పుడుతున్నాయి. ఇంటికెళ్ళగానే స్నానంచేసి ప్రమీల ఇంటికి వెళ్ళాలనుకున్నాడు.

దేవుడి సృష్టిలో ఆడదానికి మహత్తు, శక్తి వుందేమో! ఆమె అందానికే మగాడు బానిసవుతాడేమో!!

"మీరు నా సొంతం కావాలి" ప్రమీల అర్థిస్తున్నట్లుగా తోచింది.

"అందుకు నాకేంలాభం?" తాను అడిగినట్లు ఓ భావన.

"లాభంతోపాటు ప్రయోజనం కూడా వుంటుంది. ప్రసాదంతోపాటు తీర్థం... అంతే నిత్యనైవేద్యం ఈ దేవుడికి వుంటుంది!"

"ఏ ప్రసాదం ఇస్తావ్?"

"మీరు కోరుకునేదేదైనాసరే... నేను ఇచ్చేందుకు సిద్ధం...." అర్జునరావు ఆలోచనలు ఒక్కసారిగా ఆగిపోయాయి.

కాని అతను ఆమె ఇంటికి వెళ్ళలేక పోయాడు ఏదో పనివల్ల.

పదిరోజులు గడిచిపోయాయి.

ప్రమీల అర్జునరావు ఆఫీసుకు వెళ్ళింది. అతని టేబులుమీద ఫైళ్ళు నిద్రావస్థలో వున్నాయి.

'ఈమధ్య ప్రమీల ఎందుకు కన బడటంలేదు?' అప్పటికి పదిసార్లయినా అనుకొనివుంటాడు అర్జునరావు.

అలా అనుకున్న అరగంటకు ప్రమీల దర్శనమిచ్చింది.

తన హరియాలీలో మునుపటి అందం, ఆకర్షణ చూడలేదు అతను. రూపం మారిపోయింది. కళ్ళల్లో ఎరుపుదనం... నిర్లక్ష్యంగా చేసుకున్న వస్త్రధారణ... మాటల్లో ఏదో వెలితి...స్వరంలో చెప్ప లేని లోటు...

తను చూసేది తన ప్రేయసినేనా? అనుకొన్నాడు అర్జునరావు.

"ఏం ప్రమీలా....అలా వున్నావ్? కనబడటంలేదే! వంట్లో బాగుండటంలేదా? ఏమయింది?" అడిగాడు తను.

కొద్దిక్షణాలు నిశ్శబ్దం.

"మీకు పనిలేకపోతే, నాతో రావా లనుంటే అలా బయటకి రాగలరా?" అంది ప్రమీల తల దించుకొని.

"ఏమిటిహరియాలీ.... ఇలా కొత్తగా మాట్లాడుతున్నావ్ ! నువ్వు రమ్మంటే





నేను రాకపోతానా! నిజానికి ఇంత పని వున్నా నీకోసం జపంచేస్తూకూర్చున్నాను. దేవిగారి దర్శనంతో కొంచెం ఉపశమనం కలిగింది. పద వెడదాం...ఏదైనా మార్నింగ్‌షోకెడదామా? హాఫ్‌డే సెలవిస్తాను"

కాని ప్రమీలకు ఆ మాటలు రుచించ లేదు.

"వద్దులెండి మీతో కొంచెం మాట్లాడాలి"

ఇద్దరూ రైల్వేస్టేషనువైపు నడిచారు. కాంటీనులో ఓ మూల కూర్చున్నారు.

"మొన్న ఆదివారం మీ ఇంటి కొచ్చాను. మీరు ఆఫీసుకువెళ్ళారని మీ అమ్మగారు చెప్పేరు" తనే ముందు మాట్లాడింది.

"అవును. నెలాఖరుగదా అర్జంటుపని వుందని సూపర్నెంటు కబురంపిస్తే వెళ్ళవలసి వచ్చింది" చెప్పాడతను.

"మీ 'ప్రద్ధి' ఫొటో చూశాను. అమ్మాయి చాలా బాగుంది. చక్కటి రూపం, నున్నటి బుగ్గలు..."

అతనికి మాటలు ఆశ్చర్యం కలిగిస్తున్నాయి.

"ఇంతకీ వరం ఎంత?ఎప్పుడు పెళ్ళి?" సూటిగా అడిగింది. అర్జునరావు నిశ్చేష్టుడయ్యాడు.

"ఇదిగో మీ గొలుసు. మీరునాకిచ్చిన దబ్బు... ఈ గొలుసు, నా మెడలోవుండే అర్హతను పోగొట్టుకుంది. మీలో కూడా అందరి యువకుల్లాగే స్వార్థం వుంది. మీ రేటుకు మేము తూగలేకపోవచ్చు. మీకులంతో నేను సరిపోకపోవచ్చు...." ప్రమీల ఆవేశంలో పిచ్చిగా మాట్లాడుతోంది.

"ఈ గొలుసును మరో అమ్మాయికి ఇవ్వకండి. ఫొటోలోని అమ్మాయికే తాళికట్టండి! జీవితంలో ఎప్పటికయినా ఆపిల్ల మనసు, హృదయం అర్థం చేసుకొనేప్రయత్నం చేయండి.ఎవరినయినా ఒక్కసారే మోసం చేయవచ్చు. కాని ఆ మోసానికి భవిష్యత్తులో శిక్ష, ఫలితం వుండకపోదు. దయచేసి నన్నిక మరిచిపోయి, మీ 'ప్రద్ధి' గురించి ఆలోచించండి"

ప్రమీల గొలుసు టేబులుమీద పెట్టేసి బయటికెళ్ళిపోయింది. అర్జునరావుకు మాట్లాడే అవకాశం కూడా ఇవ్వలేదు.

రెండురోజుల తరువాత తల్లికి చెప్పింది ప్రమీల, తను వారు చూపించే కుర్రాడిని వివాహం చేసుకోదలచుకున్నట్లు.

విమల మనసులోనే అర్జునరావు తల్లిని అభినందించింది. బాంకు మేనేజరుతో వారి కొడుకుని వచ్చి ప్రమీలను చూసుకోమని చెప్పింది.

అలాగే సుబ్బారావు వచ్చి ప్రమీలను చూసాడు.

తన అంగీకారం తెలిపాడు.

* * *

అర్జునరావు ఇంటికి రాగానే తల్లిని అడిగాడు- ఆ ఫొటో ప్రమీలకు చూపించావా అని.

"అవును... చూపిస్తే తప్పేముంది? ఆమె శ్రేయస్సు కోరే చెప్పాను. నీకు నువ్వుగా నీ పెళ్ళి విషయం తనకు చెప్పలేవు. పాపం, ఆ పిల్ల నీమీద ఎన్నో ఆశలు పెట్టుకుంది....నువ్వంటే సరదా పెంచుకుంటోంది. కాని మీ వివాహానికి మేము ఎలా అంగీకరించగలం? మన కులం ఏమిటి. మీ నాన్న ఒప్పుకోరు - అసలు నువ్విలా ఆ అమ్మాయితో ప్రేమాయణం సాగిస్తున్నావంటే! మీ స్నేహాన్ని

ఇంతటితో నిలిపివేయాలనే చెప్పాను.... అది తప్పా?" అంది తల్లి.

"నేను పెళ్ళంటూ చేసుకుంటే ఆ అమ్మాయినే చేసుకుంటా లేదా ఇలాగే వుండిపోతాను...ఈ విషయంలో ఎవ రెన్ని విధాల చెప్పినా వినను. నా మనసు ఆమెకే పరిమితం...." నిశ్చయంగా చెప్పాడు అర్జునరావు.

"ఏరా... సినిమా డైలాగులు వల్లిస్తున్నావా?"

"కాదు. నా అభిప్రాయం చెపుతున్నాను. మీరు నాకేవిధమైన పెళ్ళి ప్రయత్నాలూ చేయవద్దు. ఆ ఫొటోను వారికి పంపించేయండి. లేకపోతే వాళ్ళు మనమీద ఎన్నో ఆశలు, నమ్మకాలు పెంచుకుంటారు. అనవసరంగా వారిని మభ్యపెట్టవద్దు. పంపిస్తే వేరే ప్రయత్నించుకుంటారు. ఇంతే నేను చెప్పేది" మరోసారి చెప్పాడు గట్టిగా.

అర్జునరావు పట్టుదల, నిశ్చయం తల్లికి తెలియనిది కాదు. ఆ రాత్రే ఆవిడ భర్తతో కొడుకు అభిప్రాయం చెప్పి మర్నాడే వారికి ఉత్తరం రాయించింది.

పదిహేను రోజుల తరువాత అర్జునరావుకు స్టెనోగ్రాఫరుగా ప్రమోషను వచ్చింది. అతన్ని హైదరాబాదు ట్రాన్సఫరు చేసారు.

హెడ్డాఫీసులో చేరిన నెలరోజులకు అతని పేర శుభలేఖ వచ్చింది. ప్రమీలకు సుబ్బారావుతో పెళ్లి!

కాని, అర్జునరావు ఆ శుభలేఖ అందుకునేసరికే పెళ్ళయిపోయింది. అతనిలో అగ్నిజ్వాల... బడబాగ్ని...ఉన్న ఒక్క ఆశ నిరాశగా మిగిలిపోయింది. ఇదంతా ఆ ఫొటో చేసింది. నిజానికతడు ప్రమీలను కలిసి నిజం చెప్పాలనే అనుకున్నాడు.

తనవద్ద మిగిలిన ప్రమీల చిరునామా శుభలేఖలో వున్న చిరునామాకు వేరు వేరుగా శుభాకాంక్షలు తెలుపుతూ వుత్తరాలు రాసాడు.కాని అవి ప్రమీలకందేయో లేవో అతనికి తెలియదు.

కాలచక్రం ఆగకుండా కదిలిపోతూనే వుంది.

అర్జునరావు ఆలోచనల గతంనుంచి తేరుకున్నాడు.

• • •

అప్పట్నుంచీ అర్జునరావుకి ప్రమీల గురించి తెలియటంలేదు. రెండు మూడు వుత్తరాలు కూడా రాస్తే జవాబులేదు. ఆ తరువాత ఉగాదికీ, దీపావళికీ గ్రీటింగ్సు పంపించాడు. అవి అందాయో లేదోగానీ జవాబు లేదు.

మరో రెండేళ్ళు వదలకుండా నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలిపాడు. అంతటితో ఆగక విమలకు కూడా బాంకు అడ్రస్సుకు ఉత్తరం రాశాడు. అయినా జవాబు మాత్రం రాయలేదు ఎవరూ.

ఆ ఏడు కృష్ణా పుష్కరాలు.

అర్జునరావు నలుగురు స్నేహితులతో కలిసి తిరుపతివెళ్ళి, వస్తూ విజయవాడలో దిగాడు. పుష్కరస్నానం చేసి, కనకదుర్గ గుడికెళ్ళి దేవీ దర్శనం చేసుకోవాలనుకున్నారు. వారిదగ్గర సూట్ కేసులున్నాయి. లగేజీ స్టేషను క్లోక్ రూములో పెట్టి కృష్ణానదికి వెళ్ళాలని ప్రయత్నం.

అతనికి ప్రమీల గుర్తుకొచ్చింది.

ఒక్కసారి చూడాలని...ఇన్నాళ్ళూ కళ్లకు పట్టిన వియోగాన్ని ఒక్కసారిగా వదిలించుకోవాలని ఆశపడ్డాడు.

''నేను మా బంధువుల ఇంటికెళతాను. మీరు నాకోసం చూడకుండా మీ పనులు చూసుకురండి'' చెప్పాడు స్నేహితులతో.




అప్పసరావు సరాసరి ప్రమీల ఇంటి కెళ్ళాడు. ఇల్లంతా సందడిగా వుంది. 'ప్రమీలని ఎలా పిలవాలి? భర్త చూస్తే తన పరిస్థితేమిటి ? ?' అనుకుంటూనే గుమ్మంలో ఎదురైన వ్యక్తితో కబురం పాడు లోపలికి.

ప్రమీల కిటికీనుంచి అతన్ని గుర్తించింది.

"ఇంట్లో లేనని చెప్పి పంపించు" ప్రమీల చెబుతున్న మాటలు విన్నాడు అప్పసరావు.

తిరుగుముఖం పట్టాడు. అదే ఆఖరు సారి ఆమెను చూడటం.

* * *

టైపు నేర్చుకుంటున్న రోజుల్లో తన పాస్‌పోర్టు సైజు ఫొటోని ప్రమీలకిచ్చాడు అప్పసరావు. ఫొటో వెనుక తను పనిచేసే ఆఫీసు ఎడ్రస్ రాశాడు.

తన ఫొటో ఇన్నాళ్ళకు తిరిగొచ్చింది. అది ఆమె భర్తకెలా దొరికింది! ఈ ఉత్తరంలో నిజమెంతో! ప్రమీలతో తన ప్రేమాయణాన్ని ఆమె భర్తకెవరూ చెప్పలేదుకదా! ఒకవేళ తనమీద ప్రతీకారం తీర్చుకోవాసికి కాదుకదా ఈ ప్రయత్నం? అయినా పెళ్ళయ్యాక ప్రమీల తన ఫొటోను ఎందుకు పారేయ లేదు? తనకు అనారోగ్యంగా వుందనీ, తను వచ్చిచూస్తే ప్రమీల కోలుకుంటుందనీ రాసినంతమాత్రాన నిజమనుకోవాలా? బ్లాక్‌మెయిల్ చేసేందుకు కాదుకదా!

అప్పసరావు వెంటనే ఉత్తరం రాసి పడేశాడు—

"మీరు అనారోగ్యంతో వున్నారని తెలిసి చాలా విచారించాను.

మంచి మందులు వాడుతుండండి. అనవసరమైన ఆలోచనలు పెట్టుకోకండి. ఒక్కొక్కసారి మనశ్శాంతి అనేక దీర్ఘ వ్యాధులను నయంచేస్తుంది. మీరు త్వరలో కోలుకోవాలని కోరుకొంటున్నాను" అని.

అప్పట్నుంచీ అప్పసరావుకు ప్రమీల ఆరోగ్యం గురించే విచారం. రోజూ నిద్రలో ఏవో పీడకలలు రాసాగాయి. ఆమె స్వస్థత పొందాక తనకి తెలుస్తుందా ఆ శుభవార్త?

నాలుగు నెలల తరువాత...

అప్పసరావుకు ఉత్తరం వచ్చింది. అదే కస్తూరి! ప్రమీల భర్త రాశాడు. ఆత్రంగా చదవసాగాడు.

"ఇది నా రెండవ ఉత్తరం. మొదట్లో నేను రాసినట్టుగా మీరు వస్తారని ప్రమీల ఆశించింది. కాని ఎందుకు రాలేదో తెలియ లేదు.

"మీకు కోపకోపటంవల్లనో లేక మరి ఏ కారణంవల్లనో ప్రమీల ఆరోగ్యంగానే వుంటోంది. మీ ఉత్తరం చదివి ఆమె ఎంతో సంతోషించింది. తానే జవాబు రాయాలనుకున్నది. కాని నీరసంవల్ల రాయలేక నన్ను రాయమని కోరింది. మీరెప్పుడైనా ఈ వైపువస్తే మా ఇంటికి రావాలని నా అభ్యర్థన"

ఉత్తరం చదివాక అప్పసరావు మనసు ఎంతో తేలికపడింది. ఒక్కసారి ప్రమీలను చూడాలనిపించింది. అంత లోనే భయం...ఆందోళన..విచారం...

ఈ ఉత్తరాలు ఎందుకొస్తున్నాయి? ఈ విషయాలు నిజమేనా!?అనుమానాలు.. సందేహాలు....ప్రశ్నలు...

ఇదంతా అగమ్యగోచరంగా వుంటోంది అప్పసరావుకు. ఉత్తరాన్ని పదే పదే చదువుకున్నాడు. ఏదో ఆత్రం... ఆరాటం...మళ్ళీ ఓ జవాబు రాసిపడేస్తే!

ఎటు ఆలోచించినా గందరగోళంగానే కనబడుతోంది. మనసు నిలవటంలేదు. అయినా వివేకం వద్దని హెచ్చరించింది తీసిన కాగితం, పెన్ను డ్రాయరుమీద పెట్టేశాడు.

అసహనంగా అటూ ఇటూ దొర్లుతూ కాలక్షేపం చేశాడు చాలాసేపు. జాలి, సానుభూతి, కోపం, కసి—ఒక దానివెంట మరొకటి చోటుచేసుకోసాగాయి.

చివరికి వేదాంతంలో పడ్డాడు. ఏమో! ఎవరికి ఎవరు రాసి పెట్టి ఉన్నారో—అను కుని నిర్లిప్తంగా ఉండిపోయాడు.




ఎవరికి ఏం రాసిపెట్టి ఉందో అనుకుం టూనే మాధవి హైదరాబాదుకు ప్రయాణ మయింది. వారం క్రితం ఆమె స్నేహితురాలు సుజాత ఉత్తరం రాసింది.

తనుపనిచేసేహాస్పిటల్‌కివిదేశీవైద్యులు వచ్చి కొన్ని కొత్తరకాల శస్త్ర చికిత్సలు జరుపబోతున్నారనీ ఓసారి వచ్చి వారి సలహా పాటించమనీ!

అప్పుడే మాధవి ఓ నిర్ణయానికొచ్చే సింది. తనకున్న అవకరాన్ని ఆ వైద్యుల చేత తొలగించుకొని అదృష్టవంతురాలు కావాలనుకుంది.

ఉత్తరంలోని విషయాలు మాధవికి వెయ్యి ఏనుగుల బలాన్ని ఇచ్చాయి.

తండ్రి అవధాని, తల్లి అనసూయమ్మ కూతురి గురించి బెంగ పెట్టుకుని ఉన్నారు చాలా కాలంగా. అయినా "చూడమ్మా...పుట్టుకతో వచ్చిన అవక రాన్ని ఏ డాక్టరైనా ఎలా తొలగించ గలడు! వద్దమ్మా... నువ్వు మాకేమీ బరువుకాదు" తండ్రి ఆందోళన చెందుతూ అన్నాడు.

అనసూయమ్మ కూడా కళ్ళు చెమర్చింది.

"ఏమిటి నాన్నా ... ఈ ఆపరేషను వల్ల నేను చనిపోతానేమోననేగా మీ భయం! ఆ చావు రాసిపెట్టివుంటే, ఆపరేషనే కారణం కానక్కర్లేదు. ఇంట్లోనే ఏదోవిధంగా చావచ్చు. నా అవకరాన్ని డాక్టర్లకు చూపించుకుని, వారి సలహా పాటిస్తాను. ఎటూ సుజాత వుంది. మీరు నిశ్చింతగా, ధైర్యంగా వుండండి" చెప్పింది మాధవి.

కన్నవారికా భయం వుండటంలో అసహజం లేదు. అయిష్టంగానే కూతురి ప్రయాణానికి ఏర్పాట్లుచేశారు ఆ దంపతులు.

"మేమువస్తామంటే రావద్దంటున్నావ్. ఒక్కర్తివే, చిన్న పిల్లవు అంతదూరం ఒంటరిగా ఎలా వెళ్ళగలవు?" అవధాని విచారంగా అన్నాడు.

"నా గురించి ఇప్పట్నుంచే బెంగ పెట్టుకోకండి. సుజాత వుండనే గదా నేనూ వెళ్ళేది! ఆమె నర్సు కావటం నిజంగా నా అదృష్టం నాన్నా! మీరనుకునేంత చిన్నదాన్ని కాను నేను. డిగ్రీ చదివేను"

మాధవి తల్లిదండ్రులకు ధైర్యం చెప్పసాగింది.

"నిజమే ... కాని నువ్వు ఒంటరి ఆడదానివి!"




"పిచ్చి నాన్నా... ఇంతవరకూ ఏ మగాడైనా నాతో మాట్లాడేడా? నా అవకరం నాకు శ్రీరామరక్ష. నన్నెవరూ ఎత్తుకుపోరు. లేనిపోని ఆలోచనలు పెట్టుకోకండి!" మాధవి సమాధానం ఇచ్చింది.

"కాని ఆడదానికి అవలక్షణం అడ్డు కాదమ్మా ... మగవాడికి కావలసింది శీలం. చూస్తున్నావుగా...రోజూ ఎన్ని అత్యాచారాలు జరుగుతున్నాయో! ఎవరైనా అరికట్టగలుగుతున్నారా! మానభంగాలు సరేసరి...ఆడది గుమ్మం దాటితే తిరిగి రాగలుగుతుందో లేదో తెలీని రోజులమ్మా....? బొత్తిగా ఆడ వాళ్ళకు రక్షణ, భద్రత లేని రోజు లొచ్చిపడ్డాయి కదమ్మా!" ఆ మాటలు అవధాని పెదవులు దాటి రాలేదు.

తండ్రి ఉద్దేశం మాధవికి తెలియక పోలేదు.

సాయంత్రం అయిదు గంటలు.

అవధాని, అనసూయమ్మ మాధవిని బస్సెక్కించేందుకు రోడ్డుదాకా వచ్చారు. అక్కడ చాలామంది జనం వున్నారు. వాళ్ళల్లో సగం మంది ఆడవాళ్ళే! వారిని చూడగానే అవధానికి ఏదో ధైర్యం ఏర్పడింది.

సఖినేటిపల్లి - రాజమండ్రి బస్సు వచ్చి ఆగింది. ప్రయాణీకులు ఒక్కొ క్కరే లోపలికి ప్రవేశిస్తున్నారు. మాధవి కూడా ఎక్కింది. ఆమెకు కిటికీ పక్క సీటు దొరికింది.

''మాధవీ... ఆడవాళ్ళ పెట్టెలోనే ఎక్కమ్మా! హైదరాబాదు చేరగానే ఉత్తరం రాయి. డబ్బు అవసరమయితే వెంటనే తెలియజేయి. మీ స్నేహితు రాలితో నా మాటగా చెప్పు!" అవధాని చెమర్చిన కళ్ళతో కూతురుకి వీడ్కోలు ఇవ్వగానే బస్సు కదిలింది.

అనసూయమ్మ పమిటతో కళ్ళు అద్దుకొంది.

'పిచ్చిపిల్ల .. ఏమిటో భగవంతుడు ఏర్పరచిన లోపాన్ని ఎంత విదేశీ డాక్టర్లయితే మాత్రం సరిచేయగలరా? మేము భయపడతామని రావద్దంది. ఎలా వెడుతుందో ఏమిటో? శారీరకంగా మేమిక్కడున్నా, మా మనసులు అక్కడే వుంటాయి.... చెపితే వినిపించు కోదు' అనుకున్నారు ఆ దంపతులు మరోసారి.

బరువుగా నాలుగు కాళ్ళు ఇంటివైపు కదిలాయి.

రాజమండ్రి చేరేసరికి ఎనిమిదిన్నర అయింది. మాధవి సూట్‌కేసు, ఎయిర్‌బాగ్ తీసుకుని ప్లాట్‌ఫారం మీదకు వెళ్ళేందుకు ఉపక్రమించింది.

హైదరాబాదుకు టిక్కెట్టు తీసుకుంది.

''గోదావరి ఎక్స్‌ప్రెస్ పదినిముషాల్లో వస్తుంది'' ఎంక్వయిరీలో వున్నతను చెప్పాడు. ఆమె ప్లాట్‌ఫారం మీదకు వెళ్ళింది. కాలక్షేపానికి రెండు పత్రికలు కొంది.

రైలు ప్లాట్‌ఫారం మీదకు వచ్చి ఆగింది. ప్రయాణీకులు, అమ్మకునేవాళ్ళ హడావిడి పెరిగింది. మాధవి 'స్త్రీల బోగీ' వైపు నడిచింది. ఆ బోగీ ఇంజను వైపు వుంది.

స్త్రీల బోగీ పక్కనే 'త్రీటైరు' బోగీ వుంది. టికెట్ ఎగ్జామినర్ రిజర్వేషను చార్టు పట్టుకుని బయట నిలబడ్డాడు. రిజర్వేషను చేయించుకున్నవాళ్ళు లోపలికి వెడుతున్నారు.

"హైదరాబాదుకు బెర్తు కావాలి''



అడిగింది మాధవి అతన్ని. పది రూపాయలు అదనంగా తీసుకుని ఆమెకు బెర్తు ఇచ్చాడు టికెట్ ఎగ్జామినరు.

'ఈ దేశంలో అడుగడుగునా అవినీతే! ఆయితేనేం తనకు హాయిగా ప్రయాణం చేసేందుకు బెర్తు ఇచ్చాడు... అదే పదివేలు' అని సరిపెట్టుకుంది మాధవి.

రైలు బయలుదేరింది. కంపార్టు మెంటులో ప్రయాణీకులునిద్రకు పక్కలు వేస్తున్నారు. కొందరు ఏవో పుస్తకాలతో కాలక్షేపం చేస్తున్నారు. అక్కడక్కడ దేశ రాజకీయాలమీద సుదీర్ఘంగా చర్చలు జరుపుతున్నారు మరికొందరు.

మాధవి తన బెర్తు దగ్గరకొచ్చింది. తన కిచ్చిన బెర్తు పైనవుంది. కింద బెర్తు మీద ఓ యువకుడు వున్నాడు.

"సార్... మీకభ్యంతరం లేకపోతే పైబర్తు మీరు తీసుకుంటారా?'' అడిగింది మాధవి.

ఆ యువకుడు ఆమెవైపు పరిశీలనగా చూసి, మరిక చూడలేకనేమో తన బర్తు ఇచ్చేందుకు అంగీకరించాడు. మాధవి కింద బర్తుమీద పక్క పరిచి కాసేపు పుస్తక పఠనానికి ప్రయత్నించింది.

ఆమెలో కూడా భయం లేకపోలేదు! తల్లిదండ్రులకు ధైర్యం చెప్పింది. కాని తను అంత ధైర్యంగా వుండగలదా అన్న అనుమానం ఇప్పుడిప్పుడే కలుగుతోంది. ఒంటరిగా తను ప్రయాణం చేయటం రెండోసారి. మొదటిసారి వాల్తేరు యూనివర్సిటీకి వెళ్ళింది.

రాజమండ్రినుంచి వాల్తేరు ప్రయాణం, హైదరాబాదు ప్రయాణం ఒక్కటే ఎలా అవుతుంది...? స్టేషనుకు స్నేహితురాలు వచ్చి రిసీవు చేసుకుంటానని రాసినా, ఒకవేళ రాలేకపోతే, ఆ మహానగరంలో ఆమె ఇంటికి ఒంటరిగా వెళ్ళగలదా తాను...

క్రమంగా మాధవికి కళ్లు మూతలు పడటం ఆరంభించాయి.

* * *

అవధాని అయిదేళ్ళ క్రితం ఉపాధ్యాయ వృత్తినుంచి పదవీ విరమణ చేశాడు. ఆ వూళ్ళో ఆయనమాటఅందరికి వేదవాక్కు. ఎవరికి ఏ కష్టం వచ్చినా ఆదుకుంటాడు. సమస్యలు పరిష్కరిస్తాడు. పదెకరాల మాగాణి పొలం, మూడెకరాల కొబ్బరితోట వుంది.లంకంత పెంకుటిల్లు వుంది. పాడిపశువులు నాలుగున్నాయి.

ఆయనకు ఇద్దరు కొడుకులు. ఇద్దరు కూతుళ్ళు.

చుట్టుపక్కలవారికీ, ఊళ్ళోవారికి, పెళ్ళిపెద్దగా, మధ్యవర్తిగా వ్యవహరించే అవధాని-తన పెద్ద కూతురు మాధవికి పెళ్ళి చేయలేకపోతున్నాడు ఏడేళ్ళనుంచి.

ఆడపిల్లలకు రజస్వలకాకముందే వివాహాలు జరపటం ఆయన వంశాచారం. సాధారణంగా పెద్దకూతురుకు వివాహం చేసి, కొడుకులకు పెళ్ళిళ్ళు చేయటం అలవాటు. అయినా ఏ ప్రయత్నమూ మాధవి విషయంలో ఫలించకపోవటంతో కొడుకులు తండ్రిమీద కోపగించుకున్నారు.

"ఏమిటి నాన్నా... ఈ ఆచారాలు, సాంప్రదాయాలు! మాధవికి పెళ్ళి అయే వరకూ మేమిలా వుండిపోవలసిందేనా? ఈవిధమైన రూలు ఏ శాస్త్రంలో వుంది. పాత శాస్త్రాలకి కాలదోషం ఎప్పుడో పట్టింది...."

అనలేదుగానీ, అంటున్నట్లే ప్రవ





ర్తించారు.

అవధాని అర్థంచేసుకోలేని అమాయకుడు కాదు.

"నాన్నా... నాకింక పెళ్ళి ప్రయత్నాలు చేయకు. ఇప్పటికే నా రూపం, అవలక్షణం చాలామందికితెలిసిపోయింది, సంతలో పశువుని చూసినట్లు చూసి, మనం పెట్టే టిఫిన్లు తినేసి పోతున్నారు. ఈ పెళ్ళికొడుకులూ, వారి బంధువర్గమూ... ఎందుకూ ఈ ఖర్చు కూడా? చెల్లాయికి సంబంధాలు చూడు. అన్నయ్యల మాట విను. మారుతున్న కాలాన్ని బట్టిమనంకూడా మారకపోతేఏం ప్రయోజనం? నా గ్రహచారంఎలావుంటే అలా జరుగుతుంది? నా ముఖానికి పెళ్ళి ఒక్కటే తక్కువ" అని పద్దెనిమిదో పెళ్ళిచూపులప్పుడు ఇక ఓపిక లేక చెప్పింది మాధవి.

అది విని వారంరోజులు కన్న తల్లి అనసూయమ్మ ఛోరున ఏడ్చేసింది.

"నాకు ఇలాంటి కురూపి కూతుర్ని ఎందుకిచ్చావయ్యా!" అని దేవుడిని తిట్టిపోసింది.

అవధాని బాగా ఆలోచించాడు, పెద్దవాళ్ళని సంప్రదించాడు. తన ఆలోచనని మార్చుకున్నాడు.

ఫలితంగా రెండో కూతురుకి పెళ్ళి చేశాడు.

మరో రెండు నెలలకు కొడుకులిద్దరికీ వివాహాలు చేశాడు.

ఇంక ఆ లంకంత ఇంటిలో మిగిలింది అవధాని, అనసూయమ్మ, మాధవి.

మాధవికి ఎన్నో ప్లస్ పాయింట్లు వున్నాయి. ఆమెకు బి.యస్సీ ఫస్టుక్లాసులో పాసయిన డిగ్రీ ఉంది. టైపు పరీక్షలో హయ్యరు సర్టిఫికెటుంది. ఇంటి పనులు అన్నీ చక్కగా, ఎవరి ప్రమేయం సలహా లేకుండానే చేస్తుంది. వారానికో సారి గుడికెళ్ళి ప్రదక్షిణాలు చేస్తుంది. శనివారంనాడు ఉపవాసం వుంటుంది. ప్రతి ఏటా సముద్రస్నానం అలవాటు.

కాని ఏసర్టిఫికెటూ, ఏగుణమ్మా, ఏ ఉపవాసాలు, ఏ సముద్ర స్నానమూ మాధవికి పెళ్ళిచేయలేకపోతున్నాయి.

ఇది ఆమె దురదృష్టమా? కన్నవారి పూర్వజన్మ పుణ్యఫలమా?

ఈరోజుల్లో ఆడపిల్లల పెళ్ళిళ్లు సులభంగా జరుగుతాయా ? వరుడికి సినిమా స్టారులావుండే అందగత్తె కావాలి. ఉద్యోగం చేస్తుండాలి. బాగా కట్న కానుకలు ఇప్పించాలి.

ఆమె బి.ఎస్సీ పాసయింది. ఆధునిక నాగరికత వస్త్రధారణలో కనిపిస్తుంది. సినిమాస్టారులా కాకున్నా బాగానే అలంకరించుకోగలదు. కథలు, నవలలు చదివినా ఆవిధంగా ప్రవర్తించాలనుకోదు.

కాని 'తనకిక పెళ్ళికాదు!' అనే భయం ఎప్పుడో పట్టుకుంది మాధవిని. తన ముఖాన్ని అద్దంలో చూసుకున్నప్పుడల్లా తన ముక్కును బ్లేడుతో కోసేసుకుంటే ఎలావుంటుందో అనిపిస్తుంది. ఆ పనే చేస్తే పీడ విరగడైపోతుందను కొంటుంది.

అవును... ఆ ముక్కు ఒక్కటే తనకున్న లోపం. అది మన ప్రబంధకవులు వర్ణించే ముక్కులా వుండదు సరిగదా కనీసం ఈనాటి రచయిత్రులు వర్ణించే విధంగానన్నా వుండదు. నేపాల్, చైనా దేశీయుల ముక్కుకన్నా అన్యాయంగా వుంటుంది..."అసలు ఈ అమ్మాయికి ముక్కులేదేమిటి?" అన్న అనుమానం కలుగుతుంది.





ముఖానికి అందాన్నిచ్చే ముక్కు, కళ్ళు, పెదిమలు, బుగ్గలు, పళ్ళు ఓ పద్ధతిలో లేకపోతే అందమే లేదు, ఆకర్షణే వుండదు.

అటువంటి 'నాసిక' మాధవి పాలిట శాపమై కూర్చుంది. అందుకే అవధాని కోరిన కట్నానికి వెనుకాడలేదు. కానుకలు, లాంఛనాలకు భయపడలేదు. కోరికలకు భయపడలేదు. కొందరు యువకులు పెళ్ళిచూపులకు అంగీకరించినా వధువుని చూసేక మళ్ళీ వాళ్ల గుమ్మంలోకి రాలేదు.

"మాధవి రంగుకు సర్దుకోగలం"

"నొక్కుల జుట్టూ బారాటి జడా చాలా బాగున్నాయి"

"ఆమె ఛాతీ ఎత్తులు కూడా అందంగానే వున్నాయి"

"వయసుకుతగ్గ లావు, లావుకు తగ్గ ఎత్తుతో బాగానే వుంది"

"మాటతీరు బాగుంది. సంసారపక్షంగా వుంది. స్వరం బాగుంది" అన్నవాళ్ళు, అనుకున్నవాళ్ళు ఆమె నాసిక గురించి మాత్రం ఏమీ వ్యాఖ్యానం చేయలేక పోయారు పాపం.

వైద్యశాస్త్రం ఎంతో అభివృద్ధిచెందు తోంది. శరీరంలో గుండె, ఊపిరితిత్తులు, మూత్రపిండాలు, కళ్ళు వేరేవారివి అమరు స్తున్నారు. పాడయిన రక్తాన్ని తీసేసి, కొత్త రక్తాన్ని ఎక్కిస్తున్నారు. పురుష సంపర్కం లేకుండానే టెస్టుట్యూబు బేబిలకు అవకాశం ఏర్పడుతోంది. విరిగిన ఎముకలకు శస్త్రచికిత్సద్వారా లోపాలని సవరిస్తున్నారు. కాని ముక్కు, మూతీ మార్చే విధానం ఎక్కడో ఉందని వినటంతప్ప అది మనదాకా రాలేదింకా- అలాఅని కాలేజీలో ఎవరో అనుకుం టుండగా వింది. నిజమో అబద్ధమో ఆమెకు తెలియదు. మాధవి పేపరు చదవ నందువల్ల ఆ సంగతులు సరిగాతెలియవు.

తనకున్న 'లోపాన్ని' సరిచేయవచ్చు నని మాధవికి తెలియదు.

సరిగ్గా అటువంటి సమయంలోనే ఆమె స్నేహితురాలు వుత్తరం రాసింది. ఇద్దరూ డిగ్రీదాకా కలిసే చదువు కున్నారు అమలాపురం కాలేజీలో. ఆమె అదృష్టం బాగుంది. నర్సు శిక్షణ అయింది. నర్సుగా ఉద్యోగం సంపాదించింది. ఇంకా పెళ్ళిచేసుకోలేదు.

"మా ఆసుపత్రికి విదేశీవైద్యులు వస్తున్నారు....నీకున్న లోపం మనదేశం లోనే కొన్ని పెద్ద ఆసుపత్రుల్లో సవరి స్తున్నారు. ఇప్పుడు మా ఆసుపత్రిలో అటువంటి శస్త్రచికిత్సలు జరిపేందుకు ఈమధ్యనే నిపుణుల్ని నియమించటం జరిగింది. వారికి సలహాలిచ్చేందుకే ఈ విదేశీ డాక్టర్లు వస్తున్నారు. నువ్వు తప్పకుండా వచ్చి ఈ చికిత్స పొందవలెను. మిగిలిన విషయాలు నేను చూసుకుంటాను ప్రాణభయం లేదు. డబ్బు ఖర్చుకు వెను కాడవద్దు...వెంటనే రావలెను. తప్పక వస్తావని నీ పేరు నమోదు చేయించాను" అని రాసిందామె.

ఉత్తరం చూడగానే మాధవి ఎంతో సంబరపడిపోయింది.

అవధాని, అనసూయమ్మ కూడా ఆనందించారు.

కాని ఆపరేషను అంటే భయపడ్డారు. కూతురు ధైర్యంగానేవుంది గనుక ఆమె కోరికను కాదనలేకపోయారు. డబ్బుకు ఎప్పుడూ వెనుకాడడు అవధాని. తన కూతురి క్షేమమే ఆయనకు కావాలి. మనసులో ఏదో భయం, ఆందోళనలున్నా పైకి మాత్రం గంభీరంగా వుంటున్నాడు.

'ఈ ఆపరేషనువల్ల అమ్మాయికేమై

ప్రాణభయం వుంటుందా? దాని నాసికి మళ్లీ మామూలుగా వస్తుందా? ఏమో!' అనుకుంటూనే మాధవి ప్రయాణానికి ఏర్పాట్లుచేశాడు అవధాని.

* * *

గోదావరి ఎక్స్‌ప్రెస్ హైదరాబాదు స్టేషనులో ఆగేసరికి ఉదయం ఎనిమిది గంటలయింది. మాధవి తన సూట్‌కేసు పట్టుకుని, ప్లాట్‌ఫారంమీదకు దిగింది.

"హాయ్...మాధవీ" ఎవరో పిలిచారు.

మాధవి వెనక్కు తిరిగింది. స్నేహితురాలు సుజాత.

"హలో సుజాతా...బాగున్నావుటే!" మాధవి స్నేహితురాలిని పలకరించింది. ఏడాది తరువాత ఇద్దరూ కలుసుకున్నారు. వారిమధ్య వున్న స్నేహం కళ్లకు పని పెట్టేయి. దూరంగా వుండే ఉత్తరాలే వారి ప్రేమాభిమానాలు. ఆప్యాయతను మోసుకొచ్చేవి.

"ఉత్తరం రాసేసన్న మాటేగాని, వస్తావో రావోనన్న భయంతో చచ్చి పోతున్నాననుకో ... తీరా ఆసుపత్రిలో పేరు నమోదుచేశాక మాట పోతుందేమో నన్న భయం ఆవరించింది"

"నా అనుభవాలే నన్ను ప్రయాణం కట్టించాయి....పైగా ఈమధ్య బతుకు మీద మరింత నిర్లక్ష్యం పెరిగింది... చావంటే భయం పోయింది. సరే... ఎలా రాసివుంటే అలా జరుగుతుందని బయలు దేరాను- అమ్మా, నాన్నకు ఏదో ధైర్యం చెప్పి, వాళ్ళూ వస్తానంటే, నువ్వున్నావు కదాని వద్దన్నాను. ఏమో... అంతా అయోమయంగా వుంది నాకు మాత్రం" మాధవి నిర్లిప్తత మాటల్లో గుర్తించింది సుజాత.

"ఈరోజుల్లో వ్యాధిని గురించి, లోపాన్ని గురించి భయపడటం అనవసరం. వైద్యశాస్త్రం ఎంతో అభివృద్ధి చెందుతోంది. ఎన్నో మందులు, రకరకాల పద్ధతుల చికిత్సలతో ఇప్పుడు చాలా తేలికగా నయం చేయగలుగుతున్నారు వైద్యులు. సరే...అవన్నీ తీరిగ్గా మాట్లాడుకుందాం పద" సుజాత సూట్‌కేసు అందుకుంది. మాధవి ఎయిర్‌బాగ్ తీసుకొంది. స్టేషను బయటకు నడిచారు ఇద్దరూ.

ఆటోవాళ్ళు వారిని చుట్టుముట్టారు.

ఓ తెలుగు ఆటోడ్రైవరు "కూర్చోండి. ఎక్కడికి వెళ్ళాలి?'' అడిగాడు.

"మీటరుంది కదా...వెళదాం పదు" అంది మాధవి.

"పది రూపాయలు.... మీటరుతో పనిలేదు" అన్నాడు ఆటోవాడు.

"ఏమయ్యా! నాంపల్లి నుండి మెహదీ పట్నంకు పది రూపాయలా? ఆశకు అంతుండక్కర్లేదూ...మీటరుంది కదా" సుజాత అంది.

'ఇద్దరు మనుషులు, సూట్‌కేసు, ఎయిర్‌బాగు...' డ్రైవరు చూస్తూ ఆగాడు, ఏదో చెప్పబోయి.

"ఇదుగో చూడు ... మేము సిటీ బస్సులో వెడితే ఎనభై పైసలు అవుతుంది. తెలుగువాడివి నువ్వు... నేనూ తెలుగు దాన్నే. నాలుగు రూపాయలిస్తాను. వస్తేరా....లేకపోతేలేదు" అంది సుజాత నిశ్చయంగా.

"సరే...ఎక్కండి" అన్నాడు ఆటో డ్రైవరు.

ఇద్దరూ ఆటో ఎక్కగానే, డ్రైవరు స్టార్టు చేశాడు.

"మనం సరిపెట్టుకోవటం వల్లనే వీళ్ళు ఇష్టం వచ్చినట్లు అడుగుతున్నారు.

కొత్తవాళ్ళకేం తెలుసు? అందుకే ఇలాగే నడిచిపోతోంది" అంది సుజాత.

ఆటో ఇంటి ముందు ఆగింది.

"ఇదే నా అంతఃపురం. ఈ మూడు గదులకు మూడొండలు అద్దె" చెప్పింది సుజాత - ఆటోవాడికి ఫేరు చెల్లించి లోపలకు వస్తూ.

మాధవి బ్యాగులోంచి బ్రష్, పేస్టు తీసింది. ఆమె ముఖం కడుక్కుని వచ్చే సరికి సుజాత కాఫీ సిద్ధంచేసింది.

"ఇంతకీ ఏ ఆపరేషన్ నాకు చేసేది?" అడిగింది మాధవి కాఫీ తీసుకుని.

"చూడు మాధవీ...ప్రస్తుతం నువ్వు ఆ సంగతి మరిచిపోయి విశ్రాంతి తీసుకో. నేను పది గంటలకు డ్యూటీకి వెళ్ళాలి. అయిదు గంటలకొస్తాను. నేవచ్చేవరకూ నీకు ఈ పేపర్లు, పత్రికలే కాలక్షేపం" సుజాత స్నేహితురాలికి వివరించింది.

మాధవి మాట్లాడలేదు ఆపైన.

• • •

సుజాత ఆసుపత్రి నుంచి వచ్చేసరికి ఆరుగంటలయింది.

"ఏమే...ఎలా కాలక్షేపం చేశావ్?" మాధవిని అడిగిందామె.

"హాయిగా నిద్రపోయాను"

"ఇప్పుడు ఏం చేద్దాం?"

"కబుర్లు చెప్పుకుందాం. తరువాత నిద్ర" చెప్పింది మాధవి.

"నీకు హైదరాబాదు రావటం ఇదే ప్రథమం కదూ....ఓ రౌండు అలా తిరిగి వద్దాం" అంది సుజాత.

"వద్దు సుజా... నా రూపం నీకు తెలుసుగా.ఇక్కడంతా అందంగా వుంటారు. చక్కగా అలంకరించుకుంటారు. నీ పక్కన నేనుంటే నిన్ను కూడా వింతగా చూస్తారేమో? వచ్చినపని ముగించుకుని త్వరగా వెళ్ళిపోతే చాలు. బతికి బాగుంటే మరోసారి చూద్దాంలే"

"పిచ్చిదానా... ఎందుకంత విచారం! ప్రతి మనిషిలోనూ ఏదో లోపం వుంటుంది. పైకి మాత్రం గొప్పగా కనబడతారు. ఏమీలేవని భావించి తిరిగితేనే మనిషి ధైర్యంగా బతగ్గలుగుతాడు. అనవసర ఆలోచనలు పెట్టుకోకు" సుజాత స్నేహితురాలికి ధైర్యం చెప్పింది.

మాధవి కాదన లేకపోయింది.

ఎనిమిది గంటల వరకూ వాళ్ళిద్దరూ ఆబిడ్సు, కోటీ సెంటర్లు తిరిగారు. సుజాత షాపింగు చేస్తుంటే మాధవి తలొంచుకుని ఆమెవెంట నడిచింది.

"హోటల్లో భోజనంచేసి ఇంటికెళదాం మాధవి అంది.

"సరే" అంది సుజాత.

ఫుట్‌పాత్ మీద అమ్ముతున్న వస్తువులు, పుస్తకాలు చూస్తూ కాసేపు తిరిగి నడుచుకుంటూ హోటలు కెళ్ళారు. భోజనం చేసి, ఇంటికిబయలు దేరారు.

ఇంటికెళ్ళాక సుజాతకు నిద్రముంచుకు రాసాగింది. మంచాల మీద పక్కలు పరుస్తోంది తను.

"సుజాతా! ఒక్క విషయం అడగనా?" అంది మాధవి.

"ఏమడుగుతావ్... మళ్ళీ డాక్టర్లు, రోగాల గురించేనా?"

"కాదు. నీ పెళ్ళి గురించి. నీకేం తక్కువ? చదువుకున్నదానివి. పది హేను వందల జీతం. ఏ బాధ్యతలు, బాధలు లేవు. అన్నింటికీ మించి అందగత్తెవు. నీకింకా ఆ ఆలోచన ఎందుకుకలగలేదు?"

"ఇదే ప్రశ్న ఆసుపత్రిలో చాలా మంది అడిగారు. కాని నాకిష్టం లేదు అని చెబుతుంటాను. అయితే నాకింకా తైము

రాలేదేమో!"

"నీ చాదస్తం. టైము దానంతట అది రాదు. దానికోసం మనమే ప్రయత్నించాలి. వివాహ జీవితం ఎంత ఆనందదాయకంగా వుంటుంది? భర్త, పిల్లలు,ఆ అనుభూతి...!నాకు చేసుకోవాలనే వుంది. ఇంతవరకూ ఎంతోమంది నన్ను చూసేరు. అయితే నా దురదృష్టం నా నెత్తిన లేదు ముక్కుమీద వుంది. ఏం చేస్తాం?" మాధవి మాటల్లో ఎంతో బాధ గుర్తించింది సుజాత.

"నువ్వేమైనా ప్రేమించి పెళ్ళాడాలనుకుంటున్నావా? లేక నాన్నగారు తెచ్చే సంబంధం చేసుకుంటావా?"

"మాధవీ! నీదగ్గిర నిజం దాచదలచుకోలేదు! నేనొకరివల్ల మోసపోయాను. పెళ్ళాడుతాడనుకున్నాను. కాని తన బుద్ధి చూపించాడు. కనబడినపుడు చెప్పుతో కొట్టాలనుకుంటాను. కాని ఆడదానిని. ఆడది ప్రేమించగలదు. కాని ప్రేమించిన వాడిని అంత తేలికగా మరిచిపోలేదు"

"మరయితే ఆ వ్యక్తి పెళ్లిచేసేసుకున్నాడా!" అడిగింది మాధవి.

"లేదు...ఇంకాఅమ్మాయిలనుచూస్తూనే వున్నాడు. అందం చాలలేదో, కట్నం తక్కువయిందో, కోరికలే అడ్డుపడుతున్నాయో తెలియదు..."

"అతనితో నీకెలా పరిచయమైంది? ఇప్పుడెక్కడున్నాడు. ఏం చేస్తున్నాడు?" ప్రశ్నలవర్షం కురిపిస్తోంది మాధవి.

"అవన్నీ ఇప్పుడెందుకు. సమయం వచ్చినప్పుడు చెబుతాను" మరేమీ ఆ వ్యక్తి గురించి అడగద్దన్నట్లుగా చెప్పింది సుజాత.

"పోనీ వేరెవరినయినా చేసుకోవచ్చు గదా?" మాధవి మళ్ళీ అడిగింది.

"నాన్నగారు అప్పారావుని చేసుకోమంటున్నారు. నర్సుగా ఉన్నానని ఎవరూ సాహసించలేకపోతున్నారు కాబట్టి నాన్నగారి కోరిక ప్రకారం...'' సుజాత పూర్తిచేయబోతోంటే,

"అప్పారావంటే మీ ఇంటికొస్తుంటాడు... అతనేనా?" అంది మాధవి.

"అవును.... అతనే!"

అప్పారావు వయసు ముప్పై ఏళ్ళు. అయిదేళ్ళ ఉద్యోగ అనుభవం వుంది. ఆ సిపయుసు. డబ్బు ఖర్చు విషయంలో ఒకటికి పదిసార్లు ఆలోచిస్తాడు. అవసరమయితే కోరికలను చంపుకుని, అవసరాలని వాయిదా వేసుకునే మనస్తత్వం. ఆఫీసు కాంటీనులో కాఫీ కూడా తాగడు. ఆరేడు నెలలకు ఓ సినిమా చూస్తాడు. ఇద్దరు పిల్లలు. భార్య ఆరునెలల క్రితం పోయింది.

లక్ష్మీదేవిని అన్ని విధాలా ఆరాధించాలి. ఈ లోకంలో డబ్బుంటేనే మనిషికి గుర్తింపు, గౌరవం. మనదగ్గర డబ్బుంటేనే నలుగురూ మన చుట్టూ తిరుగుతారు. అప్పుడు వాళ్ళ జుట్టు మన చేతుల్లో వుంటుంది అనుకుంటూ వుంటాడు అప్పారావు.

నగరంలో జూపార్కు, గోల్కొండ కోట, గండిపేట చెరువు, చార్మినారు, సాలార్‌జంగ్ మ్యూజియం ఇంతవరకు చూడనేలేదు. 'చూస్తే ఒరిగేదేమిటి?' అని అభిప్రాయపడతాడు. ఎప్పుడయినా ఊరు నుంచి బంధువులు, స్నేహితులు వచ్చి 'సైట్ సీయింగు'గా రమ్మంటే రాను పొమ్మంటాడు.

స్వలాభం, స్వార్థం లేకుండా ఏదీ పనిచేయడు అతను. కంపెనీ షేర్లు, డిబెంచర్లు, బాండ్లు కొనటం హాబీ.





స్కూటర్లకు డిపాజిట్లు కట్టి బ్లాకులో అమ్మటం సైడు బిజినెస్సు.

స్నేహితులకు స్వల్పకాలానికి వడ్డీలకు అప్పులిస్తూ ఆర్థిక సేవ చేయటం అతని పాలసీ. ఆఫీసుకు దగ్గిరలోనే వంద రూపాయలిచ్చి ఓ రేకుల షెడ్డులో నివాసం వుంటున్నాడు. ఆవిధంగా బస్‌ఛార్జీలు ఆదా!

అప్పారావుని గురించి చెబుతూవుండే మాధవి వింటూ పడుకుంది.

స్నేహితురాళ్లిద్దరూ ఎప్పుడో నిద్ర లోకి జారారు తమకు తెలీకుండానే.

మాధవి లేచేసరికి, సుజాత కాఫీ తయారుచేసింది.

"త్వరగా లేవే.... టైమెంతయిందో తెలుసా?'' అంది సుజాత.

"ఏమిటో....ఇక్కడ ఇంతఆలస్యంగా మెలకువ వస్తోంది. ఇంటిదగ్గరయితే అమ్మకంటే ముందరే లేస్తాను. నా తరువాతే లోకానికి వెలుగు వస్తుంది. అటువంటిదిక్కడ ఇంత నిద్రేమిటో?" మాధవి లేస్తూ అంది.

"అది పల్లెటూరు. పైగా మొదట నుంచీ అలవాటు కదూ!" సుజాత అంది.

పదినిమిషాల్లో మాధవి ముఖం కడుక్కుని వచ్చింది.

ఈలోగా సుజాత కాఫీ కప్పులో పోసి తీసుకు వచ్చింది.

కొంచెంసేపు పేపరు చూసిందిమాధవి.

"నాకీరోజు వంటచేయకు. ఇవాళ శనివారం కదా. నేను భోజనం చేయను. ఉపవాసం అన్న మాట" చెప్పింది మాధవి.

"అదేమిటే! ఈవయసులో ఉపవాసా లేమిటి? నీకేమైనా పిచ్చిపట్టలేదుకదా... ఉపవాసాలు, స్నానాలు, గుళ్లూ గోపురాలు, తీర్థయాత్రలకి ఇంకా బోలెడు కాలం వుంది. మీ ఇంటికెళ్లేక నీ ఇష్టం. ఇక్కడ అవేమీ పెట్టుకోకు" సుజాత హెచ్చరికగా అంది.

మాధవి కాదనలేకపోయింది.

పది గంటలయింది. సుజాత ఆసుపత్రికి బయలుదేరే సన్నాహంలో వుంది.

"ఇవేళ తెలుస్తుందోమ్ వైద్యబృందం ఎప్పుడొచ్చేదీ" అంది సుజాత.

"ఇంక నేను ఆ విషయం గురించి అడగను నువ్వే చూసుకో!"

సుజాత వెళ్లిపోయింది.

మాధవి కార్డు తీసుకుని తండ్రికి రాయ సాగింది.

సాయంత్రం అయిదింటికే వచ్చేసింది సుజాత.

"మాధవీ! నీకు గుడ్ న్యూస్. రేపే డాక్టర్లు వస్తున్నారు. రాత్రి టెలిగ్రాం వచ్చిందట. మీ పేషంటు వచ్చిందాని మా సూపర్నెంటుగారు అడిగారు. వచ్చిందనిచెప్పాను. బైది బై,నీకు చివరగా ఆపరేషను చేయమన్నాను" సుజాత చెప్పింది.

"ఆపరేషను ఎంతసేపు చేస్తారు? ప్రమాదం వుండదుకదా!" మాధవి గొంతులో భయం, ఆందోళన గుర్తించింది స్నేహితురాలు.

"నీ పిచ్చిగాని ఆపరేషను అంటే భయపడే రోజులు ఎప్పుడోపోయాయి. అన్నీ తేలికగా, త్వరగా చేసేస్తున్నారు. ఈమధ్య ఫారిన్‌లో అయితే ఎవరికీ చెప్పకుండానే అలా ఆసుపత్రికెళ్ళి ఇట్టే ఇటువంటి ఆపరేషన్లు చేయించేసుకుంటున్నారు"

"ఇంతకీ ఈ ఆపరేషను ఎలా

ఉంటుంది?"

"ప్లాస్టిక్ సర్జరీ ద్వారా లోపాలని సవరిస్తారు. ఈరోజుల్లో సినిమాస్టార్లని చూసి మధ్యతరగతివాళ్లు ఈవిధంగా తమ రూపాలని సరిదిద్దుకుంటున్నారు. ముక్కు, పెదిమలు, చెంపలు ప్రధానంగా రూపుమార్చుకుంటున్నాయి. శరీరంలో ఎక్కడో ఒకచోట చర్మాన్ని కావలసినంతగా తొలగించి అవసరమైనచోట్ల అతికించి సరిచేసేస్తారు. కొన్నాళ్ళు చికిత్స పొందితే నయమయిపోతుంది. పరిశీలనగా పరీక్షించినా ఎవరికీ ప్లాస్టిక్ సర్జరీ చేయించుకున్నట్లుగా అనుమానం కలగదు" సుజాత అంది.

"మీకేం మీరంతా ఆ వృత్తిలో వున్నారు కాబట్టి అన్నీ తేలికగా కనిపిస్తాయి. ఆపరేషను టేబులుమీద పడుకున్న పేషంటుకుమాత్రం గుండెలు అదురుతుంటాయి" మాధవికింకా బెదురు పోలేదు.

"నువ్వే చూస్తావుగా! నువ్వే రేపు ఆపరేషను అయ్యాక నలుగురికీ చెప్తావు. ఇప్పుడు నా మాటలు నీకు అలాగే వుంటాయి" అంతకన్నా ఏం చెప్పినా స్నేహితురాలు అర్థంచేసుకోలేదని క్లుప్తంగా వివరించింది సుజాత. నిజానికి ఆ చేసే వైద్యులు భారతీయులే. విదేశాల నుండి వచ్చినా కేవలం శాంపిల్‌గా చేసి చూపిస్తారంతే. అయినా ఎంత తెలిసినా ఆపరేషనుఅనగానే ఎవరికైనా సహజంగా భయం వుంటుంది.

• • •

మాధవి రాసిన ఉత్తరం అవధానికి రెండు రోజుల తరువాత అందింది. కూతురు దస్తూరి చూడగానే ఆయన మనసు ఎంతో తేలికయిపోయింది. ఆనందాన్ని పట్టలేక భార్యని పిలిచాడు.

"ఏమోయ్... అమ్మాయి ఉత్తరం రాసిందోయ్" అరిచాడు.

అనసూయమ్మకు ఆ అరుపు ఎంతో వూరట కలిగించింది. కూతురు వెళ్ళినప్పట్నుంచీ వుత్తరం కోసం ఎదురుచూస్తూనే వుంది. పోస్టుమాసుకోసం కళ్ళల్లోవత్తులు వేసుకుని చూడసాగింది.

"ఏం రాసింది... చదవండి" అడిగింది భర్తని.

అవధాని ఉత్తరం చదవసాగాడు.

'నాన్నకు, అమ్మకు నమస్కారములు. నేను కులాసాగానే ఇక్కడకు చేరాను. గోదావరి ఎక్స్‌ప్రెస్ హైదరాబాదు వచ్చేసరికే సుజాత నా కోసం వచ్చివుంది. తనే నన్ను జాగ్రత్తగా చూసుకుంటోంది. నేను లేకపోయేసరికి, పాపం అమ్మ అన్ని పనులు చేసుకోవలసి వస్తుంది. నా గురించి భయపడకండి. ఈ ఆపరేషను వల్ల ఏమీ భయం లేదు. అనవసరంగా ఆందోళన చెందవద్దు....ఒకటి రెండు రోజుల్లో ఆపరేషను ఎప్పుడు చేసేదీ తెలుస్తుంది.

ఇక్కడకొచ్చింది కొన్ని గంటలే అయినా, నాకు ఈ వాతావరణం అలవాటయిపోయింది. ఈ నగరాన్ని వదలాలనిపించటం లేదు.

డాక్టర్లు చెప్పినదాన్ని బట్టి, అవసరమైతే మీకు టెలిగ్రాం ఇస్తాను. మీరొక్కరే రండి. అమ్మను తీసుకురావద్దు. తను మరింత 'డీలా' అయిపోతుంది.

ఆపరేషను టేబులుమీద పడుకున్నాక, మత్తుమందు ఇచ్చాక నా పక్కన నాన్న వున్నాడో, అమ్మ వుందో, సుజాత వుందో, ఎవరున్నారో నాకేమీ తెలియదు కదా... మీకు ఆందోళన తప్ప! మీరెవ్వరూ





లోపలకు రాచుకదా... అటువంటప్పుడు మీ రాకవల్ల లాభం వుండదు కదా - అనవసరమైన దారి ఖర్చులు తప్ప.

ఇలా రాసేనని మీరేమీ కంగారు పడవద్దు....అనుకోవద్దు.

అమ్మను అడిగినానని చెప్పవలెను. ఉంటాను.

మీ మాధవి"

అవధాని ఉత్తరం చదివాక అనసూయమ్మ వైపు చూశాడు. ఆమె కళ్ళు అద్దుకుంటోంది.

"ఎందుకే పిచ్చిదానా... దానికంత ధైర్యంగా వున్నప్పుడు మనం ఎందుకు ఆందోళన పడటం? అది రాసినట్లుగా, పక్కన వుండి మనమేమి చేయలేము... అన్నీ సుజాత చూసుకుంటుందిలే. అక్కడ అందరూ తగు జాగ్రత్తలు తీసుకుంటారు..." ఓదార్చసాగాడు భార్యని.

"అయితే మాత్రం మనకు ఏ విచారమూ బెంగా వుండవంటారా?" అనసూయమ్మ అడిగింది.

"సుజాత మన మాధవిని బాగానే చూస్తుంది. ఆ నమ్మకంతోనే మన అమ్మాయి, మనల్ని కనీసం రాజమండ్రి స్టేషనుకూడా రమ్మనలేదు. ధైర్యంగా ఒంటరిగా ప్రయాణమైంది. ఎప్పుడైనా అది గుమ్మం కదిలిందా? అటువంటిది ఈరోజు కొన్ని వందల మైళ్ళు వెళ్ళిందంటే, దానికెంత ధైర్యం వుందనుకోవాలి? మనం బాధపడకూడదు" ధైర్యం చెప్పాడు అవధాని.

నిజమే.. పిల్లలకు ధైర్యం చెప్పవలసిన తల్లిదండ్రులే బాధ- బెంగ పడిపోతే, వారికేం ధైర్యం వుంటుంది...? చదువు కున్నందుకు, చదువు చెప్పించినందుకు వారికా స్వేచ్ఛనివ్వాలి.... మంచీ చెడూ నిర్ణయించుకోవలసిన అవసరం, బాధ్యత వారికి తెలియకపోలేదు.

కూతురేమీ తల్లిదండ్రులతో పోట్లాడి ఇల్లువదిలి పోలేదు. స్నేహితురాలు నర్సు. తనకున్న లోపాన్ని సరిదిద్దుకొనేందుకు సుజాత వుందనే ధైర్యంతోనే కదా ధైర్యంగా వెళ్ళింది!

అనసూయమ్మ నెమ్మది నెమ్మదిగా ధైర్యం తెచ్చుకొంటోంది భార్య పరాకుని, విచారాన్ని గమనించినప్పుడల్లా- భర్తగా ఓదారుస్తూ ధైర్యం చెబుతున్నాడు అవధాని.

* * *

రెండు రోజుల తరువాత...

సుజాత మాధవిని ఆసుపత్రికి తీసుకువెళ్ళి వైద్యులకు చూపించింది. కొన్ని పరీక్షల తరువాత శస్త్రచికిత్సకు తేదీ తెలిపారు.

"డాక్టర్! మా అమ్మా,నాన్నా రావలసిన అవసరం వుందంటారా?" అడిగింది మాధవి.

"నాట్ నెసెసరీ....ఇది మైనర్ ఆపరేషను. పైగా సుజాత మీ స్నేహితురాలు తను మా పక్కన మాకు సహాయంగా వుంటుంది.ఆ అవకాశంకూడా మీవారికుండదు. ఆసుపత్రిలో మీరు రెండు మూడు రోజులుండేచాలు...తరువాత డిశ్చార్జిచేస్తాము. మందులు రాసిస్తాం. వాటిని జాగ్రత్తగా ప్రిస్కుప్రకారం వాడితే సరిపోతుంది. ఎటూ మీరు స్నేహితురాలి దగ్గరే వుంటున్నారు కాబట్టి మరో పదిహేనురోజులుంటే ఇక్కడే ట్రీట్ మెంటు తీసుకోవచ్చు. ఆ తరువాత అంతగా అవసరంలేదు" డాక్టరు చెప్పాడు.

"ఈ ఆపరేషనువల్ల భవిష్యత్తులో





ఏమైనా కాంప్లికేషన్లు వుంటాయా? మరేమీ ప్రమాదం వుండదుకదా!"

"నో కాంప్లికేషన్స్...నో డేంజర్! దిస్సీజ్ నథింగ్!"

మాధవి మరో ప్రశ్న అడగాలనుకుంటోంది. కాని అడిగితే బాగుంటుందో లేదోనని సందేహిస్తోంది. పక్కనే సుజాత వుంది. ఏమనుకుంటుందో! డాక్టరుద్వారా తన అనుమానాన్ని నివృత్తి చేసుకోకపోతే అది తనని బాధిసుంది. ఏ పనీ చేయనీయదు. అడగకపోతే మనసు పీకుతుంటుంది... ఎలాగ?

మాధవి కేస్‌షీటుమీదఆపరేషను డేట్ చేయవలసిన ఏర్పాట్లు, ఈలోగా అవసరమైన పరీక్షలు నోట్ చేసి వెళ్ళిపోయాడు ఆమెను అటెండయ్యే సర్జన్.

"మాధవీ....యు ఆర్ రియల్లీ లక్కీ. ఈ సర్జన్ చాలా మంచివాడు. అతను ఇటువంటి ఆపరేషన్లు ఎన్నో చేసాడు. ప్రత్యేకంగా నాసికలమీద జరిపే ఆపరేషన్లే ఇతనికింత పేరు ప్రఖ్యాతులు తెచ్చిపెట్టాయని చాలామంది నమ్మకం. అతని చేతిమీదుగానే నీకిప్పుడుఆపరేషను జరగటం నీ అదృష్టం!" సుజాత డాక్టర్ గురించి ప్రత్యేకంగా వివరించింది.

మాధవి పొంగిపోయింది. ఇదంతా తన అదృష్టమే మరి! సుజాత తన లోపం గురించి ఉత్తరం రాయటం, తన ఆసుపత్రిలోనే ఇది జరిపించటం, తన దగ్గరే వుంచుకోవటం...ఎంత స్నేహితురాలు అయితే మాత్రం, ఈరోజుల్లో స్నేహాన్ని గుర్తించేదెవరు?

* * *

అనుకున్న రోజుకు మాధవికి ప్లాస్టిక్ సర్జరీ జరిగింది. ఆపరేషను థియేటర్లో సుజాత పక్కనే డాక్టర్లకు సాయంగా వుంది. తమ ఆసుపత్రిలోనే పనిచేసే నర్సు స్నేహితురాలని డాక్టర్లు మరింత శ్రద్ధతీసుకుని సర్జరీ జరిపారు.



5

రెండురోజుల తరువాత వేసిన బాండేజీ తీసి,కొత్తది వేసేందుకు ఏర్పాటు జరుగుతోంది.

"ఎలావుంది ఇప్పుడు తన ముక్కు" చూడమన్నట్లుగా ప్రశ్నించాడు డాక్టరు సుజాతను.

సుజాత ఆశ్చర్యపోయింది. అసలు తనకు అక్కడ ఆపరేషన్ జరిగిందా... అనిపిస్తోంది. కనీసం ఏదేనా అతికించినట్లుగాకూడా అనుమానం కలగటం లేదు.

"మీ హస్తవాసి తెలిసే, ఈ ఆపరేషనుకు తెగించింది" అభినందన పూర్వకంగా చెప్పింది సుజాత.

డాక్టర్లకు ఇటువంటి కాంప్లిమెంట్సు మామూలే!అందులో అనుభవజ్ఞులైనవారికి అవి అతిసాధారణం...

"సుజాతా....నువ్వు లేకపోతే ఈ ఆపరేషను ఎలా జరిగేదో? నిన్ను పొగుడుతున్నాననుకోవద్దు.... నా మీద నీ కింత అభిమానం వుండటం నిజంగా నా అదృష్టం" మాధవి స్నేహితురాలికి కృతజ్ఞతలు తెలుపుకుంది.

"సరేలే...అది నా బాధ్యత... నా వృత్తి. తెలిసిన విషయం కాబట్టి, నీ

కున్న లోపాన్ని సరిచేయాలనిపించింది. అంతకన్నా నేను చేసిందేమీలేదు...నువ్వ నుకున్నంత గొప్పగా నేనేమీ చేయలేదు" అంది సుజాత.

మాధవిని నాలుగురోజుల తరువాత ఆసుపత్రినుంచి డిశ్చార్జి చేసారు. సుజాత స్నేహితురాలిని సరాసరి ఇంటికి తీసుకు వెళ్లింది. ఆమె సలహా ప్రకారం, డాక్టరే ఇంటికొచ్చి రోజూ చూడసాగాడు. వైము ప్రకారం మందులు వేస్తోంది సుజాత.

మాధవి తండ్రికి ఉత్తరం రాసింది ఆసుపత్రినుంచి రాగానే.

కూతురు వుత్తరం చూడగానేఅవధాని, అనసూయ పొంగిపోయారు. పరోక్షంగానే సుజాతను అభినందించారు. ఈ విష యంలో తన కొడుకులు కనబరచని అభిమానాన్ని,ప్రేమని, ఆప్యాయతను... ఎక్కడో ఉన్న క్లాస్‌మేట్ కనబరిచింది.

ఈ రోజుల్లో అన్నాచెల్లెళ్ళ అను బంధాలు ఇలా తగులడ్డాయి. ఎవరికి వారే అనిపించుకుంటున్నారు. సినిమాలవరకే పరిమితమయిన వారి ప్రేమలు, అను రాగాలు నిజజీవితంలో లేకపోవటం పట్ల ఆ దంపతులు ఆందోళన చెందారు.

నెలరోజుల తరువాత మాధవి ఇంటికి బయలుదేరింది.

"సుజాతా! నాకు చేసిన సహాయానికి ఎలా నీ ఋణం తీర్చుకోగలనో? ఈ రెండు వేలు వుంచు.ఆసుపత్రిఖర్చులు, మందులు, ఇంజక్షన్లకు ఇంకా ఇవ్వవలసినదేమైనా వుంటే చెప్పు మొహమాటపడకుండా. నువ్వేమాత్రంఏమీ అనుకోవద్దు...ప్లీజ్!" అంది మాధవి వెళ్లేముందు.

"సరిపోవచ్చు. నీ బిల్లు ఇంకా ఆసుపత్రిలో తయారుకాలేదు. అంతగా ఇవ్వవలసినదుంటే తెలుపుతానులే!"

"ఈ అయిదువందలు పెట్టి మంచి పట్టుచీర కొనుక్కో. నీకెటువంటి రంగు కావాలో నాకు తెలియదు కదా...ప్లీజ్ తీసుకో!" పర్సులోంచి అయిదు నూరు రూపాయలనోట్లు తీసి స్నేహితురాలు చేతిలో పెట్టబోయింది.

"ఇప్పుడేమీ వద్దు. రేపు నీ పెళ్లికి వస్తాను... అప్పుడు పెడుదువుగానిలే" చెప్పింది సుజాత.

"అది వేరే విషయం. ప్రస్తుతం నువ్వు తీసుకోవాల్సిందే, లేకపోతే నాకు కోపం వస్తుంది... కాదనకు"

సుజాతకు తీసుకోకతప్పలేదు.

సాయంత్రం గోదావరి ఎక్స్‌ప్రెస్‌కే మాధవి వెళుతోంది. సుజాత స్టేషనుకు స్నేహితురాలిని సాగనంపేందుకొచ్చింది.

"మాధవీ!మందులు జాగ్రత్తగా వాడు. ఇంకేమీ ఫరవాలేదు. నో కాంప్లికేషన్స్ అండ్ డేంజర్. అసలు నాకే ఆశ్చర్యంగా వుంది. ఇంత అందమయిన ముక్కుకోసం ఏ అదృష్టవంతుడు తపస్సు చేస్తున్నాడో! ఎవరికీ అనుమానం రాదు. పుట్టుకతోనే వున్నట్లుగా వుంది. తెలిసినవాళ్లు ఎగతాళి చేస్తారన్న అనుమానం, భయం పెట్టుకోవద్దు" సుజాత అంటోంది.

"నువ్వు మాత్రం త్వరగా పెళ్ళి చేసుకో... అతను కాకపోతే మరొకరు. శుభలేఖ అందిన వెంటనే వస్తాను"

గార్డు విజిల్ వూదాడు. ఆకుపచ్చ దీపం చూపిస్తున్నాడు. రైలు కూత విన బడగానే ప్రయాణీకులు ఆదరాబాదరాగా పెట్టెల్లోకి జొరబడుతున్నారు.

గోదావరి ఎక్స్‌ప్రెస్ కదిలింది.

"ఉంటానే మాధవీ... వెళ్ళగానే ఉత్తరం రాయి. ఆరోగ్యం జాగ్రత్త..." సుజాత అంటుండగానే రైలు వేగం అందు




కుంది.

రైలు కనుమరుగయి పోయింది... మాధవి తన సీటులో కూర్చుంది.సుజాత వెనక్కు మళ్ళింది.

'పాపం అమాయకురాలు... ధైర్యం చేసి వచ్చినందుకు బాగానే శస్త్రచికిత్స జరిగింది...ఇంత ధైర్యం ఎలా వచ్చిందో తనకి' అనుకుంటూ సుజాత స్టేషను బయటకు నడిచింది ఇంటికెళ్ళేందుకు.

* * *

రాజమండ్రి చేరేసరికి ఉదయం అయిదు గంటలయింది. మాధవి రైలు దిగి స్టేషను బయటకు వచ్చి, బస్సుకోసం ఎదురుచూస్తోంది బస్‌స్టాపులో.

గంటయినా బస్సు రాలేదు. అంతకు ముందు వచ్చిన మూడు బస్సులు ఆగకుండానే వెళ్ళిపోయాయి. పది నిముషాల తరువాత మరో బస్సు వచ్చింది.

"ఎక్కడికి వెళ్ళాలి?" అడిగాడు కండక్టరు డోరు తీస్తూ. వూరి పేరు చెప్పింది మాధవి.

"ఇది అమలాపురం బస్సు....చదువుకున్నదానివి, షోగ్గా అలంకరించుకోవడమే గాని బోర్డు చూడద్దూ" అన్నాడు వినీ వినబడనట్లు.

"సరే... అంబాజీపేటలో దిగుతాను లెండి!" చెప్పింది ఆమె.

మాధవి బస్సులో కూర్చుంది టిక్కెట్టు తీసుకుని.

ఆ బస్సు ఎక్స్‌ప్రెస్ కావటం వలన వేగంగా పోతోంది. పైగా లిమిటెడ్ హాల్టుస్. బస్సులో ప్రయాణీకులు ఎక్కువగాలేరు.

రావులపాలెం, కొత్తపేట, ముక్కామల ఈ వూళ్ళోనే బస్సు రెండేసి నిముషాలు ఆగింది.

"అంబాజీపేట దిగాలి..." అరిచాడు కండక్టరు.

మాధవి సూట్‌కేసు, ఎయిర్‌బాగు తీసుకుని కిందకు దిగింది. టైము చూసింది...తొమ్మిది గంటలు కావస్తోంది.

'ఈ బస్సు షెల్టరు పూరికే కట్టి తగలడ్డారు. ఇదివరకే నయం... హాయిగా పేట సెంటర్లో ఆగేది. రిక్షాలు, గుర్రపుబండ్లు ఎదురుగా వుండేవి. ఇప్పుడు ఈ కొత్త బస్సు షెల్టరు దగ్గరికి రిక్షాలు, బళ్ళు వచ్చినా ఇష్టమొచ్చినంత అడుగుతారు. అందులో ఆడవాళ్ళని లగేజితో వున్నవాళ్ళని చూస్తే వీళ్ళకి మరీ చులకన! నోటికొచ్చినంత అడుగుతారు, ఎక్కక చస్తారా అన్నట్లు' అనుకుంటోంది మాధవి.

ఎదురుగా రాజోలు బస్సు కనబడింది. అది నిండు గర్భవతిలా కిక్కిరిసిన జనంతో వుంది. బస్సులో కాలు కదిపే వీలులేనట్లుగా బయటికి కనిపిస్తోంది. 'పది నిమిషాలు నిలబడితే వచ్చేస్తుంది వూరు. ఈమాత్రం భాగ్యానికి చోటుకోసం ఎదురుచూడటం దేనికి?' అనుకుంది.

మాధవి లోపలికి ఎక్కబోతుంటే కండక్టరు అడ్డగించాడు.

"ఇంకెక్కడెక్కుతావమ్మా! ఇప్పటికే ఓవర్‌లోడయింది" అన్నాడు.

"నేనొక్కర్తినేకదా" అందామె.

"వెనకాల బస్సులో రావమ్మా!" అనేసి రైట్ చెప్పేసాడు.

బస్సు వెళ్ళిపోయింది.

మళ్ళీ బస్సు ఎప్పుడొస్తుందో? నాలుగు మైళ్ళ దూరానికి బస్సు ఎందుకు? ఇంకా రిక్షాయేగతి.

"రిక్షా కావాలాండీ అమ్మాయిగారూ!" రిక్షావాడి ప్రశ్న.

"వస్తావా?" తను అడిగింది.

"వస్తానమ్మగారూ! నాలుగు రూపాయ లిప్పించండి!"

"ఏమయ్యా ఎంతదూరమని...నాలుగు రూపాయలు కావాలా? న్యాయం వుండక్కరలేదూ!"

"మీలాంటోళ్లివ్వకపోతే మేమెలా బతకాలి?" అన్నాడు అతను.

మాధవి రిక్షాలో కూర్చుంది. రిక్షావాడు సూట్‌కేస్, ఎయిర్‌బాగు రిక్షాలో పెట్టాడు.

రిక్షా బయలుదేరింది.

ఇరవై నిమిషాల తరువాత వూళ్ళోకి చేరింది రిక్షా.

"ఎవరింటికెళ్లాలి అమ్మాయిగారూ?" అడిగాడు రిక్షావాడు.

"ఇక్కడే దిగిపోతాను" అంటూ ఆమె కిందకు దిగింది.

"ఈ సామానుతో ఇంటిదాకా ఎలా నడుస్తారండీ?" మళ్లీ అడిగాడు.

"ఫరవాలేదులే...బరువేమీలేదు"

పది గజాల దూరంలో ఓ దృశ్యం ఆమె కంటబడింది.

కాకీ నిక్కరు, తెల్లచొక్కా తొడుక్కున్న ముప్పైఏళ్ళ వ్యక్తి రోడ్డుమీద భార్యని చావకొడుతున్నాడు. ఆ ఇల్లాలు ఎదురుచెప్పటంలేదు, నోరెత్తటంలేదు – తాళి కట్టించుకున్న నేరానికి! ఆమె జుట్టు భర్త చేతిలో బిగుసుకుంది. ఆ స్త్రీ గింజుకుంటోంది. అతను వదలటంలేదు. నిర్దాక్షిణ్యంగా ఆమెను రోడ్డుమీద ఈడుస్తున్నాడు. చుట్టూ చేరిన జనానికి వింతగా, కాలక్షేపంగా, వినోదంగావుంది. ఎవరూ వారిని విడదీయటం లేదు. అదేమిటని కూడా అడగటం లేదు.

పదినిముషాలు అదే పరిస్థితి.

మాధవికిదేమీ అర్థం కాలేదు.

అతను భార్యను ఎందుకలా హింసిస్తున్నాడు? అది అతని హక్కా, అధికారమా?'

ఒకటి మాత్రం నిజం. అతను పురుషుడు...ఆమె స్త్రీ. మగవాడు ఇంతటి దుర్మార్గానికి, అత్యాచారానికి తలపడుతుంటే ఎవరూ అడ్డుపడటం లేదు....భర్త చేతిలో ఆ భార్య చావవలసిందేనా?

ఇరవైగజాల దూరంలోవున్న ఇటికల మెరక రోడ్డుదాకా ఆ భర్త తన భార్యని శవాన్ని ఈడ్చుకుపోతున్నట్లుగా ఈడ్చుకుపోతున్నాడు. మాధవికి ఆ దృశ్యం బాధను కలిగిస్తోంది.

వివేకం, సంస్కారంవున్న ఏ మగవాడూ వారిని విడిపించటంలేదు. ఆ వ్యక్తిమీద మాధవికి కోపం కలిగింది. అతని భార్యమీద జాలి, సానుభూతి ఏర్పడుతోంది. చూస్తున్న వారిమీద అసహ్యం, ద్వేషం పుడుతోంది. ఈ మగవాళ్ళు ఎందుకింతగా దిగజారిపోతున్నారో ఆమెకర్థం కాలేదు.

"ఇంటికెళ్ళవమ్మా ... ఇది రోజూ వుండే భాగోతమే! మేమెవరం చూడటం లేదనుకుంటున్నావో లేక విడదీయలేమనుకుంటున్నావో... ఇంటికివెళ్ళు" ఎవరో మాధవితో అన్నారు.

ఆలోచనలనుంచి, ఆ దృశ్యంనుంచి ఆమె తేరుకుంది. అన్నదెవరో ఆమెకు తెలుసు. తనెవరో అతనికి తెలుసు.

అంతే! మాధవి అక్కణ్నించి కదిలింది.

* * *

మాధవి ఇల్లు చేరుకుంది. అవధాని వీధి అరుగుమీద పడకకుర్చీలో పడుకుని పేపరు చదువుతున్నాడు. అనసూయమ్మ వంటింటిలో వంట ప్రయత్నం చేస్తోంది.





ఏదో ఆకారం వచ్చిందని తెలియగానే అవధాని పేపరు పక్కకు తప్పించాడు.

"ఎవరూ .... మాధవేనా?" ఆశ్చర్యపోతూ అనుకున్నాడు.

"ఏమేవ్.. .మాధవి వచ్చిందే" అరిచాడు ఆయన వంటింట్లోకి వినబడేలా. ఆ మాట వినబడగానే అనసూయమ్మ హడావిడిగా వీధిలోకి వచ్చేసింది.

ఆ సమయంలో మాధవి రాక వారు వూహించనిది. ఉరుములు, పిడుగులు లేని వానలాంటిది. వారిని ఆశ్చర్యపరచాలనే మాధవి ఉత్తరం రాయలేదు. రిక్షా దార్లోనే దిగేసింది.

"ఏమ్మా...అలా అయిపోయావ్? ఇప్పుడెలావున్నావ్ ? ఆపరేషన్ బాగా జరిగిందా? ఏ బాధా, నొప్పి లేకుండా వున్నావా? ఎన్నాళ్ళయిందే తల్లీ నువ్వెళ్ళి? ఎంత ధైర్యమే నీకు. ఏం భయపడలేదు గదా? అంతా సవ్యంగా జరిగినట్టేనా?" అనసూయమ్మలోని మాతృప్రేమ ఏవో ప్రశ్నలు వేస్తోంది. ఆవిడ కూతురి ముక్కువైపే పరిశీలనగా చూస్తోంది.

"మాధవీ! ఇది నీ ముక్కేనా? ఎంత మారిపోయిందో? ఇప్పుడెంతబాగుందనుకున్నావ్ ?'' తల్లి సజలనయనాలతో అంటోంది.

"ఇదిగో... అదంతా తరువాతగాని కాఫీ కాచి ఇవ్వు. నీకు మరీ తొందరెక్కువ!" అవధాని పొంగుతున్న వాత్సల్యాన్ని కనబడనీయకుండా అంటున్నాడు.

తండ్రి సూట్ కేసు, బాగు లోపల పెట్టాడు.

తల్లి కూతురిని లోపలికి తీసుకు వెళ్ళింది.

"అమ్మా...ఇప్పుడు నా ముక్కు ఎలా వుందమ్మా?" అడిగింది మాధవి.

"నీకేమే ఇప్పుడెంతో బాగుంది.నీకున్న ధైర్యం, తెగింపుకు చాలా సంతోషం... మా మాట కాదని వెళ్ళినా ఫలితం బాగానే దక్కించుకున్నావు. నాకేమీ అనుమానం కలగటంలేదు. ఆ మాటకొస్తే ఎవరికీ అనుమానం రాదనే నా నమ్మకం..." మాతృ హృదయం ఆనందడోలికల్లో విహరిస్తోంది.

"కాఫీ తీసుకోమ్మా..." అనసూయమ్మ గ్లాసు ఇచ్చింది.

ఆ కన్నతల్లి కళ్ళు కూతురి ముక్కుమీదే వున్నాయి. ఇప్పుడా ముక్కు మాధవిని రెట్టింపు అందగత్తెని చేసింది. తన 'దీక్ష' ఆ నాసికను తలుగుతుందేమో నన్నట్టుగా వుంది అనసూయమ్మకు.

మాధవి ఎర్రటి బుగ్గలు, నల్లటి కళ్ళు, చక్కని పెదిమలు, విశాలమైన ఫాలభాగం ఒక ఎత్తు! ఈ కొత్త నాసిక ఒక ఎత్తు! అద్దంలో చూసుకుంటే తనకే ఆశ్చర్యంగా వుంటోంది. ఆ తృప్తి, ఆనందం, సంతోషం ఎగిసిపడే హృదయాన్ని అదుపులో పెట్టలేకపోతున్నాయి.

మాధవి స్నానానికి బయలుదేరింది.

"అనసూయా... మన అమ్మాయేనా వచ్చింది? దానికెంత ధైర్యమే! కాదన్నా వినకుండా వెళ్ళినందుకు మంచిపనే అయింది'' అవధాని భార్యతో అన్నాడు.

మరికాసేపట్లో మాధవి, అవధాని భోజనానికి కూర్చున్నారు. అనసూయమ్మ వడ్డన చేస్తోంది. కబుర్లు అలా అలా సాగాయి.

భోజనం కాగానే ఓ కునుకు తీసింది మాధవి.

నిద్రలేచేసరికి మూడుగంటలయింది.

"అమ్మాయికి రాత్రి రైల్లో నిద్ర



లేదులా వుంది'' అవధాని మాటలు అనసూయమ్మకు వినిపించాయి వంట ఇంట్లోకి.

ఉలిక్కిపడి లేచింది మాధవి. ఎదురుగా గోడగడియారం మూడు గంటలుకొట్టి అయిదునిముషాలయింది. ఆమెకు నిద్రలో కూడా రోడ్డుమీద దృశ్యమేకదలసాగింది. ఏవో ఆలోచనలతోనే ఎప్పుడో నిద్రపట్టేసింది.

"కాఫీ ఇంద" అంది అనసూయమ్మ.

"అంటే ఈమధ్య ఎప్పుడయినా ఓసారి జరిగిందా ఏమిటి?"

"అవునమ్మా.... నిన్న సాయంత్రం కూడా జరిగిందట!"

"ఏమిటమ్మా...అదిఅన్యాయంకాదూ! కట్టుకున్న పెళ్ళాన్నిలా నిర్దాక్షిణ్యంగా, రోడ్డుమీద చిత్రహింస చేస్తుంటే ఏ మగాడూ విడిపించటంలేదు. ఇంతకన్నా దారుణం మరొకటుంటుందా!" ఆవేశంగా అంది మాధవి. ఆ మాటల్లో మగజాతి మీద ద్వేషం, కసి ధ్వనించాయి.

"ఆ సమయంలో ఎవరూ అడ్డుపడ




"నాన్నగారు లేరా?" అడిగింది మాధవి.

"లేరు. రోడ్డుమీదికెళ్ళారు. ఆయనకు వేరే పనేముంది. ఆ లైబ్రరీలో పేపరు చూస్తూ కూర్చుంటారు" అనసూయమ్మ స్వరంలో కొంచెం దర్పం ధ్వనించింది.

మాధవి తల్లితోతను చూసిన దృశ్యం గురించి ప్రస్తావించింది.

"ఏమిటి .. ఆ గొడవ ఈవేళ కూడా జరిగిందా?" ఆశ్చర్యంతో అందావిడ.

కూడదమ్మా...ఒకవేళ ఎవరయినా ప్రయత్నించినా లాభం వుండదు"

"అయితే మాత్రం, నిలదీసి అడగటంలో తప్పేముంది?"

"నిన్న ఇలాగే హెడ్మాస్టరుగారి మనవడు బస్సుదిగివస్తూ వారితగవు చూసి జాలిపడ్డాడుట. పాపంవిడదీసే ప్రయత్నం చేయబోయాడుట. 'నువ్వు పెద్దమగాడివా. నా పెళ్ళాన్ని నా ఇష్టం వచ్చినట్టు చేసుకుంటాను... నువ్వెళ్ళవయ్యా నీ దారిని' అన్నాడుట ముందుకుతోస్తూ"

"అయితే అతను వెళ్ళిపోయాడా?"

"మరోసారి విడదీయబోయాడుట... అతని భార్యతో, నువ్వెళ్ళమ్మా నీ భర్త వేడిమీద వున్నాడుగాని, తరువాత మామూలు మనిషయిపోతాడులే అన్నాడట.... అంతే! ఆమె భర్త అతన్ని కిందకు లాగి పడేశాడుట... అయినా తాగుబోతు మనిషికి మంచీ, మర్యాదాఏమిటి?" అనసూయమ్మ చెప్పటం ఆపింది.

మాధవి ఆలోచిస్తోంది.... ఆ సమయంలో తను కల్పించుకొంటే ఎలా వుండేదో అని! కాని తను అబల... శారీరకంగా బలహీనురాలు... పైగా అదే పూరి ఆడపడుచు. హెడ్మాస్టరుగారి మనవడు ముంగండలో వుండడు. ఎప్పుడో ఏడాదికో, రెండేళ్ళకో తాతగారిని, బాబాయిని, చుట్టాలనిచూసేందుకు వస్తాడు. రేపు ముఖాముఖాలు చూసుకోవలసిన వాళ్ళు. అంతమంది మగాళ్ళు చేతులకు గాజులు తొడుక్కుని, నోళ్ళకు తాళాలు వేసుకుని కూర్చుంటే ఆడపిల్ల.... పెళ్ళికాని ఆడపిల్ల కల్పించుకోవడం సమంజసం కాదేమో! తను వారి మధ్య తలదూర్చకపోవడం మంచిదయిందేమో... సమాధానపడింది ఆమె.

సాయంత్రం అయిదుగంటలు.

మాధవి వచ్చిందని తెలియగానే ఆమె స్నేహితురాళ్ళు వచ్చారు. తనెందుకు హైదరాబాదువెళ్ళిందో ఎవరికీ తెలియదు. ముందుగా చెప్పకపోవటం వల్ల చెప్పటం అనవసరమనిపించింది.

"హల్లో.. మాధవీ! ఏమిటోయ్, అలా చెప్పాపెట్టకుండా వుడాయించేసేవ్! ఏమిటి సంగతి? ఉద్యోగ ప్రయత్నమా లేక మరేదైనానా?" డాక్టరుగారి కూతురు అడిగింది.

"ఏంలేదేయ్... సుజాత దగ్గరికెళ్ళానోయ్. రమ్మని ఉత్తరాలు రాస్తోంది. సరే...మనకేమి వ్యాపకంలేదు, ఉద్యోగం లేదు, బాదరబందీలు లేవని, ఓ నెల కాలక్షేపం చేయొచ్చని వెళ్ళివచ్చాను" అంది మాధవి.

"సుజాత అంటే గుర్తుకొచ్చిందోయ్! తను అదృష్టవంతురాలు... బి. ఎస్సీ. పాసయింది. నర్సు ట్రైనింగు అవగానే ఉద్యోగం కూడా వచ్చేసింది. మనకి ఏమీ లేదోయ్" ఆ మాటల్లో మాధవికి పెళ్ళికాలేదన్న విచారం వ్యక్తపరచింది స్నేహితురాలు.

ఆ సంగతి మాధవిగుర్తించకపోలేదు.

"నీకేమోయ్... మీ నాన్నగారు డాక్టరు. నీకూ్కడా డాక్టరు భర్తను తీసుకు వస్తారు. తొందరెందుకు... అప్పుడే దృష్టి 'దాని మీదకు పోయిందా?'" మాధవి చాలా తెలివైనది. ఏ మాటను ఎలా ఎప్పుడు ప్రయోగించాలో చురక తగలకుండా మెత్తగాతెల్సు జవాబు చెప్పగల నేర్పు ఆమె ప్రత్యేకత.

"అవునూ... ఏమిటీ నీ ముఖంలో ఏదో కొత్త అందం, ప్రత్యేకత

కనిపిస్తోంది? హైదరాబాదులో బ్యూటీ పార్లరుకెళ్లి మెరుగులుదిద్దించుకున్నావా?" స్నేహితురాలు హఠాత్తుగా ప్రశ్నించింది.

"నీకు అలా కన్పిస్తున్నదా? మరే మైనా అనిపిస్తోందా?" స్నేహితురాలిచేతే జవాబు చెప్పించాలని మాధవి ప్రయత్నం.

"నాకయితే ఏమీ తెలియటంలేదు. అవే కళ్ళు, బుగ్గలు, పెదవులు, నుదురు, ముక్కు! మరిచేనోయ్.... ఏమిటీ ముక్కులో ఏదో అందం కన్పిస్తోంది? ఇదేనోయ్ ప్రత్యేకంగా గమనించలేక పోయాను" పరిశీలనగా నాసిక అందాన్ని చూస్తోంది స్నేహితురాలు.

"అవునే... దానికోసమే సుజాత దగ్గర కెళ్ళేను. తను పనిచేస్తున్న నర్సింగు హోముకు ఓ దేశీడాక్టర్లు వచ్చేరు వారిచేత ప్లాస్టిక్ సర్జరీ చేయించుకునేందుకే వెళ్ళాను. ఇప్పుడు నా ముక్కు నిజంగా బాగుందా, వెక్కిరింపుగాఅంటున్నావా?"

"ఏంలేదోయ్...పుట్టుకతోనే వున్న ట్టుగా వుంది. ఈ వూరివాళ్ళు తరచు చూస్తుంటారు కాబట్టి గానీ కొత్తవారికి ఏవిధమైన అనుమానం రావడానికి అవ కాశం మాత్రంలేదు. నిజంగానోయ్..ఇంక నీకు అడ్డులేదోయ్! ఇప్పుడు ఇంటర్వ్యూ పెడితే నిన్ను పెళ్ళిచేసుకోకపోతే, వాడు మగాడేకాడు..."

స్నేహితురాలి అభినందనలని మాధవి లోపలే దాచుకుంది. పావుగంట లోకాభిరామాయణం తరువాత స్నేహితు రాలు వెళ్ళిపోయింది.

దాదాపు రెండుగంటల కాలక్షేపంలో ఆమెను పరామర్శ చేసేందుకు వచ్చిన వాళ్ళలో కరణంగారి కూతురు, బాంకు ఏజంటుగారి మనవరాలు, ప్రెసిడెంటు గారి కోడలు, కేటలాగు డాక్టరుగారి అమ్మాయి....ఇలా ఎందరో వున్నారు. అందరూ ఒకేవిధమైన అభిప్రాయాన్ని వ్యక్తపరచారు

"నీ ముక్కు చాలా బాగుందోయ్.... ప్లాస్టిక్ సర్జరీ చేయించుకున్నట్టుగా లేదు.. ఈసారి పెళ్ళిచూపుల్లో పెళ్ళికొడుకు నీ నాసికను చూసి దంగైపోతాడు...గో ఎహెడ్!" అని.

కాని మాధవిలో ఇప్పుడు రెండు కొత్త భయాలు... అనుమానాలు చోటు చేసుకున్నాయి. తరచు గుర్తుకొచ్చేది... ఓ అడుగు ముందుకువేస్తే అంతవరకూ వేసిన అడుగులు మరింక తనచేత అడుగులు వేయించనీవేమో! అలా అని తను ఓనిర్ణయంతీసుకోకుండా వుండలేదు. దానికోసమేకదా ఈ ప్రయత్నం! ఇంత వరకూ వచ్చాక ఇదేమిటి?

* * *

మర్నాడు ఉదయం పోస్టుకి మాధవి సుజాతకు ఉత్తరం రాసింది. కొంచెం పాతబడేవరకూ ఆమె చెరువుకుగాని, స్నేహితులు, చుట్టాల ఇంటికి వెళ్ళలేదు. అయితే ఎవరూ ఆమెను తన నాసిక గురించి అడగలేదు.... మొదటినుంచీవున్న దేమోనన్న దృష్టితో. కారణం ఆ వూళ్ళోవారికి ప్లాస్టిక్‌సర్జరీ ద్వారా ఇటు వంటి లోపాలని సరిదిద్దుకోవచ్చునని తెలియకపోవటం వల్లనే! తెలిసిన వాళ్ళెవరూ తనని అడిగేవారు కాదు. ఒక వేళ అడిగినా, జవాబు చెప్పగలదు మాధవి.

అవధాని మళ్ళీ కూతురికి పెళ్ళి సంబంధాలు చూస్తున్నాడు. చెల్లెలు ప్లాస్టిక్ సర్జరీ చేయించుకుందని తెలిసి, అన్నగార్లు భార్యాపిల్లలతో వచ్చి నాలుగు రోజులుండి వెళ్ళిపోయారు. "మాధవికి

పెళ్ళి చేసేయండి....ఇంకేమీ అడ్డులేదు గదా!" కొడుకులు తండ్రికి సలహాగా చెప్పారు. మరో వారానికి మాధవి చెల్లెలు భర్తతో వచ్చి వెళ్ళింది. "అక్కా! నీకు పెళ్ళి కాకుండానే నేను చేసుకోవలసి వచ్చింది" చెల్లెలు మాటలు తరచు గుర్తుకొస్తుంటాయి.

"మాధవికి పెళ్ళి చేద్దాం... సంబంధాలు చూడండి" అనసూయమ్మ నాలుగైదుసార్లు భర్త చెవినవేసింది.

"మీ ఆఫీసుల్లోగాని, స్నేహితుల ద్వారాగాని వరుడిని చూడండి. పెళ్ళి చూపులు ఏర్పాటు చేద్దాం" అన్నాడు అవధాని కొడుకులతో, వాళ్ళు వెళ్ళే ముందే.

"మా ఆఫీసుల్లో వాళ్ళొద్దు. ఒక్కొక్కడికి ఒక్కొక్క ఫ్లాష్‌బాక్, చరిత్ర వుంది. అంతకన్నా వేరే సంబంధం అయితేనే బాగుంటుంది" అన్నారు కొడుకులు.

కొడుకుల ఉద్దేశం ఆయనకు తెలియక పోలేదు. వారు శ్రద్ధ వహించరు. ఇంటి విషయాలు పట్టించుకోరు. మాధవిని ఇంకా ఇంట్లో వుంచుకుంటే ఎక్కువ కట్న కానుకలు ఇవ్వాల్సివస్తుందని తమ వాటా ఆస్తి తగ్గిపోతుందని వారి భయం.

అందుకే అవధాని తెలిసిన వారిద్వారా ప్రయత్నాలు చేస్తున్నాడు.

"నాన్నా... మనం పేపరుతెప్పిద్దాం!" అంది మాధవి తండ్రితో ఒకరోజు.

"ఎందుకమ్మా!మన గ్రంధాలయంలో ఎటూ పేపర్లు తెప్పిస్తున్నారుకదా... మళ్ళీ మనంకూడా ఎందుకమ్మా!" అవధాని అన్నాడు.

"పేపర్లలో ఉద్యోగ ప్రకటనలుంటాయికదా దానికోసం మనం పేపరు కొనాలి"

"ఇప్పుడు మనకా ప్రకటనలతో సంబంధమేమిటి?"

"నేను ఉద్యోగం కూడా చేస్తుంటే మీ ప్రయత్నాలు మరింత సులభం అవుతాయి" మాధవి తన ఉద్దేశాన్ని తెలిపింది.

"అంటే నువ్వు ఉద్యోగం చేయాలనుకుంటున్నావామ్మా?"

"అవును నాన్నా! సుజాత చేస్తోంది కదా.. నాకూ చేయాలనిపిస్తోంది!"

"ఎందుకమ్మా! మన ఇళ్ళల్లో ఆడవాళ్ళెవరూ ఉద్యోగం చేయటంలేదుకదా నీకెందుకూ?"

"అయితే వారితోపాటు నేనూ చేయకూడదన్న రూలేముంది? మరి నన్నెందుకు బి.ఎస్సీ వరకూ చదివించినట్టు? టెంతు క్లాసుతో ఆపించివుంటే నీకు ఇష్టం వుండేదికాదుగదా!"

"అదికాదమ్మా నా ఉద్దేశం!"

"నీ వుద్దేశం ఏదయినా నేను ఉద్యోగం చేయాలనుకుంటున్నాను"

అవధానికి మరింక కూతురుని నొప్పించటం ఇష్టంలేదు. ఈ రోజుల్లో ఆడపిల్లల వివాహాలు రాజకీయ పదవులు, మంత్రి పదవులు సంపాదించటంకంటే కష్టమైపోతున్నాయి. సంబంధాలు తెలుసుకునేందుకు, పెళ్ళిచూపులకు ఎంతో డబ్బు ఖర్చు...ఎన్నో జతల చెప్పులు అరిగిపోవటం పరిపాటయిపోతోంది. పెళ్ళి చూపులంటే షోకేసుల్లో వుండే బొమ్మలను చూడటంగా వుంటోంది.

మర్నాడినుంచే అవధాని కూతురు చెప్పినట్టుగా రెండు రకాల ఇంగ్లీష పేపర్లూ, ఉద్యోగ వార్తలు తెలిపే 'ఎంప్లాయిమెంట్ న్యూస్' వారపత్రికా




తెప్పించసాగాడు.

తన బి.ఎస్సి అర్హతకు సరిపోయే ఉద్యోగాలన్నింటికి దరఖాస్తులు చేస్తోంది మాధవి. పోస్టలార్డర్లు, పోస్టేజీ ఒక్కసారిగా తెచ్చుకుని చకచకా అప్లయ్ చేసేస్తోంది.

'దేశంలో ఇన్ని లక్షలమంది నిరుద్యోగులు.. ఎన్నో అర్హతలున్నవాళ్ళు... ఎండమావుల్లాంటి ఉద్యోగావకాశాలతో పోటీలుపడి విఫలులౌతుండే తన కూతురుకున్న బి.ఎస్సి. ఫస్టుక్లాసు డిగ్రీ ఉద్యోగాన్నిప్పించగలదా?' అని తరచు అనుకుంటుంటాడు అవధాని.

దాదాపు పది ఉద్యోగాలకు మాధవి అప్లయి చేసింది. ప్రస్తుతం తను రాత పరీక్షలు, ఇంటర్వ్యూలకోసం ఎదురు చూస్తోంది. కూతురుకున్న పట్టుదల, శ్రద్ధ, ఆసక్తికి ఆ తల్లిదండ్రులెంతో ముగ్ధులవుతున్నారు.

తనకిప్పుడేమయింది ... ఏం లోటు వుందని... తనకున్న లోపం భగవంతుడి దయవల్ల సుజాత ప్రమేయంవల్ల తొలగిపోయింది. ఎంత కష్టమైనా ఇచ్చి వివాహం చేయగల స్తోమత తమకుంది. మరి తనెందుకిలా ఉద్యోగప్రయత్నాలు చేస్తోంది?' అవధాని, అనసూయమ్మలకు కలుగుతున్న ప్రశ్నలివి. కాని మాధవిని అడ్డుపెట్టడం వారి ఉద్దేశంకాదు.

మాధవికి స్టాఫ్ సెలక్షను కమీషను కార్యాలయంనుంచి రాత పరీక్షకు పిలుపొచ్చిన రోజున ఆమె ఆనందానికి అవధులులేవు.

"ఇంతవరకూ పద్దెనిమిది పెళ్ళి చూపులుజరిగాయికానీ నాకు పెళ్ళిమాత్రం కాలేదు. కారణం అందరికీ తెలుసు. ఇపుడు నేను అందరిలాగే అందంగా వుంటున్నానని చాలామంది ఒప్పిస్తున్నారు. అయినా నన్ను చూసేందుకు ఈమధ్య ఎవరూ రాలేదు ఇప్పుడు ఈ పరీక్షకు వెళ్లాలి. దీనిలో అయినా నన్ను సెలక్టు చేయి స్వామీ ఇందులో నా స్వార్థమే గాదు, అవసరం కూడా వుంది. కాబట్టి నా కోరిక తీర్చు స్వామీ" అని దేవుడ్ని ప్రార్థించిందా రోజు మాధవి.

రెండురోజుల్లో పరీక్షకెళ్ళాలి.

మాధవి వారంక్రితమే జనరల్ నాలెడ్జి, ఇతర పుస్తకాలు తిరగేసింది. రాజకీయాల గురించి తనకుతెలుసు. పోతే రాతపరీక్షల్లో అడిగే ప్రశ్నలు ఎలా వుంటాయో తెలియవు. వెళ్ళినవారిని అడిగి తెలుసుకోలేదు. ఇంటర్వ్యూలు పెద్ద ఫార్స్ అని ఆమెకు తెలుసు. లంచాలు ఇచ్చి ఉద్యోగాలు పొందినవాళ్లు ఆమెకు తెలియకపోలేదు. ఉద్యోగాలు ఇప్పించే బ్రోకర్ల గురించి వినడిగానీ, వాటిలో నిజానిజాలెంతో తెలుసుకునే అవసరం కలగలేదు.

రేపే హైదరాబాదు ప్రయాణం.

క్రితంరోజే మాధవి అమలాపురం వెళ్ళి బస్సు టికెట్టు రిజర్వు చేసేందుకు నిర్ణయించుకుంది. అంబాజీపేటలో బస్సు ఎక్కవచ్చు. కానీ ఖాళీ లేకపోతే పిలుపురదు. ప్రయాణం ఆగి పోతుంది. రాజోలు బస్సు కూడా వుంది గానీ దానిలో కూడా ఖాళీ లేకపోతే, ఇంతేసంగతులు. పోతే ప్రయివేటు బస్సు... అవసరమయినప్పుడే బస్సులు రద్దీగా వుంటాయి. కావాల్సిన బస్సు, రైలు ఎప్పుడూ రైముకు రావు. అందుకే ముందుగా రిజర్వు చేయించుకోడం మంచిది.

"నువ్వు బట్టలు సర్దు...నేను అమలా

పురం వెళ్ళి టిక్కెట్టు కొనుక్కొస్తాను" చెప్పింది మాధవి తల్లికి.

మాధవి తిరిగొచ్చేసరికి పన్నెండు గంటలయింది. అమలాపురంలో హైదరాబాదు బస్సు అయిదు గంటలకు బయలు దేరుతుంది. అంబాజీపేట వచ్చేసరికి అయిదుంపావు అవుతుంది. ముంగండ నుంచి అంబాజీపేట వెళ్ళాలి. రిక్షామీద అరగంట ప్రయాణం. కాబట్టి నాలుగు న్నరకు బయలుదేరితే చాలు. సరిగ్గా ఆ టైముకే వర్జ్యాలొస్తాయి. తనకు ఇటు వంటి విషయాల్లో నమ్మకం లేకపోయినా, అవధానికి పట్టింపులున్నాయి.

అందుకే అవధాని నాలుగుగంటలకే ప్రయాణం అన్నాడు.

అంబాజీపేట కూతురుని తీసుకువెళ్ళి, బస్సు ఎక్కించి వచ్చేడు అవధాని. బస్సు వెళ్ళగానే, ఆయన ఇంటికి తిరిగొచ్చేడు.

* * *

మాధవి తలుపు కొట్టింది.

సుజాత తలుపు తీసింది. స్నేహితురాలిని చూడగానే ఆశ్చర్యపోయింది.

"ఏమే...బాగున్నావా? ఏమిటీ రాక... విశేషం ఏమైనా వుందా?" -అడిగింది సుజాత.

"ఇవాళ స్టాఫ్ సెలక్షను టెస్టు వుంది" చెప్పింది మాధవి.

"రెండురోజులు ముందుగారాకూడదూ! ఏమంత రాచకార్యం వెలగబెడుతున్నట్టు ముంగండలో!" చిరుకోపం ప్రదర్శించిందామె.

"ఏం లేదే! ఎటూ నాకు ఉద్యోగం రాదు. ఎం.ఎలు, ఎం.ఎస్సీలు పోటీపడతారు కదా...అఫ్టారాల్ నా బి.ఎస్సీ ఎవరికి కావాలి. దరఖాసు పంపించాను. వాళ్ళు దయతలచి పిలిచారు. నాన్న వెళ్ళమని డబ్బు ఇచ్చారు.ఇలావచ్చేసాను...అంతే!" చెప్పింది మాధవి.

"అయితే త్వరగా తయారవ్...టైము లేదు కూడా!"

మాధవి టైము చూసుకుంది. ఎనిమిది కావస్తోంది.

"ఇంతకీ నీ ముక్కు ఏమంటుందోయ్! ఎలా వుందన్నారు మీ వాళ్ళు, స్నేహితులూ?" అడిగింది సుజాత.

"గొప్ప కాదుకాని అందరూ నిన్నే మెచ్చుకున్నారే! అసలు చాలామందికి అనుమానమే కలగలేదనుకో! అమ్మ అయితే, ఎంతో సంతోషపడిపోతోం దనుకో! నువ్వు చేసిన సాయానికి మెనీ మెనీ థాంక్స్!"

"నాదేంవుందే! డాక్టర్లు వున్నారుకాబట్టి నీకు ప్లాస్టిక్ సర్జరీ చేయించాను. ఫీజు, ఖర్చు ఇచ్చుకున్నావ్. స్నేహితురాలివి కాబట్టి ఓ నెలరోజులు ఆతిథ్యం ఇచ్చాను. దానిక్కూడా వెలకట్టి,పట్టుచీర కొనుక్కోమని డబ్బిచ్చావు కదా!" సుజాత అంది.

"ఛ ఛ...నేనా వుద్దేశంతో ఇవ్వలేదే! నామీద చూపించిన ఆత్మీయతకు ఏమి ఇవ్వాలో తెలియక అలా చేసానంతే!" మాధవి చెప్పింది.

"ఇదుగో నేను కొనుక్కున్న పట్టు చీర" స్నేహితురాలికి చూపించింది.

"ఇలా చూపిస్తే ఏం తెలుస్తుందిలేవే! నువ్వు కట్టుకున్నాక చూడాలి. అందం చీరలో వుందో, కట్టుకునే పద్ధతిలో వుందో, కట్టుకున్న నీలో వుందో. సరే....ముందు పరీక్షకు తయారవాలి కదా, సాయంత్రం తీరుబడిగా మాట్లాడుకుందాం"

మాధవి స్నానానికి కదిలింది.

సుజాత స్నేహితురాలిని పరీక్ష




సెంటరు దగ్గర దిగబెట్టింది.

"పరీక్ష తరువాత నువ్వు రాగలవా లేక నేను రావాలా?"

"ఎందుకోయ్! ఇప్పుడు చూసానుగా. పైగా నోట్లో నాలుకవుంది... చదువు కున్నాను. నాలుగువందల మైళ్లు ఒంటరిగా ప్రయాణంచేయటం అలవాటయిపోయింది. ఇంక నిన్ను శ్రమపెట్టను" అందిమాధవి.

"సరే అయితే తిన్నగా ఇంటి కొచ్చేయ్. బాగా రాయి....బెస్టాఫ్ లక్" స్నేహితురాలిని ఆశీర్వదించి సుజాత ఆసుపత్రికి వెళ్ళిపోయింది.

సాయంత్రం అయిదు గంటలకు....

"ఎలా రాశావే పరీక్ష?" లోపలి కొస్తూనే అడిగింది సుజాత.

"బాగానే రాసాను...కాని అదృష్టం కూడా వుండాలి కదా!"

"ఇదే ఈరోజుల్లో అందరూ అను కొనేది! ఉద్యోగం వస్తే అదృష్టం! లేకపోతే కర్మ, దురదృష్టం అని బాధ పడకూడదు"

"సరే అయితే....మరి నా ప్రయాణం రేపు గోదావరి ఎక్స్‌ప్రెస్‌కే!"

"అదేమిటోయ్... అప్పుడే ఏమిటి? నాలుగు రోజులుండి వెడుదువుగాని!"

"వద్దులేవే.... వచ్చినపని అయింది కదా. ఇంకెన్నిసార్లు ఈ హైదరాబాదు రావాలో ... ఇంటర్వ్యూలు, రాత పరీక్షలు పేరు చెప్పి. కాబట్టి నన్నేమీ బలవంతం చేయక" అంది మాధవి.

"సరే... నీ ఇష్టం. మరి ఏదైనా సినిమాకెళదామా?"

"అలా అన్నావ్ బాగుంది. నీ ఇష్టం, ఏదైనా ఇంగ్లీషు పిక్చరు

సుజాత ఇంగ్లీషు సినిమాలు ప్రదర్శించే థియేటర్లకోసం పేపరు తిరగే సింది.

అరగంటలో ఇద్దరూ తయారయ్యారు. ఆటోలో బయల్దేరారు.

* * *

మర్నాడు గోదావరి ఎక్స్‌ప్రెస్‌కి మాధవి ఇంటికి బయలు దేరింది.

"రేపు ఆదివారం నిన్ను చూసేందు కొస్తున్నారు మాధవీ!" అనసూయమ్మ చెప్పింది భోజనాలముందు.

తను మాట్లాడలేదు. 'మళ్ళీ మొద లయిందన్నమాట' అనుకుంది.

అనుకున్న ఆదివారం ... పెళ్ళి చూపుల ఆదివారం...

మధ్యాహ్నం రెండుగంటలు దాటింది.

అవధాని హాల్లో కుర్చీలు సర్దుతూ వున్నారు. అనసూయమ్మ టిఫిన్లు, కాఫీ ప్రయత్నంలోవుంది. అరగంట క్రితమే మాధవి తయారయింది. గదిలో అద్దం ముందు నిలబడింది. తను అందగత్తె... అందులో ఈమధ్య మరింత అందాన్ని తెచ్చిపెట్టింది కొత్త నాసిక!

వధువుకి సామాన్యంగా ఏం కావాలో ఎవరికీ తెలీదు కానీ వరుని తల్లిదండ్రు లకు కావలసినవి మాత్రం అందరికీ తెలుసు. ఆ వివరాలు వీళ్లు కూడా ముందు గానే తెలియపరచారు.

వారికి నలభైవేలు కట్నంగా కావాలి. ముగ్గురు ఆడపడుచులకు తొమ్మిదివేలు లాంఛనాలు చాలు. వరుడికి వెండి కంచం, ఉంగరం సరిపోతుందిట. మూడు జతల సూటు బట్టలకన్నా ఎక్కువ తీసుకో



ఉగాది, దసరా పండుగలకు అత్తగారిని, ఆడపడుచులు, వారి పిల్లలని ఆహ్వానించాలిట. వివాహానికి తమ తరఫున కేవలం రెండువందల మందేవస్తారు. పెళ్ళి మాత్రం ఎంత నిరాడంబరంగా చేసినా ఫరవాలేదుట!

"మాధవీ... ఏమంటావమ్మా?" అడిగాడు అవధాని.

"పోనీలేమ్మా! వాళ్ళింట్లో కాఫీపొడి, పంచదార అయిపోయాయేమో! టిఫిను చేసి, కాఫీ తాగి వెడతారులెండి!" తల్లి వైపు చూస్తూ చెప్పింది మాధవి.

కూతురు మనస్తత్వం, ఉద్దేశం ఆ దంపతులకు తెలియనిది కాదు.

"రోజులెలా వున్నాయో నీకు తెలుసు కదమ్మా! ప్రతిదీ పెరిగిపోయింది. కాబట్టి మనకూ తప్పదుకదా?" అన్నాడు తండ్రి.

"నాన్నా... అతను బాంకు ఉద్యోగి కావచ్చు. కాని బాంకుల్లో వుండే డబ్బుకు హక్కుదారుడు కాడుకదా! నెలకో సారి జీతం, ఏడాదికోసారి బోనస్సు, అప్పుడప్పుడు ఓవర్ టైము... అంతేగా. అతనికున్న ఆస్తి, వాటాల విషయం నీకు తెలియనిది కాదు. కనీసం మనం ఇచ్చే కట్నం డబ్బుని లెక్కపెట్టగలిగే ధైర్యం అయినా వుందో లేదో! నీ కొడుకులకు ఎంత తీసుకున్నావో మరిచిపోయావా?" అంది మాధవి కోపంగా.

ఇంక ఆ ప్రసక్తి కొనసాగలేదు.

పెళ్ళివారు వచ్చేసరికి మూడుగంటలయింది.

పెళ్ళికొడుకుతోపాటు అతని తల్లి, తండ్రి, ముగ్గురు చెల్లెళ్ళు, వారి పిల్లలు వచ్చారు. చూపులు ప్రారంభమయ్యాయి.



"అమ్మాయి బి. ఎస్సి. ఫస్టుక్లాసులో పాసయింది.... ఎం. ఎస్సి. చదువుతానంది. కాని వాల్తేరులో వంటరిగా వుండాలని పంపించలేదు" చెప్పాడు అవధాని వరుడి తండ్రివైపు చూస్తూ.

"మా మాధవికి అన్నిపనులూ వచ్చు. పిండివంటలు చేయగలదు. వాళ్ళమ్మ కన్నా బాగా చేస్తుంది" ఎదురింటావిడ చెప్పింది.

"సంగీతంలో ప్రవేశం వుందా అమ్మాయికి?" వరుడి తల్లి అడిగింది.

"లేదు" తెలిపింది మాధవి.

ఇంతలో ఓ యువకుడు వచ్చి పెళ్ళికొడుకు పక్కన కూర్చుని మాధవి వైపు చూడసాగాడు. అయిదు నిముషాల తరువాత అతను పెళ్లికొడుకుని బయటకు తీసుకుపోయాడు.

'అతనికి తన ముక్కు గురించి తెలిసి వుంటుంది. ఆ విషయమే స్నేహితుడి

చెప్పేందుకు బయటకు తీసుకెళ్ళి వుంటాడు' అనుకుంది మాధవి. అలా అనుకోవటంలో అసహజం లేదు.

పావుగంట తరువాత వరుడు తిరిగొచ్చాడు.

"పెద్దమ్మాయికి కాకుండా చిన్నమ్మాయికెందుకు పెళ్ళి చేసినట్టు?" అడిగింది పెళ్ళికొడుకు తల్లి.

అవధాని చెప్పబోయాడు. మాధవి కల్పించుకుంది.

"నన్ను చెప్పమంటారా?" ప్రశ్నించింది తను వారివైపు చూస్తూ.

"చెప్పమ్మా!" అన్నారు వాళ్ళు.

"ఉద్యోగాలకు అప్లయ్ చేసినవాళ్ళందరూ ఉద్యోగస్తులవుతున్నారా? ఎవరి అదృష్టంవారిది. నా చెల్లెలు అదృష్టం బాగుంది. నాన్నగారు నాకే ముందర చేయాలనుకున్నారు. కాని నాకు మీతో రాసిపెట్టి వుందేమో జరగలేదు" అంది మాధవి. ఆ మాటల్లో వ్యంగ్యం, కోపం ధ్వనించింది.

'అలాగెందుకన్నావమ్మా... నువ్వాడపిల్లవు. సౌమ్యంగా వుండాలి' అన్నట్లు చూసారు ఆమె తల్లిదండ్రులు.

"ఉద్యోగం చేయటం ఇష్టమేనా?" అడిగాడు వరుడు.

ఇష్టమేనన్నట్లు చెప్పింది.

కొన్ని నిమిషాల తరువాత-

"ఇప్పుడు మీ గురించి తెలుసుకోవాలి...ఎందుకంటే రేపు పెళ్ళయితే కాపురం చేయవలసింది మీతోనేగదా" వరుడిని అడిగింది.

ఆ మాటకు అందరూ నిశ్చేష్టులయ్యారు.

పెళ్ళిచూపుల్లో పెళ్ళికూతురు అడగవలసిన ప్రశ్నేనా? అది రివాజు కాదు ఆచారం కాదు. సాంప్రదాయం కాదు. తరతరాలనుంచి ఆడదాన్ని ఒక పరిధిలో వుంచిన జాతి మనది.

అయినా "నిరభ్యంతరంగా అడగవచ్చు ఫరవాలేదు" అన్నాడు వరుడు.

"ఇంతవరకూ మీరు ఎన్ని పెళ్ళిచూపులకు హాజరయ్యారు? ఎవరేం టిఫిన్లు, కాఫీలు ఇచ్చారు? ఎంతెంత కట్నాలు ఆఫరుచేసారు? అవన్నీ పెండింగులోవుంచి నన్ను చూస్తున్నారా? లేక ఎక్కువ కొటేషను కోసం ఇంకా ప్రయత్నిస్తున్నారా??"

మాధవి ప్రశ్నలు అందరికీ మతులు పోగొట్టాయి.

ఎవరూ వూహించని ప్రశ్నలు .... ఎక్కడా వినని ప్రశ్నలు.

"నువ్వు అలా అడగకూడదు. నీకు కొన్ని కట్టుబాట్లున్నాయి. ఇప్పుడే ఇలా ప్రవర్తించినదానివి రేపు పెళ్ళైతేఇంకెలా వుంటావో!" అన్నాడు వరుడి తండ్రి.

"నేనేమీ మీరనుకున్నంత నీచంగా, తెలివితక్కువగా ప్రశ్నించలేదు. ఇంతవరకూ ఏ అమ్మాయిలూఅడగని ప్రశ్నలే నేనడిగి వుండచ్చు. కానీ అవి నాకు అవసరం" సమాధానమిచ్చింది మాధవి.

అయిదు నిమిషాల తరువాత పెళ్ళివారు బయలుదేరారు.

"అమ్మాయిది తెలియనితనం. ఏదో ఆవేశంలో అని వుంటుంది. మీరేమీ అనుకోకండి" అవధాని వరుడి తండ్రికి చెప్పుకున్నాడు.

"చూడండి ... కాలం మారుతోంది. ఆడపిల్లలు కూడా అడగవలసిన కాలం వచ్చింది. నిజానికి ఆమె ధైర్యాన్ని నేను అభినందిస్తున్నాను. మరి మీకు వారం రోజుల్లో మా నిర్ణయం తెలియ





చేస్తాం" అన్నాడు పెళ్ళికొడుకు తండ్రి.

"మాధవీ! నీ ప్రవర్తన నాకేం నచ్చలేదు. ఏమిటలా ప్రశ్నించావ్ వారిని?" అవధాని మొదటిసారిగా కూతురుమీద మండిపడ్డాడు.

"నాన్నా... నీకు కోపం కలిగిస్తే నన్ను క్షమించు. కాని వాళ్ళేంచేస్తున్నారో నీకేం తెలుసు? పదిహేను రోజులు సెలవుపెట్టి వచ్చాడు ఆ వరుడు ... కేవలం అమ్మాయిలనే చూసేందుకు. ఇప్పటికి ఈ ఊళ్ళో నేను అయిదో దాన్ని. అదేనా పద్ధతి? ఎవరు ఎక్కువిస్తే వారిని చూడటమేనా నీతి?"

"నీకెవరు చెప్పారు?"

"ఒకరు చెప్పటం ఎందుకు... ఈ సంబంధం తెచ్చిన తెలుగు మాస్టారినే అడుగు.... తెలుస్తుంది. ఆ అబ్బాయి రాజోల్లో హెడ్మాస్టరుగారి అమ్మాయిని చూశాడు. నాగుల్లంకలో ఇనస్పెక్టరు గారి కూతుర్ని, పల్లెటికుర్రులో బాంకు ఏజంటుగారి మనవరాలిని, ముక్తేశ్వరం వారి అమ్మాయిని. ఈ ఊళ్ళో సరేసరి... ఇప్పుడు నన్ను. అందర్నీ చూడటమేనా? చూసిన అమ్మాయికి నిర్ణయం చెప్పనవసరంలేదా... మళ్ళీ మళ్ళీ రావటానికి దారి ఖర్చులవుతాయని వరుసగా అందరినీ-చూసేయడమేనా పద్ధతి?"

మాధవి జవాబు ఆ తండ్రిని, తల్లిని ఆలోచింపజేసింది.

"ఇంతకీ అబ్బాయి ఎలా ఉన్నాడు?" అడిగాడు తండ్రి.

"నాకు నచ్చలేదు నాన్నా!" నిర్భయంగా చెప్పింది.

నాలుగు రోజుల తరువాత సంబంధం తెచ్చిన తెలుగు మాస్టారు వచ్చారు.

"వాళ్ళకి అమ్మాయి నచ్చిందిట" అన్నాడాయన.

అవధాని, మాధవి చెప్పిన విషయాల గురించి అడిగాడు.

"అవునయ్యా అవధానీ! మళ్ళీ మళ్ళీ రావటానికి దారి ఖర్చులెంత అవుతాయ్? అందుకే ఈ ఏర్పాటు"

"కాని ఈ పద్ధతి బాగోలేదు ... అమ్మాయికి కుర్రాడు నచ్చలేదుట" చెప్పాడు అవధాని.

"ఎందుకు నచ్చలేదు...ఆఅబ్బాయికేం తక్కువ? కట్నం, కానుకలు ఎక్కువని నీకే నచ్చక ఆ కారణాన్ని అమ్మాయి మీదకు వదిలిపెట్టలేదుకదా? నిక్షేపంలాంటి కుర్రాడు.. మంచి సంబంధం" నచ్చ జెప్పబోయారు తెలుగు మాస్టారు.

"మీరెన్నయినా చెప్పండి ఎంత కట్నమైనా ఇచ్చి పెళ్ళిచేస్తాను.కాని అమ్మాయి కిష్టంలేని సంబంధంచేసి దాని జీవితం నరకంచేయదలచుకోలేదు .... మరేదైనా చూడండి" అవధాని నిర్ణయం తెలిపాడు.

"అంతేనంటావ్!" మరోసారి ప్రయత్నించాడు తెలుగు మాస్టారు.

ఆయన తెలుగు మాస్టారుగా రిటైరైనా ఆయన్నింకా అందరూ ఆహోదాతోనే పిలుస్తారు. ఆహోదాతనకెంతో హుందాతనాన్నిస్తుందని ఆయనే భావిస్తుంటారు. ఆయన వల్ల పనులు కావలసినవాళ్ళు 'తెలుగు మాస్టారు' అని పిలిస్తే చాలు పొంగిపోతాడు.

"అంతేగామరి" మాధవికేసి చూస్తూ చెప్పాడు అవధాని. తెలుగుమాస్టారు వెళ్ళిపోయారు.

* * *

అవధానికి నలుగురు చెల్లెళ్ళున్నారు. వారిదగ్గిర మాధవికి సరిపోయే కొడుకులున్నారు. లోగడ తన కూతురుని

చేసుకోమని అడిగించాడాయన.

"మాధవిని చేసుకోటం మాకేం ఖర్మ! అన్నారు చెల్లెళ్ళు.

అవధాని ఇచ్చే వేలకట్నం లాంఛనాలు వారికి నచ్చాయి. కాని మాధవి 'నాసిక' పెద్ద లోపంగా భావించారు.

తెలుగు మాస్టారు తెచ్చిన సంబంధం మాధవి తిప్పికొట్టిందని తెలియగానే, చెల్లెళ్ళు అన్నగారి దగ్గరకొచ్చారు.

"ఏరా అన్నయ్యా! మాధవికి పై సంబంధం చూడటం ఎందుకు? నా కోడలు గానే చేసుకుంటాను" అనసాగారు చెల్లెళ్ళు.

"ఎందుకులేవే....నాకూతురునిచేసుకో వాల్సిన ఖర్మ నీ కొడుకులకేంపట్టింది...? ఏదో ఒకటి దొరక్కపోదు, పైగా దానికి నచ్చిన సంబంధం చేయటమే నా అభిమతం. అయిన ఆలస్యం ఎటూ అయింది" అన్నాడు అవధాని.

అన్నగారు మెత్తబడినా, మాధవి అంగీకరించదన్న విషయం అత్తయ్యలకు తెలుసు.

చెల్లెళ్ళు రాగానే అవధానికి మరో విషయం గుర్తుకొచ్చింది. తన పెద్ద చెల్లెలు పదిహేనో ఏట, పాతికేళ్ళ క్రితం ఇల్లువిడిచి వెళ్ళిపోయింది. అది కులాంతర వివాహం చేసుకుందన్న కోపంతో వెళ్ళ గొట్టి, ఆ తర్వాత ఆవేశం పట్టలేక తండ్రి గుండెపోటువల్ల చనిపోయాడు.

ఈ నలుగురు చెల్లెళ్ళు తమ అక్క గారిని మరిచేపోయారు.

ఆ రక్తసంబంధం అవధానినొక్కడినే వేధించేది!

* * *

ఒకరోజు అమలాపురం సినిమాకెళ్ళి వస్తుంటే వంతెనమీద తెలుగు మాస్టారు చెప్పిన పెళ్ళికొడుకు కలిసాడు మాధవికి.

ఇద్దరూ ఒకరినొకరు చూసుకున్నారు.

అతను మాధవిని సమీపించాడు.

"మీసమాధానంవిన్నాను" అన్నాడు.

"మరిప్పుడు ఎందుకు ఆ ప్రసక్తి?" అతని కళ్ళల్లోకి సూటిగాచూస్తూ అడిగిం దామె.

"ఒక్కవిషయం-నేను సిగ్గుపడుతూ చెప్తున్నాను. నేను మగవాడిని కావచ్చు... నాకు ఎం.ఏ డిగ్రీ వుండచ్చు... బాంకు ఉద్యోగిని కావచ్చు కాని మీ నాన్నగారు ఒక్క కూతురు పెళ్ళిచేసేసరికే చల్ల బడ్డారు. మీరడిగిన ప్రశ్నలకు నేను హర్షిస్తున్నాను. కానినాచెల్లెళ్ళిద్దరికీ పెళ్ళి కావాలంటే అమాత్రం కట్నం నేను తీసుకోక తప్పదు. నిజానికి నేను కట్నం తీసుకోదలచుకోలేదు...కాని రోజులని బట్టి తలవంచవలసి వస్తోంది!" పెళ్లికొడుకు నీళ్ళవైపు చూస్తూ చెప్పాడు.

"మీరెందుకు అలా భయపడుతున్నారు మీరు మగవాళ్ళు. పెళ్లి కాకపోవడమనే ప్రశ్న మీకుండదు. ఎన్నో ప్లస్‌పాయింట్లున్నాయి మీకు. ఇంకా చాలామంది ఉన్నారు. మరింకా అవకాశం వుంటుంది. అందరూ ఆచరించే పద్ధతినే మీరూ నడవండి! ఆదర్శాలు, సందేశాలుబోధించే నాయకులు పెద్దలకే పట్టలేదు ఇంక మీరెందుకు పాటించాలి? మీ అదృష్టాన్ని, చెల్లెళ్ళ అదృష్టాన్ని పరీక్షించుకోండి" మాధవి అంది.

"మీరోసారి పునరాలోచన చేస్తే బాగుంటుంది!"

"సారీ....నాకు పెళ్లి కాకపోయినా నేను బాధపడను. కాని ఇలా టిఫిన్లు, కాఫీలు ఆరగించే పెళ్లికొడుకులంటే నాకిష్టం వుండదు. మీ చెల్లెళ్ళకి చదువులు చెప్పించి





ఉద్యోగాలు చేయించండి! ఉద్యోగంవుంటే ఇట్టే పెళ్ళవుతుంది. ఆవిధంగా చేయండి. ఇలా అన్నందుకు మన్నించండి!" మాధవి అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది.

పెళ్ళికొడుకు ఆమెలోని ఆత్మాభిమానాన్ని, ఆత్మస్థైర్యాన్ని, ఆత్మవిశ్వాసాన్ని మెచ్చుకున్నాడు. తను ఆమెను వివాహమాడలేకపోతున్నందుకు విచారించాడు.

ఆమెవైపే చూస్తూ వుండిపోయాడు చాలా సేపు.



## 6

రెండు నెలల్లో మరో నాలుగు సంబంధాలొచ్చాయి.

మాధవి వివాహానికి అంగీకరించింది. పెళ్లికొడుకు ఇష్టపడ్డాడు. అతని తల్లిదండ్రులు అవధాని ఇచ్చే కట్నండబ్బుకి తృప్తిచెందారు. మిగిలిన విషయాలు మాట్లాడేందుకు రావలసినదిగా కబురు పంపారు అవధానికి.

సాయంత్రం అవధాని కొత్తపేట వెళ్ళే ప్రయత్నంలో వున్నాడు. అదే రోజు మధ్యాహ్నం పన్నెండు గంటలకు పెళ్లికొడుకు అవధాని ఇంటికొచ్చేడు.

అతను మాధవితో మాటాడాలన్నాడు.

అవధాని, అనసూయమ్మ ఆశ్చర్యపడినా, సంతోషంగా అంగీకరించారు.

"ఎవరికీ తెలియని విషయం... ఒకటి చెప్పాలి" అన్నాడతను.

మాధవి గొంతులో ఏదో అడ్డుపడినట్లనిపించింది.

"మా వదిన చనిపోయిందని అందరికీ తెలుసు. కాని ఆ చావు సహజమైంది కాదు... ఆమె చావుకు బాధ్యులు మా అమ్మ, నాన్న. కొంతవరకూ మా అన్నయ్య. ఆ తరువాత మా ఇద్దరు చెల్లెళ్ళు."

అర్థంకానట్లుచూసింది మాధవి. 'ఇటువంటి పచ్చి నిజాలు, కుటుంబ విషయాలు ఎవరైనా చెబుతారా' అనిపించిందామెకు.

"ఎవరు నమ్మినా నమ్మకపోయినా అసలు విషయం చెప్పడం నా ధర్మం, బాధ్యత" అన్నాడతను.

"చెప్పండి!"

అతను చెప్పసాగాడు.

అతని వదిన హైదరాబాదులోనే ఓ ప్రభుత్వ కార్యాలయంలో పనిచేసేది. అన్నయ్య మెడికల్ రిప్రజెంటేటివు.. పదిహేను ఇరవై రోజులకోసారి ఇంటికొచ్చేవాడు. వదిన ఉద్యోగస్తురాలు కాబట్టి, ఇరవైవేల కట్నంతోటే ఆ ఇంటి కోడలయింది. ఆమె తల్లిదండ్రులు అక్కడే కొడుకు దగ్గరుంటున్నారు. అప్పట్లో అమ్మా, నాన్నా అక్కడే అన్నయ్య దగ్గరుండేవారు.

వివాహానికి ముందు కట్నం సొమ్ములో నాలుగు వేలు బాకీపడ్డారు వాళ్ళు.

"ఆరు నెలల్లోపల మిగిలిన డబ్బు ఇవ్వకపోతే, మీ అమ్మాయి మీతోనే కాపురం చేస్తుంది" అంది అమ్మ వదిన తల్లితో.

నాన్న కాదనలేకపోయాడు. చివరికి ఆ షరతుమీదే వారి శోభనం జరిగింది.

ఆరు నెలలకాలం పూర్తయింది.

"నీ బాబు నాలుగు నెలల్లో ఇస్తా నన్నాడు మిగిలిన డబ్బు. నీకిప్పుడు నాలుగో నెల...పోయి తీసుకురా డబ్బు" అని వదినని అమ్మ పుట్టింటికి పంపింది.

"మరో ఆరు నెలల్లో ఇస్తామని చెప్పమ్మా!" అన్నారు వదిన తండ్రి.

అమ్మ అందుకు అంగీకరించలేదు. అప్పట్నించీ నిప్పులు చెరగనారంభించింది.

"వాడు ఇంట్లో లేనప్పుడు సింగారించుకోటం దేనికి?" అనేది అమ్మ.

వదినకు ఆ మాటలు బాధగా వుండేవి.

"ఆఫీసుకు అంత షోకు ఎందుకు? నువ్వు సంసారం చేస్తున్నావా, సాని వేషాలు వేస్తున్నావా?"

అమ్మ మరింతగా బాధించేది వదినని.

ఈ వేధింపులు, బాధలతో వదిన భోజనం చేసేది కాదు. ఆఫీసుకు సామాన్యంగానే అలంకరించుకొని వెళ్ళేది. ఆడపడుచులు, అత్తగారు ఏడిపిస్తున్నారని తల్లితో చెప్పుకునేది.

"అవన్నీ పట్టించుకోకూడదమ్మా... ఎలాగో సర్దుకుపోవాలి" అని నచ్చ చెప్పేది నిస్సహాయురాలైన ఆ కన్నతల్లి.

ఒకసారయితే వారం రోజులు వదిన భోజనం చేయలేదు.

నాన్న అమ్మతో చెప్పేవారు- "ఎక్కడికి పోతుందే డబ్బు.... పాపం ఆడపిల్లని అలా బాధపెట్టటం బాగుంటుందా?" అని.

"అయితే ఇద్దరూ కలిసి హుస్సేన్ సాగర్లో పడి చావండి... నాకు మాత్రం డబ్బు కావాలి" అని అమ్మ సమాధానం.

"నా గురించి మీరెందుకు తగువు పడటం?" అనేది వదిన.

"అంత కట్నం ఇవ్వలేనివాడు ఆడపిల్లల్ని ఎందుకు కన్నాడు నీ తండ్రి? అరువు పెట్టడానికిది కిరాణా దుకాణం అనుకున్నాడేమో...ఆవేశాలేం కుదరవు. నెల రోజుల్లో డబ్బు తెచ్చి ఇస్తేనే నీకి ఇంట్లో స్థానం" ఓరోజు హెచ్చరించింది అమ్మ.

"నాకెక్కడైనా నాలుగు వేలు అప్పు ఇప్పించు. జీతంలో తీర్చుకుంటాను. ఏదో అడ్వాన్స్ పెట్టి తీర్చుకుంటాను.... నువ్వే నాకు సహాయం చేయాలి...?" అడిగింది వదిన ఒకరోజు నన్ను.

ఆమె పరిస్థితికెంతో బాధపడ్డాను. సిన్సియరుగా ప్రయత్నం చేసాను... కాని అందరూ 'తాకట్టు' కావాలన్నారు. ఆ విషయమే వదినతో చెప్పాను.

ఆరోజు మంగళవారం. మధ్యాహ్నం పన్నెండు గంటలకు వదిన నా దగ్గర కొచ్చింది. "ఇది నీ దగ్గరుంచు... గంటలో వస్తాను" అంటూ ఒక చిన్న సంచీ ఇచ్చి వెళ్ళిపోయింది.

అయిదు గంటలయింది. వదిన రాలేదు. ఎందుకు రాలేదో, ఎక్కడికెళ్ళిందో, ఎందుకు వెళ్ళిందో తెలియలేదు.

"ఏరా... ఈవేళ వదిన ఇంకా రాలేదేరా?" అడిగింది అమ్మ నన్ను. టైము ఏడుగంటలు కావస్తోంది.

అప్పుడు ఆమె ఇచ్చిన సంచీ తీసి చూసాను. అందులో పెళ్ళినాడు పెట్టిన గాజులు, గొలుసు వున్నాయి. ఒక రుమాలుకి, ఉత్తరం గుండుసూదితో గుచ్చబడి వుంది.

"నా తల్లిదండ్రులకు మగపిల్లల్ని కనటం చేతకాలేదు. వారి ఖర్మకొద్దీ నేను పుట్టాను. వాళ్ళు మిగిలిన కట్నం ఇక ఇవ్వలేరు. మీరు పెట్టిన నగలతో ఆ బాకీ సరిపెట్టుకోండి. మీ అబ్బాయికి మరో




సంబంధం చేయండి. అపవులేదని ముందే ఖచ్చితంగా చెప్పండి! మీ చేతుల్లో సజీవంగా ఆహుతి కావటం ఇష్టంలేక నా చావును నేను స్వహస్తాలతో ఆహ్వానించుకుంటున్నాను.

''కానీ ఇటువంటి పరిస్థితి మీ కూతుళ్ళకు కలగకూడదని దేవుడిని ప్రార్థిస్తున్నాను. మీతో చెప్పకుండా ఆత్మహత్య చేసుకుంటున్నందుకు క్షమించవలెను" అని ఉందా ఉత్తరంలో.

వదిన హుస్సేన్‌సాగరులో దూకి ఆత్మహత్య చేసుకుంది.

నాలుగు నెలల తరువాత అన్నయ్య మళ్ళీ పెళ్ళిచేసుకున్నాడు. అమ్మని, నాన్నని తనతో వుండవద్దని చెప్పేసాడు అన్నయ్య. తన ఇంటికి రావద్దని,వారితో తనకేమీ సంబంధం లేదని కూడా హెచ్చరించాడు. అప్పట్నుంచీ వారు కొత్తపేటలోనే వుంటున్నారు.

ఆడపిల్లల తల్లిదండ్రులు తమ కూతురికి ఏదో విధంగా పెళ్ళి జరిగితే చాలని భావిస్తారు కాని, లోతుగా పరిశీలించరు. ఫలితాలేమో ఇలా ఉంటున్నాయి.

"ఇప్పుడు చెప్పండి...నన్ను పెళ్ళి చేసుకోగలరా?" అతను అడిగాడు.

మాధవి ఏమీ చెప్పలేదు. అవధాని ఆశ్చర్యపోయాడు.

"నా నిర్ణయం మీకు తెలిసిందే! నేను కబురు పంపిస్తాను" అన్నాడు అవధాని పెళ్ళికొడుకుతో.

ఆవిధంగా అతనితో మాధవి వివాహం ఆగిపోయింది.

* * *

పదిహేను రోజుల తరువాత మాధవికి యు. డి. సి. గా ఉద్యోగం వచ్చింది. హైదరాబాదులో పోస్టింగు.

ఈ ఉద్యోగంతో ఆమె జీవితం ఎలా మారుతుందోనని అవధాని, అనసూయమ్మ భయపడ్డారు.

ఆమెతోపాటు వాళ్ళుకూడా హైదరాబాదు బయలుదేరి వచ్చి మాధవిని సుజాతకు అప్పగించారు.

"సుజాతా...ఇంక మాధవిని చూడవలసినది నువ్వేనమ్మా! దానికేమీ తెలియదు. పసితనం. నోటిదురుసు ఎక్కువ. ఎలా చూసుకుంటావో మరి. మేము ముంగండ వదిలిపెట్టి వచ్చి ఇక్కడ వుండలేము కదా! ఆవులు,గేదెలు... పాడి, పంట! ఇవి మాకు గుదిబండలు. కాబట్టి ఇక మాధవికి అన్నీ నువ్వే" అన్నాడు అవధాని చెమరుస్తున్న కన్నీళ్ళను ఉత్తరీయంతో అద్దుకుంటూ.

"మాధవికేమీ ఫరవాలేదు. మీరు నిశ్చింతగా వుండండి" సుజాత వారికి భరోసా ఇచ్చింది.

నాలుగురోజులుండి వాళ్ళు వెళ్ళిపోయారు.

సుజాత మాధవిని ఆఫీసుకు తీసుకువెళ్ళింది. ఉద్యోగ నియామకం ఆర్డరు తీసుకోగానే సెక్షనులో సూపర్నెంటుకు చెప్పి తిరిగి వచ్చింది.

'హమ్మయ్య...మాధవికి లోపం దిద్దించాను. ఉద్యోగస్తురాలయింది. ఇక వివాహం కూడా అయిపోతే, నా అవసరం ఉండదు' అనుకుంది సుజాత.

* * *

మాధవిని పదిహేను రోజులకే మరో సెక్షనుకు బదిలీచేసారు. ప్రస్తుతం ఉన్న సెక్షనులో పనిలేదు. ఉన్నవాళ్ళందరూ పాత ముఖాలు. వారి వాతావరణంలో మాధవిలాంటి కొత్త అమ్మాయిని వుంచితే

ఈమె కూడా పనిచేయకుండా కబుర్లతో, పుస్తకపఠనంతో ఆఫీసుపని ఎగ్గొడుతుందేమోనన్న భయంతో ఆఫీసరు ఈవిధంగా చేశాడు.

కొత్తగా ఉద్యోగంలోచేరిన మాధవికి ఇవి ఎలా తెలుస్తాయి?

"నమస్తే" అంటూ మాధవి కొత్త సెక్షను సూపర్నెంటుకు తన రిలీఫ్ కాగితాన్ని ఇచ్చింది.

సూపర్నెంటు ఆమెకేసి రెండు నిమిషాలు పరిశీలనగాచూసాడు. ఆమె మెడలో మంగళసూత్రాలు కనబడ లేదు. అమ్మయ్య' అనుకొని నిట్టూర్చాడు.

తన సెక్షనులో నలుగురు ఆడవాళ్లు ఉన్నారు. నెలకోసారి ఇద్దరైనా రెండేసి రోజులు సెలవుపెడ్తారు. ఎవరో ఒకరు తప్పనిసరిగా మెటర్నిటీ లీవు పెడుతుంటారు. అయిదేళ్ళనుంచి ఇది గమనిస్తున్నాడు తను.

ఉన్న మగవాళ్లయినా ఏదో కారణంతో సెలవు పెట్టటం రివాజయిపోయింది.

ఇన్ని ఆలోచిస్తున్న సడన్ సూపర్నెంటుకుతనసొంతవిషయంగుర్తుకు వచ్చింది. తన భార్య పదిహేనేళ్ళనుంచి ఉద్యోగంచేస్తోంది. నాలుగుసార్లు మూడేసి నెలల చొప్పున మెటర్నిటీలీవు తీసుకుంది. అంటే ఓ ఏడాదిపాటు పూరికే ఇంటి దగ్గిర కూర్చుని జీతం అందుకుంది. ఆ సంగతి గుర్తుకొచ్చి నవ్వుకొన్నాడు.

"కూర్చో" అన్నాడు సూపర్నెంటు.

అయిదు నిముషాలసేపు యోగక్షేమ విచారణ జరిగింది.

"అదే నీ సీటు" అన్నాడు సూపర్నెంటు. ఆ టేబుల్ మీద ఏవో రిజిష్టర్లు.. రికార్డులు..ఫైళ్ళు...దుమ్ముపట్టి వున్నాయి. ఎవరూ చూసిన పాపాన పోలేదు.

"నెల్రోకితం ఆ సీటులోవుండే ఆవిడ మెటర్నిటీ సెలవులో వెళ్ళింది. ఇప్పటికి నా మొగుడుకెన్నోసార్లు చెప్పాను...ఆ ఖాళీలో ఓ మగవాడిని వేయించమని..కాని అధికారులకు కావల్సింది మాపని కాని, ఎవరేమయితే వారికేం! కాబట్టి నువ్వు జాగ్రత్తగా పనిచేసి నా పరువు నిలబెట్టాలి!"

ఆయన సంబోధన నిముషాల పరిచయానికే 'నువ్వు'లోకి దిగిపోయింది.

"నాకు వివాహం కాలేదులెండి...మీకా భయం లేదు" అంది మాధవి నవ్వుతూనే.

'అయినా మెటర్నిటీ సెలవుకు వివాహం అవాలన్న రూలేమీ లేదులే!' అన్నట్లు చూశాడు సూపర్నెంటు.

"ప్యూనుని పిలిచి సీటు శుభ్రంచేయించండి" మాధవి అడిగింది.

"అయ్యోరామ! ఇక్కడి ప్యూన్లు పనిచేస్తారా తల్లీ! చేయమని అడిగితే ఇంతేసంగతులు. వాటి హెడ్క్వార్టర్సు... అటు చూడు ఆ బెంచి దగ్గిర... పోతే కాంటీను. కాబట్టి ప్యూన్లు వచ్చి పనిచేస్తారన్న ఆశ వదులుకోవడం మంచిది. ఇదిగో డస్టరు... దీనితోనే శుభ్రం చేసుకోవాలి నువ్వు"

సూపర్నెంటు ఆఫీసుల్లోజరిగే ప్రథమ భాగోతాన్ని వివరించాడు.

మాధవి లేచి తన సీటులోని ఫైళ్ళు, రికార్డులు కింద పెట్టి డస్టరు గుడ్డతో శుభ్రం చేసింది. డ్రాయరులోవున్న కాగితాలు సర్దింది.

సాయంత్రం నాలుగయ్యే సరికి ఆ పని పూర్తయింది. కట్టుకున్న చీర పూర్తిగా దుమ్ముపట్టేసింది. ఎంతో బడలికగావుంది. టాయిలెట్ రూముకెళ్ళి




ముఖంకడుక్కుని వచ్చింది.

"ఈ అమ్మాయి బుద్ధిమంతురాలు లాగానే వుంది. పనికూడా బాగానే చేసేట్లుంది' అన్న అభిప్రాయం కలి గింది సూపర్నెంటుకు

• • •

ఆసుపత్రి నుంచి సుజాత, ఆఫీసు నుంచి మాధవి తిరిగిరాగానే రోజూ షికా రుకు వెళ్ళేవారు.టాంకుబండుకో, ఇందిరా పార్కుకో, బిర్లా మందిరుకో, అబిడ్సు, కోటిలకో, సినిమాలకో.

ఒకరోజు అప్పారావు వచ్చాడు.

మాటల సందర్భంలో సుజాత అంది– తను అప్పారావుని వివాహమాడదలచు కున్నట్లు. తర్వాత అతన్ని స్నేహితు రాలికి పరిచయంచేసింది.

"మరి అతనికి ఇద్దరు పిల్లలున్నా రన్నావుగా!" అడిగింది మాధవి.

"తండ్రిదగ్గర వుంచుతానన్నాడు"

"మరయితే ఎప్పుడు వివాహం?"

"త్వరలోనే!" చెప్పింది సుజాత.

అందే తను మరో ఇల్లు చూసుకోవా లన్నమాట! ఆ భార్యాభర్తల మధ్య తను ఎలా వుండగలదు? ఈ రోజుల్లో... ఈమాత్రం ఆతిథ్యం ఇచ్చింది చాలు అనుకుంది మాధవి.

మరి ఆరోజు అప్పారావు గురించి అంతగాచెప్పి, ఈరోజు ఎలా సిద్ధయించు కుంది అనిపించింది ఆ తర్వాత. కాని మాధవికి అర్థంకాలేదు సుజాత అంతరంగం.

ఏదియేమైనా తను వేరే వుండటమే మంచిది. కాబోయే భార్యాభర్తల మధ్య తనెందుకు పానకంలో పుడకలా?

 



7

మాధవి ఆఫీసులో చేరి ఇరవై రోజు లయింది.

"ఈ సీటుకు మీరొచ్చారా?" అడి గాడు అర్జునరావు ఓరోజు వచ్చి.

"ఇంతకీ మీరు..."అర్ధోక్తిలో ఆగింది మాధవి.

"భలేవారేనండీమీరు...అయితే ఈ సెక్షన్లో ఎవరెవరున్నారో మీకు తెలియ దన్నమాట! నా పేరు అర్జునరావు. ఈ సీటునాది" పరిచయం చేసుకున్నాడు అతను– తాను స్టెనో-టైపిస్టు క్లర్కు అని చెప్తూ.

"సారీ..ఎవరో అనుకున్నాను"

"ఫరవాలేదు....అసలు సూపర్నెంటు మీకు చెప్పాల్సింది" అర్జునరావు సిగరెట్ వెలిగించాడు. ఆమె ముఖం పక్కకు తిప్పింది.

"సారీ...మీకు ఈ పొగ పడదేమో! ఇన్నిరోజులు నేను సెలవులో వుండటం వల్ల మీకి ఇబ్బంది కలగలేదు ఇకపైన ఎలాగో!" సీటులో కాగితాలు, ఫైళ్ళు సర్దుతూ అన్నాడు.

"బాగానేవుంది. మీ అలవాటును నా కోసం మానుకుంటారేమిటి?" అంది మాధవి.

ఇద్దరి సీట్లు పక్కపక్కనే.. రెండు కుర్చీలకుమధ్య కేవలం నాలుగడుగుల దూరం...

సరిగ్గా అయిదయ్యేసరికి అర్జునరావు బయలుదేరాడు.

"ఏమిటింకా కూర్చున్నారు... ఇంటి కెళ్ళరా?" వెళ్ళేముందు అన్నాడతను. ఆ మాట సెక్షన్లో వున్న మిగిలిన ఇద్దరాడ వాళ్లు ఏనాడూ అనలేదు. బేగులు భుజాలకి తగిలించుకుని, ఆమెవైపు ఓ స్మైల్ విసిరి చక్కాపోతారు. మరి ఇతనెందుకలా అన్నాడు?

వారంరోజుల్లో ఇద్దరిమధ్యా పరిచయం బాగా పెరిగింది. అతనెప్పుడూ ఏవో రాస్తూనే వుంటాడు. విపరీతంగా సిగరెట్లు కాలుస్తాడు. పనిచేస్తున్నట్టే కనబడదు.

"మీరు సిగరెట్లు బాగా కాలుస్తారు ఆరోగ్యం పాడవదూ!" అంది మాధవి. ఆ మాటల్లో ఏదో అభిమానం,ఆప్యాయత కనిపించాయి.

అర్జునరావు విరగబడి నవ్వాడు.

"భలేవారే! ఏ డాక్టరు చెప్పాడు హానికరమని!"

"ఒకరు చెప్పేదేమిటి?సిగరెట్ పెట్టెల మీదే ప్రచురిస్తున్నారు కదా!"

మళ్ళీ నవ్వేశాడతను. తనకర్థం కాలేదు.

"వెనకటికి ఎవరో ఒకావిడ కొబ్బరి కాయలు కోసుకుపోతున్నారని కొబ్బరి చెట్టుకు మడిబట్ట కట్టిందిట. ఆ దొంగ వెధవ కాయలు కోసుకుని మడిబట్టలో మూటకట్టుకుని వెళ్ళిపోయాడుట"

"దానికీ దీనికీ ఏమిటి సంబంధం?" అడిగిందామె.

"ఓ పచ్చి నిజంచెప్తే అర్థమవుతుంది. కాని ఎలా చెబితే అర్థమవుతుంది మీకు? అదే నా అనుమానం" అన్నాడు అతను.

"చెప్పండి... ఫర్వాలేదు"

"ఇప్పుడు కాదు... తర్వాత" అర్జునరావు పనిలో లీనమయ్యాడు.

పన్నెండు గంటలకు పోస్టుమన్ వచ్చి అతనికి ఓ ఉత్తరం ఇచ్చాడు. చదువుకుని నవ్వుకున్నాడు.

"ఏమిటీ నవ్వుతున్నారు? ఎనీ గుడ్ న్యూస్?"

"అవును. నా కథ ప్రచురణకు స్వీకరిస్తున్నట్లుగా తెలిపారు!"

"మీరు కథలు రాస్తారా? మీ పేరు మీదే రాస్తారా లేక కలం పేరు మీదనా?"

"నా పేరు మీదనే! నాకు నాలుగేళ్ల అనుభవమే వుంది.నలభయి కథలు అచ్చు అయ్యాయి. రెండు నవలలు రాశాను. రేడియోలో ప్రసారమయ్యాయి ఆరు కథానికలు. ఏదో కాలక్షేపం. సరదాగా ప్రారంభించాను. వ్యసనమయిపోయింది. ఇప్పుడు రాయకపోతే ఎలాగో వుంటుంది"

మాధవి అర్జునరావువేపు తదేకంగా చూస్తోంది.

అతను ఆమె ముఖంలోకి చూస్తున్నాడు.

సెక్షన్లోవాళ్లు వారిని గమనిస్తున్న విషయం ఆ ఇద్దరికీ తెలియదు. నాలుగు కళ్లు అప్రయత్నంగా రెండు గుండెల మధ్య మూగగా మాట్లాడుకుంటున్నాయి.

* * *

"ఆడవాళ్ళకు ఈఆఫీసులో ఉద్యోగం నిజంగా వరం! ఏమంటారు?" ఒకరోజు అర్జునరావు మాధవితో అన్నాడు.

"ఎందుకలా అంటున్నారు?" అర్థం కానట్లు అడిగింది.

"వారికిది అనాథశరణాలయం. ఏదో ఆఫీసుకొచ్చేందుకు తీరుబడి చేసుకుంటే చాలు అటెండెన్సు రిజిష్టర్లో సంతకంచేసి కాసేపు అటూ ఇటూ నాలుగు పేపర్లు చూసి, తోచినట్లు ఫైళ్లు సూపర్నెంటు

ముందరపడేసి వచ్చేపోతే సరిపోతుంది. ఫస్ట్‌వాచ్‌లో వెళ్ళిపోయినా అడిగేవాళ్ళు వుండరు!"

ఈసారికూడా అర్థంకానట్లు అతను గమనించాడు.

"ఏమీలేదు. ఫస్ట్‌వాచ్ రెండుగంటలకు బయలుదేరుతుంది. లాస్టువాచ్ అయిదు గంటలతో సమాప్తమవుతుంది. మీకింకా ఈ ఊరి గండిపేట నీళ్లు వంటబట్టలేదు మీకే తెలుస్తుంది ముందు ముందు"

మాధవి అతని మాటలకు అంతగా ప్రాముఖ్యతనివ్వలేదు.

"ఏమండీ! మీకెక్కడయినా ఒకటి రెండుగదుల ఇల్లు అద్దెకు తెలుస్తే చెప్పండి కావాలి" చెప్పింది మాధవి.

"మీరు నోటీసుబోర్డు చూడండి తెలుస్తుంది" చెప్పాడతను.

"ఆఫీసు నోటీసు బోర్డులో ఇటువంటివి కూడా ప్రకటిస్తారా?" ఆశ్చర్యం ప్రకటించింది మాధవి.

"మీరింకా తెలుసుకోవలసింది చాలా వుంది. కాంటీను, సహకారసొసైటీ, పోస్టాఫీసు, సాహితీ సమితి గోడలమీద మీకు అన్నిరకాల ప్రకటనలు కనిపిస్తాయి. ఇల్లు అద్దెకు, అమ్మకాలు, స్కూటరు అమ్మకాలు, విహారయాత్రలు, దీపావళి సామానుల అమ్మకం...ఒకటనేమిటి ఏదయినా సరే వేయచ్చు. ఇదో రకమయిన పబ్లిసిటీ. కాబట్టి మీరుకూడా ఓ కాగితంమీద వివరాలు రాసి గోడకు అతికించండి...మీ కోరిక ఫలిస్తుంది" సలహా రూపంలో విశదీకరించాడు. కాని ఆమెకెందుకో అలా చేయటం ఇష్టంలేకపోతోంది.

"అదెందుకులెండి.... మీకు తెలిస్తే చెప్పండి"

"ప్రస్తుతం ఎక్కడుంటున్నారు?" అడిగాడు అర్జునరావు.

"మా స్నేహితురాలింట్లోనే. ఆమె వివాహం చేసుకోబోతోంది. వాళ్ళు వుడ్‌బీ తరచు వస్తుంటాడు.... నేనుండే బాగుండదు కదా!" చెప్పింది మాధవి.

"అయితే మీకు అర్జంటుగానే ఇల్లు కావాలి... సరే అయితే, రేపు సాయంత్రానికి మీకు ఇల్లు చూపించే బాధ్యత నాది" అభయం ఇచ్చాడు అతను.

అర్జునరావు తనమీద ఎందుకో అభిమానంతో వుంటున్నాడు. ఆప్యాయత కనబరుస్తున్నాడు. తనకేమీ ఆ ధోరణి బోధపడటంలేదు.

మర్నాడు ఉదయం ఆఫీసుకు రాగానే చెప్పాడు "సారీ మాధవిగారూ... నేనను కున్న రూము ఎవరికో ఇచ్చేసారు. ఓ పదిరోజులు మీ స్నేహితురాలు దగ్గర కాలక్షేపం చేయండి. ఈలోపులో మరో ప్రయత్నం చేద్దాం... నాకు తెలిసినవారి ఇంటికి మేడమీద హాలు కడుతున్నారు. దానికి ఫినిషింగ్ టచెస్ ఇస్తున్నారు. మీకు బాగుంటుంది... అది ఇప్పిస్తాను" అన్నాడు.

"కొత్తగా కడుతున్నారంటున్నారు.. అద్దె ఎక్కువగా వుంటుందేమో! పైగా మూడు నాలుగు నెలల అడ్వాన్సు ఇమ్మంటారేమో! ఈ నగరంలో అదొక పద్ధతి వుందిట కదా... మా ఫ్రెండు చెప్పింది!"

"అవన్నీ మీకెందుకు... నేను చూసుకుంటాను. మీరు ఇల్లు చూసుకోవచ్చు. అద్దె చెప్తారు... మిగిలిన షరతులు వివరిస్తారు. వారూ, మీరూ అంగీకరిస్తేనే కదా ఆ రూము మీకు దొరికేది. ఇప్పట్నుంచే ఎందుకు బెంగ పెట్టుకోటం?"





మాధవి తృప్తిగా నిట్టూర్చింది.

కొంచెం సేపయ్యాక "చూడండి మాధవిగారూ! మీరు వినే వుంటారు, అందరూ మిమ్మల్ని 'చిన్నమేడం' అని పిలవటం... ఏమిటండీ ఆ పిలుపు! పెద్దమేడం.. చిన్న మేడం.. బుల్లిమేడం. చక్కగా అమ్మా నాన్నలు పెట్టిన పేరుండగా! నేను పేరుతోటే పిలుస్తాను. మీకేమీ అభ్యంతరం లేదుగా?" అర్జున రావు అడిగాడు.

"అదే నాకూ అర్థం కావటంలేదు.. ఏమిటో ఆ పిలుపు. మీ ఇష్టం... అలాగే పిలవచ్చు" అంది మాధవి అతనితో.

"నేను సెలవు తీసుకుంటాను... ఈరోజు ప్రసారాలు సమాప్తం. మళ్ళీ దర్శనం రేపు పదిగంటలకు. ఎవరేనా అడిగితే ఏదో సర్ది చెప్పండి. అఫ్‌కోర్స్... అపగరనుకోండి" అంటూ అర్జున రావు రెండు గంటలకు వెళ్ళిపోయాడు.

మర్నాడు ఆఫీసుకురాగానే చెప్పాడు అర్జునరావు "మాధవీ! నీకు ఇల్లు రెండు రోజుల్లో రెడీ అవుతుంది"

ఏదో గుర్తుకొచ్చి నాలుక కరుచు కున్నాడు. అది మాధవి గమనించింది.

"ఏమయింది?" అడిగింది.

"పొరపాటున సంబోధన ఏకవచ నంలో వచ్చేసింది!" అన్నాడు.

"ఫరవాలేదు... నాకేం అభ్యంతరం లేదు"

అర్జునరావులో ఏదో అనుభూతి... మాధవిలో తెలియని ఆనందం. ఆరోజు చాలా అందంగా కనిపిస్తోంది ఆమె.

"ఈపేళ నాకు ఎక్కడికీ వెళ్ళబుద్ధి కావటం లేదు... ఏ పనీ చేయాలని లేదు. ఏమిటో నాకే అర్థం కావటం లేదు" అన్నాడతను.

"ఏమయిందని?"

"చెప్పమంటారా! ఏమీ అనుకోవుగా" ఓసారి ఏకవచన ప్రయోగం. మరోసారి గౌరవ సంబోధనలో పడ్డాడు అర్జునరావు.

"నేననుకొనేదాన్నే, కానీ మీరి పాటికి గ్రహించి వుంటారు!"

"ఈరోజు నువ్వు చాలా అందంగా వున్నావ్. దానికి కారణం నీ అందమైన రూపం. ఆ రూపానికి తగ్గ ఛాయ.. ఛాయకు తగ్గ పెదవులు, బుగ్గలు, కళ్ళు, నుదురు పొందిక. అన్నింటికన్నా ఆ ముక్కు నన్ను పిచ్చివాడిని చేస్తోంది. ఇది ఆఫీసు... లేకపోతే ఆ అందమైన ముక్కుమీద ఓ ముద్దు తీసుకునేవాడిని! ఏదో సినిమా పాటలో 'అందమంతా చీరలోనేవుంది' అంటాడు. నాకయితే చీరలో ఏముందో తెలియదు కాని... ముక్కుమీదే వుంది అని రాస్తాను"

"మొత్తానికి మీ రచయిత బుద్ధి పోనిచ్చుకున్నారు కాదు... రచనల్లో కరిపించే వర్ణనని నామీద ప్రయోగిస్తు న్నారు" అందామె.

"నేనింతవరకూ అందమైనవాళ్ళను ఇద్దరినే చూశాను. ఒకరు యూనివర్సిటీలో, ఎం. ఏ. క్లాసులో... మరొకరు ఆఫీసరు స్వర్ణముఖి. ఇప్పుడు నిన్ను చూశాక వారిద్దరూ అందమైనవాళ్ళు కాదని తేలిపోతోంది"

"నా రూపం మొదట చూడవలసింది. ఈ ముక్కు కృత్రిమం. దీనిని ప్లాస్టిక్ సర్జరీద్వారా దిద్దించాను. మీకు అనుమానం కలగటం లేదంటే అది నా

అదృష్టం. నాకు శస్త్రచికిత్స చేసిన డాక్టరు నైపుణ్యం... సుజాత సహాయం" మనసులోనే వారికి కృతజ్ఞతాభివందనలు తెలుపుకుంది.

మాధవికి అర్జునరావు పట్ల ప్రేమ బయలుదేరింది. అతను కూడా అదే స్థితిలో వున్నాడు.

రెండు రోజుల తరువాత అర్జునరావు ఆఫీసుకు రాగానే మాధవితో చెప్పాడు- "ఇల్లు రెడీ! సాయంత్రంరా మా ఇంటికి. ఇది మా ఇంటి చిరునామా. నేను వచ్చే వరకూ కూర్చో. నేను అర్జంటు పనిమీద వెళ్ళవస్తాను. ఆలస్యమైనా నే వచ్చేవరకూ కూర్చో...ఫరవాలేదు. ఇంట్లో వంటమనిషి వుంటుంది" అని.

సుజాత ఆసుపత్రికి ఫోను చేసింది మాధవి.

"హలో సుజాతా! మాధవిని మాట్లాడుతున్నాను. సాయంత్రం నేను వచ్చేసరికి ఆలస్యమవుతుంది. మరేమీ కంగారుపడద్దు"

"ఎందుకు...ఫస్టుషో సినిమాప్రోగ్రాం వుందా?"

"నువ్వు లేకుండా నేను సినిమాకు వెళతానా?"

"మరి దేనికి ఆలస్యం?"

"ఏం లేదే...ఇల్లు చూసేందుకెళుతున్నాను"

"ఏమే ... అప్పుడే ఏం తొందర? ఇంకా టైముందికదా లేక వేరే...."సుజాత వాక్యం పూర్తయ్యేందుకు మాటలు దొరకలేదు.

"చూసినంత మాత్రాన ఏమవుతుంది? ఇంకా ఎన్నో నచ్చాలికదా. పైగా నీకోసం అప్పారావుగారు వస్తుంటారుకదా. మీ మధ్యలో నేను పానకంలో పుడకలా వుంటే మీ ఏకాంతానికి నేను అడ్డేకదా!"

సుజాత నోటికి బ్రేకుపడింది.

"అయితేసరి...త్వరగా వచ్చేసేయ్!"

అవతల ఫోను పెట్టేసిన చప్పుడు వినగానే మాధవి కూడా ఫోన్ పెట్టేసింది.

పన్నెండు గంటలకే అర్జునరావు వెళ్ళిపోయాడు.

అతనిచ్చిన చిరునామా తీసుకుని మాధవి సాయంత్రం ఇంటికి బయలుదేరింది.

'సాహితీ నిలయం' అని ఒక పక్కన 'అర్జునరావు' అని మరోపక్క గేటుకు ఇరువేపులా ఉన్న పాలరాతి ఫలకాలుచూసి లోపలికెళ్ళింది మాధవి.

కాలింగ్‌బెల్ నొక్కింది.

నలభై అయిదేళ్ళ స్త్రీ తలుపుతీసింది.- ఎవరు కావాలి అన్నట్లు చూస్తూ.

"అర్జునరావుగారి ఇల్లు ఇదేకదా.... వారికోసం వచ్చాను" అంది తను.

"ఎప్పుడొస్తారో తెలియదు. లోపలికి వచ్చి కూర్చోండి" అంది- ఆమె తలుపు వేస్తూ. అర్జునరావు చెప్పిన వంటమనిషి కాబోలు ఆమె.

ఆవిడ వంటమనిషి. తను ఉద్యోగస్తురాలు. పైగా అపరిచిత. ఇద్దరిమధ్యా మాట్లాడేందుకు కబుర్లు ఏముంటాయి? ఇద్దరూ ఆడవాళ్ళే! అయితేమాత్రం మాట్లాడుకోవాలన్న రూలు ఏముంది?

"ఆయనతో అర్జంటుపనివుందా? ఏ టైములో వస్తారో తెలియదు" అంది వంటమనిషి కొంచెంసేపయ్యాక.

"ఈ ఇంట్లో అద్దెకిచ్చే భాగం వుందని తెలిసింది...చూసేందుకొచ్చాను"

యజమాని లేకుండా ఇల్లు చూపించటం వంటమనిషికిష్టంలేదు. పైగా ఆ విషయం అతనెప్పుడూ చెప్పలేదు.




తనొచ్చిన ఈ అయిదేళ్ళ కాలంలో అర్జున రావు కోసం ఆడవాళ్ళెవరూ రాలేదు. ఈ అమ్మాయే రావటం! ఏమిటో అర్థం కాలేదావిడకు.

వంటమనిషి కాఫీ తీసుకువచ్చి మాధవికిచ్చింది.

మాధవి కూర్చున్నది విశాలమైన హాలు. గోడలకు ఏవో ప్రకృతి దృశ్యాలతోవున్న ఫొటోలు తగిలించివున్నాయి. హాల్లో రెండు సోఫాలు, రెండు కుర్చీల మధ్యలో టీపాయ్ వుంది. దానిమీద ఏవో పత్రికలు, ఇంగ్లీషు మేగజైనులు వున్నాయి. కిటికీకి ఆనుకుని కర్రతో చేయబడిన ర్యాక్... దానిలో తెల్ల కాగితాలు, కవర్లు, రంగు రంగుల స్కెచ్ పెన్నులు, పెన్సిళ్ళు, రబ్బరు వుంది. కొంచెం దూరంలో టీవీ సెట్టు, ఎదురుగా అలమారులో టు-ఇన్-వన్. టీవీ మీద ఖజురాహో చిత్రపటం, చిన్న ట్రాన్సిస్టరు... చూసింది మాధవి.

'అర్జునరావుకి కళపట్ల ఎంత ఆరాధన వుందో?' అనిపించింది.

హాలు వెనుక వంటగది వున్నట్లు అర్థమవుతూంది. అక్కడినుంచే వంటమనిషి కాఫీ తీసుకురావటం చూసింది మాధవి.

తను ఎంతో మంది అమ్మాయిలను చూసింది. అర్జునరావు అమ్మాయిలను గురించి రచనల్లో బాగా వర్ణిస్తాడు. కాని ఈ అమ్మాయి అందరినీ మించినది. ఇన్నేళ్ళ వయసులో ఇంత అందమున్న పిల్లను చూడలేదు. ఏమిటో ప్రత్యేకత. యజమాని రమ్మన్నాడంటే కారణం ఏమయివుంటుంది? పైగా ఇల్లు ఇస్తానన్నాడట. ఏవో ప్రశ్నలు, ఆలోచనలు వంటమనిషిని ఆవరించాయి.

ఏడుగంటలవుతూంటే వచ్చాడు అర్జునరావు.

"సారీ ... బాగా ఆలస్యమయిపోయింది" అన్నాడు అతను లోపలికి వచ్చాక.

"ఆమెకు కాఫీ, టీ ఏమైనా ఇచ్చారా?" అడిగాడు వంటమనిషిని. ఊరికేనే అడిగిన ప్రశ్న అది.

"ఆ అమ్మాయికి మేడమీద హాలు చూపించారా?" వంటింట్లోవున్న వంటమనిషిని అడుగుతున్నాడు అతను.

"లేదు బాబూ... మీరావిషయంనాతో చెప్పలేదుకదాని!" ఇందుకోసమే ఇంత త్వరగా మేడమీది హాలును పూర్తిచేసినట్లుగా ఉందని అర్థంచేసుకుంది వంటమనిషి.

"ఇది మీ ఇల్లేననుకుంటాను" అంది మాధవి అతన్నుద్దేశించి.

"గేటుకు సాహితీ నిలయం బోర్డు, పక్కనే అర్జునరావు అన్న బోర్డు చూసాక... నేనొక రచయితనని తెలిసాక ఆ ప్రశ్న వేయడం బాగోలేదు" అర్జునరావు గర్వంగా అన్నాడు.

"అనుకున్నాను.....కాని ఎక్కడో అనుమానం" ఏమనాలో తోచలేదు ఆమెకు.

"మానాన్నగారికి ఎవరో బాకీవున్నారు. ఆయన హఠాత్తుగా చనిపోయాడు పాపం. ఆయనకొడుకులు బాకీకింద ఈ ఇల్లు ఇచ్చేసారు" అంటూ అతను సిగరెట్ వెలిగించాడు.

"అంతా బాగానేవుంది కాని, ఆ చెడ్డ అలవాటు మాత్రమే" మాధవి తిరస్కారంగా చెప్పింది.

"సిగరెట్టు కాలుస్తూ, మందుకొడుతూ కాగితాలు పాడు చేస్తుంటే పెన్ను వేగం

పెరుగుతుందిట... ఆలోచనలు సిరాలోకి వెళ్ళి కొ త్త శైలి కలుగుతుందట! సీనియర్లు ఏమంటారో నీకు వినిపించాను"

"కాని అందులో నిజాన్ని మీరు నిజంగా అర్థంచేసుకోలేదని నా వుద్దేశం!"

"మా ఇల్లు చూద్దువుగానిరా" అంటూ మాధవిని లేవదీసాడతను.

"ఈ మూడుగదుల్లో ఒకహైస్కూలు హెడ్మాస్టరుగారుంటున్నారు. సెలవులు కదాని వూరికెళ్ళారు. వారం పదిరోజుల్లో రావచ్చు. దీనికి అద్దె రెండువందలు. పోతే నేనుండేది ఈ హాలు, వంటిల్లు, బెడ్ రూమ్.... పైకినడు" అంటూ అర్జునరావు మేడమీద హాలు తలుపు తీసాడు.

మాధవి అతన్ని అనుసరించింది.

"ఈ హాలు ప్రారంభించిన వేళసరియైనది కాదేమో! అడుగడుగునా అడ్డంకులే! చివరికి పదిరోజుల్లో పూ ర్తి చేయించేసరికి ఎంతో ఆవస్థపడాల్సివచ్చింది"

"ఎందుకు ఆ శ్రమ? అది పూ ర్తికాక పో తే వచ్చే నష్టం ఏమిటి?" అడిగింది మాధవి.

"నష్టం అని కాదు. ఎందుకో త్వరగా పూ ర్తి చేయాలన్న పట్టుదల కలిగింది. అంతే!"

ఇద్దరూ కిందకు దిగారు.

"ఎలావుంది నా అంతఃపురం?" అడిగాడు.

"ఇంకా నయం... పర్ణశాల అనలేదు" నవ్విందామె.

"మీ శ్రీమతి వూరికెళ్ళిందా?" కొంచెం సేపయ్యాక అడిగిందామె.

"నీకు బొత్తిగా కొన్ని విషయాలు అర్థంకావేమో... నాకు పెళ్ళయితే, ఈ వంటమనిషి ఎందుకుంటుందిక్కడ?"

కొంచెం కటువుగావుందా జవాబు.

"ఆవిడెవరు?"

"ఆవిడ బాగా బతికి చెడింది. భర్త ఆస్తినంతా రాజకీయాల్లో తగలబెట్టాడు—నీతి నిజాయితీలకు కట్టుబడి! అసలీదేశంలో వాటికి విలువ వుందంటారా! స్వార్థం, స్వప్రయోజనాలకోసం రాజకీయాలని బతుకు తెరువుగా మలుచుకుంటున్న రోజుల్లో సొంత డబ్బుని ఖర్చుపెట్టటమా? ఒకసారి ఎన్నికల్లో ఆయన హత్య చేయబడ్డాడు. పిల్లలు లేరు పాపం. బంధువులు ఆదుకోలేదు. ఆవిడభర్త మా నాన్నగారికి చాలాసహాయం చేసారట. ఆ విశ్వాసంతో నాన్నగారు ఆవిడకు మా ఇంటిలో ఆశ్రయం కల్పించారు. నాకు ఈ ఉద్యోగం రావటంతో, అయిదేళ్ళనుంచి నాదగ్గరే వుంటున్నారు ఆవిడ" అర్జునరావు వివరించాడు.

"సాధారణంగా ఆడపిల్లలకు వివాహాలు కాలేదంటే అర్థంవుంది. కా ని, మీ కేమయింది... ఆస్తివుంది. అంతస్తువుంది. సొంత ఇల్లు వుంది. ఉద్యోగంవుంది. రచనలద్వారా పైసంపాదనవుంది. అంతకుమించి అందంవుంది. మరి" మాధవి అడిగింది—అర్జునరావుని పరిశీలనగా చూస్తూ.

"బాగా అడిగావ్. పెళ్ళి చేసుకోమని నాన్నగారు నెలకోసారైనా ఉత్తరాలద్వారా గుర్తుచేస్తుంటారు. నువ్వుచెప్పినపాయింట్లు నాకు వివాహం జరిపించగలవు. కాని ఒక్క మైనస్ పాయింటు నన్ను ఒంటరి జీవితానికే గురిచేస్తోంది"

"ఏమిటా మైనస్ పాయింటు?"

"నాన్నగారి కులం వేరు... అమ్మ కులం వేరు. మరి వారిద్దరకు పుట్టిన నా కులం ఏమిటి? ఏ కులంవాళ్ళు నన్ను పెళ్ళి చేసుకుందుకు సాహసిస్తారు? పైకి చెప్పినంత తేలికగా ఆచరణలో సాధ్యం కావ




ఇటువంటి విషయాలు"

"సారీ... మీ వ్యక్తిగత జీవితం గురించి అడిగినందుకు నన్ను క్షమించండి. ఇంతకీ హాలు నేను తీసుకుంటాను.... అద్దె ఎంత?" మాధవి అడిగింది.

"నేను ఎవరినీ అద్దె ఇంత ఇమ్మని అడగలేదు. నేను డబ్బు మనిషిని కాను. ఎవరెంత ఇస్తే అంతే తీసుకుంటాను. అందుకే నన్ను సొంత ఇంటి యజమానిగా పనికిరావంటారు — ఈ కాలనీ యజమానులు. ఎదుటివాడి రక్తం పీల్చి సంపాదించటం నాకిష్టం వుండదు. నాన్నగారి దయవల్ల, దేవుడిదయవల్ల నాకు లోటు లేదు. నీ ఇష్టం" అన్నాడు అర్జునరావు.

"అలాకాదు.. ఆహారం పట్ల, వ్యవహారం పట్ల మొహమాటం వుండకూడదు. ఎక్కువిచ్చానని నేను, తక్కువ తీసుకుంటున్నానని మీరు అనుకోకూడదు చెప్పండి.. ఫరవాలేదు"

"నిజం చెప్పనా?" అడిగాడు అర్జునరావు ఆమె కళ్లల్లోకి సూటిగా చూస్తూ.

"చెప్పండి" అందామె.

అతను మాధవికి దగ్గరగా జరిగాడు.

"ఈ అందాలరాశికి... ఈ సౌందర్య రాశికి వెలకట్టటం నాకిష్టం లేదు. ప్రత్యేకంగా ఆ ముక్కు! అసలు నేను అద్దె కోసం నిన్ను ఇక్కడికి ఆహ్వానించలేదు" చెప్పాడు.

మాధవి టైము చూసుకుంది. ఎనిమిది కావస్తోంది.

వంటమనిషి అది గమనించింది. అర్జునరావుని పిలిచిందావిడ. "ఆమెకు కూడా వడ్డించమంటారా?" అడిగిందావిడ.

"అరె ఆ విషయమే మరిచిపోయాను"

"వంట అయింది.. భోజనం చేసి వెడితే బాగుంటుంది" అన్నాడతను.

"ఫరవాలేదులెండి ఇంటిదగ్గర సుజాత నాకోసం ఎదురుచూస్తూ వుంటుంది"

"ఆలస్యం కాదులే! పది నిముషాల్లో భోజనంచేసేసి, ఇంటికెళ్ళవచ్చు..." అప్పుసరావు వత్తిడి చేసాడు.

మాధవికి గత్యంతరం లేకపోయింది. తర్వాత అతనామెను ఇంటిదగ్గర దిగబెట్టి వచ్చాడు.



## 8

"ఏమైనా అమ్మాయిఉద్యోగస్తురాలయిన తరువాత ఉత్తరాలు రాయటం తగ్గించింది" అన్నాడు అవధాని ఓరోజు భార్యతో.

"పదిహేను రోజులకో ఉత్తరం రాస్తోందిగా. అస్తమానూరాసేందుకువిశేషాలేముంటాయి?" అనసూయమ్మ సర్ది చెప్పింది.

"ఇంతకీ అమ్మాయి పెళ్ళి విషయం ఏంచేద్దామంటావ్?"

"చేసేదేముంది... ఇన్నాళ్ళూ కళ్ళు మూసుకున్న మీ చెల్లెళ్ళు ఒక్కసారిగా నోళ్ళు తెరిచారు. మాధవి ఉద్యోగం వాళ్ళకి కన్నెర్రగా వుంది. పైగా మీ కట్నం... ఇప్పుడు వారికి పోటీగా మరో నలుగురు పోటీ పడుతున్నారు. అమ్మాయి ఇష్టపడటం లేదంటోందని వారికి చెప్పేసేయండి. మనం ఏ మాటా చెప్పకపోతే





బాగోదు" సలహా ఇచ్చింది భర్తకు.

"అంతేనంటావా?సరే తప్పేదేముంది?" అనుకుంటూ సంభాషణ మార్చబోయేడు. ఇంతలో పోస్టుమాను వచ్చాడు.

"ఎవరిదగ్గర్నించి ఉత్తరం ?" అడిగింది అనసూయమ్మ.

"ఇంకెవరు రాస్తారూ... అమ్మాయే!" అంటూ ఉత్తరం చదవసాగాడు.

"పైకి చదవండి నేనూ వింటాను"

"విశేషాలుంటే నేను చెప్పనూ"

మూడు నిముషాల్లో ఉత్తరం చదవటం పూర్తయింది.

"ఇంతకీ ఏమని రాసింది మాధవి?"

"ఏమీలేదులే. సుజాత పెళ్ళిచేసుకోబోతోందిట. ఎవరో వాళ్ళ బంధువుల కుర్రాడుట. పాపం రెండో పెళ్ళివాడట. ఇద్దరు పిల్లలున్నారుట. కాబట్టి మన అమ్మాయి వేరే ఇల్లు తీసుకుంటోంది. బహుశా వారం పదిరోజుల్లో అక్కడకు మారుతుందిట. మన వూరుకంటే నగర జీవితం బాగానే వుందిట" చెప్పాడు అవధాని.

"నే చెప్పలేదూ ఏదో పనివల్ల రాయలేకపోతోందది. పైగా నగరజీవితం. ఎంత పొద్దున్నే లేచినా ఇట్టే టైము గడిచిపోతుంది. కాఫీలు, స్నానం, భోజనం, ఆఫీసుకు తయారవటం, బస్సులకోసం బస్టాపుల్లో పడిగాపులు కాయటం, ఆఫీసులో గొడ్డుచాకిరీ, సాయంత్రం తిరిగి బస్టాపుల్లో ఎదురుచూపులు, వంట చేసుకోవటం, నిద్ర... ఏ సెలవురోజయినా కాస్తసినిమాకో, ఫ్రెండ్సుఇంటికి వెళ్ళటం తోటో సరిపోతుంది. ఇక ఉత్తరం రాసేందుకు తీరుబడి ఎక్కడుంటుంది?" అనసూయమ్మ కూతురుని సమర్థించబోయింది.

"దానికి కూడా పెళ్ళి చేసేస్తే మనకిక ఏ సమస్యా వుండదు" అన్నాడు అవధాని.

"మీరు తొందరపడి ఏ నిర్ణయమూ తీసుకోకండి" భార్య లోపలికెళ్ళిపోయింది.

* * *

అప్పారావుతో సుజాత వివాహం అయిపోయింది. కృష్ణమూర్తి, మాధవి, అనసూయమ్మ, అవధాని, మరికొందరు ఆసుపత్రి సిబ్బంది హాజరయ్యారు–నిరాడంబరంగా జరిగిన వారి వివాహానికి.

అవధానికి నగరం రావటం అదే ప్రథమం.

మాధవి తల్లికి, తండ్రికి నగరం చూపించింది.

ఈ నగరం గురించే తను పిల్లలకు స్కూల్లో ఏవేవో బోధించాడు. ఆ బోధించిన విషయాల వెనుక ఎంతటి చరిత్ర వుందో ఇప్పటికి కాని అవధానికి బోధపడలేదు. ఇప్పుడు మరింత విశదంగా వివరించటానికి ఆయనకు ఉద్యోగంలేదు. తమకు తెలియని విషయాలు, చరిత్రని తెలిసినట్టుగా బోధించటం, చూడని వాటిని చూసినంతగా చెప్పటం బహుశా ఉపాధ్యాయులకు మాత్రమే పరిమితమేమో!

"సుజా! రేపు నేను కొత్త ఇంటికి మారుతాను. అమ్మా, నాన్నా వున్నారుగా. నాకు నువ్వు ఆత్మీయురాలివే! మనవి వేరు కాపురాలయినా, మన సొంత వూళ్లు వేరయినా మైత్రీభావం మనమధ్య ఎప్పుడూ వుంటుంది" మాధవి చెమర్చిన కళ్ళతో వీడ్కోలుగా చెప్పింది.

మర్నాడు సాయంత్రం మాధవిమకాం అర్జునరావు ఇంటికి మారింది. ఇంటి యజమాని ఔదార్యానికి ఎంతో సంతోషిం

చాపల దంపతులు. కాని వ్యక్తిగతంగా అభినందించేందుకు అర్జునరావు లేడు. అతను ఏదో సదస్సుకు వెళ్ళాడు, నాలుగురోజుల క్రితం. మరో మూడురోజులదాకా రాడు.

"సరేనమ్మా... మరి ఇంక వెళతాం అర్జునరావు ఎప్పుడొస్తాడో. అతను రాగానే అడిగినట్లు చెప్పు!"

అవధాని దంపతులు సాయంత్రం గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో వెళ్లిపోయారు. ఇప్పుడు మాధవి ఒంటరి. సుజాతకు తోడు దొరికింది. కాని తను కూడా తోడుకోసం చూడాలి.

* * *

అనుకున్న దానికంటే మూడు రోజులు ఆలస్యంగా ఇంటికొచ్చాడు అర్జునరావు. వంటమనిషికి ఈ ఒంటరి జీవితం అలవాటే. తరచు అతను ఏవో సమావేశాల్లో, సదస్సుల్లో పాల్గొనటం మామూలే. ఇప్పుడు మాధవి మేడమీదకు రాగానే, వంటమనిషికి కొంత కాలక్షేపం అవుతోంది.

ఊరికెళ్ళినకిందివాటాలోని హెడ్మాస్టరు గారి కుటుంబం కూడా వచ్చేసింది. ఆ ఇల్లాలు ఎవరితోనూ కలవదు. భర్త స్కూలుకెళ్లిపోగానే, ఏదో కుట్టుపని, ఎంబ్రాయిడరీ పనితోనే సరిపెట్టుకుంటుంది. ఇంకా తీరుబడి వుంటే టేపురికార్డరు పెట్టుకుంటుంది. తనకు ఎవరితోటీ సంబంధం లేదు. పక్క వాళ్లెవరో, పలకరించాలని వుండదు. తన ఇల్లే సమాజం అనీ, కుటుంబమే దేశమని భావిస్తుంది.

మాధవి తన ఇంట్లోకి వచ్చాక చూడటం అర్జునరావుకి అదే మొదలు. పైకివెళ్ళి పలకరించాడు.

"ఏమిటీ... సామానేమీ లేదులావుందే? ఇంత పెద్ద వాటా అనవసరమే!" అన్నాడతను.

ఆమెకు ఏం చెప్పాలో వెంటనేస్ఫురించలేదు.

ఒక మూల ఒక కిరోసిన్ స్టవ్వు, అయిదులీటర్ల ప్లాస్టిక్ కిరోసిన్ డబ్బా వున్నాయి.

"ఈ నగరంలో కిరోసిన్ రేషను కార్డు లేనిదే దొరికిచావదు. ఆ స్టవ్వుతో ఏం అవస్థపడతావ్? నా దగ్గర రెండు వంటగ్యాసు స్టవ్వులున్నాయి. ఒకటి వాడుకో" అన్నాడు.

"అమ్మో... గ్యాసు స్టవ్వా? నాకు భయం. ఎన్నో ప్రమాదాలు జరుగుతున్నాయికదా?"

"దీనినే వైరాగ్యం అంటారు! అయినా ఇలా మాట్లాడేవాళ్ళే వంటగ్యాసుకోసం పాకులాడుతారు. మనిషి చావుకు గ్యాసు ప్రమాదమే కారణం కానక్కరలేదు. ప్రమాదాలు జరుగుతున్నాయని, ఎంత మంది వాడకం తగ్గించుకుంటున్నారు? రైలు, బస్సు, విమాన ప్రమాదాలు జరుగుతున్నాయని వాటిల్లో ప్రయాణాలు చేయటం తగ్గించుకున్నారా? సిగరెట్లు కాల్చటంవల్ల గుండెజబ్బులు వస్తాయంటే ఎవరు మానుతున్నారు? మందు కొట్టడంవల్ల లివరు పాడవుతోందని తెలిసే మరింత ఎక్కువగా లాగించేస్తున్నారు. ఇంకా పచ్చిగా చెప్పాలంటే ఎంతో ప్రసవ వేదన పడాల్సివస్తుందని తెలిసే భర్తల పక్కల్లో పడుకోవటంలేదూ భార్యలూ? ఈ ప్రసూతి వైరాగ్యం, స్మశాన వైరాగ్యం కబుర్లు మీలాంటి ఆడవాళ్ళకి తెలిసే, ఇంకా బాగా ఉపయోగించుకుంటున్నారు" అర్జునరావు ఉపన్యాస ధోరణిలో చెప్పాడు.

"అయిందా లెక్చరు? అలిసిపోయారు

గాని, ఈ కాఫీతో శాంతపడండి!''

అర్జునరావుకి మాధవి చేతినుంచి ఆమె స్వయంగా, కాచిన కాఫీ అందుకుంటుంటే ఏదో అనిర్వచనీయమైన అనుభూతి, వేడిగా, మత్తుగా ఏదోలా జివ్వున లాగుతున్న ట్లనిపించింది. ఆవిధమైన అనుభూతి కలగటం ఇదే ప్రథమం. రచనల్లో ఊహించి ఇంతవరకూ రాసాడు. ఆ కల్పన నిజంగా ఇంత ఇదిగా వుంటుందా? అని పిస్తోంది.

ఆమెకూ్కడా అలాగేవుంది, మరో రకంగా.

అతను ఒకగ్యాసుస్టవ్వు ఆమెకిచ్చాడు ఆ సాయంత్రం.

ఆ కాలనీలోవారికి, వారిద్దరూ ఒకే ఆఫీసులో పనిచేస్తున్నట్లు తెలియదు. అయినా నగరవాసులకు ఎవరెవరో తెలుసుకోవాల్సిన అవసరం, తీరుబడి వుండదు. ఎవరి జీవితం వారిది!

అర్జునరావుకి ఇంతవరకూ తన రచన ల్లోని పాత్రల పట్లనే ప్రేమాభిమానాలు ఉండేవి. ఇప్పుడు మాధవిపట్ల ఆకర్షితు డయ్యాడు. 'నేను నిన్ను ప్రేమిస్తు న్నాను' అనిచెప్పాలంటే ఎంతో ధైర్యం కావాలి. ఆ ప్రేమకు ఎన్నో కారణాలు ఉండచ్చు... అందం, ఐశ్వర్యం, ఉద్యోగం, కోర్కె ఇలాగ ఒకరికొకరు పైకి చెప్పుకోలేక ఆ ప్రేమని తమలోనే దాచుకుంటున్నారు – అవకాశంకోసం ఎదురుచూస్తూ!

* * *

"మా నాన్నగారు ఉత్తరం రాసారు. అమలాపురంలో ఓ పెళ్లి సంబంధం వచ్చిందట... వెళ్ళి అమ్మాయిని చూడ మన్నారు" ఓరోజునచెప్పాడుఅర్జునరావు.

నిజానికిది మాధవి రియాక్షను తెలుసు కొనేందుకే!

అప్పుడుకూడా మాధవి తన ప్రేమని బయటపెట్టలేకపోయింది.

"చూసిరావటంలో తప్పేముంది! ఆ తర్వాత ఎన్నో వుంటాయికదా!అన్నీ నచ్చితేనేకదా పెళ్లి జరిగేది!''

మాధవి అలా అనటంలో వుద్దేశం అతని అభిప్రాయం తెలుసుకోవాలనే.

"వారికి కులంతో పనిలేదట. ఈ దేశంలో ఎన్నో వ్యవహారాలు కులం, మతం, గోత్రంతో ముడిపెట్టుకుని వున్నాయి. అక్కడక్కడ వాటిని కాదని పెళ్లిళ్లు జరిగినా పూర్తిగా చివరివరకూ కాపురాలు చేస్తున్నట్లు తెలియదు. ఈ కారణంగానే నూ చెల్లెలు వివాహం బాగా ఆలస్యమయింది.చివరికి బోలెడంత కట్నం ఆఫరుచేయగానే బావగారూ, అతని తల్లి దండ్రులూ మా కులం గురించి పట్టించుకో కుండా వివాహానికి అంగీకరించారు" అన్నాడతను.

అతని మాటల్లోని ఆంతర్యాన్ని గ్రహించింది మాధవి.

మర్నాడే అతను అమలాపురం వెళ్ళి పోయాడు.

మాధవి ఆలోచనల్లో పడింది.

* * *

పెళ్లిచూపులు అయ్యాక అర్జునరావుకు తిలక్ గుర్తుకొచ్చాడు.ఇద్దరూ అమలాపురం హైస్కూల్లో చదువుకున్నారు. ఈమధ్యనే ఎవరిద్వారానో స్నేహితుడికి కాస్త మతి చలించిందని తెలిసింది. నిజానికి అర్జున రావు స్వంతవూరు పుల్లేటికుర్రు. తండ్రికి వివాహం అయ్యాక ఉద్యోగం రావటం తోను, కావలసినవాళ్ళందరూ వ్యాపారం, ఉద్యోగాల కారణంగా చెదిరిపోవటంతోను సొంత ఊరు అని చెప్పుకునే పరిస్థితి

పోయింది. తండ్రికి ఆ ఊహ వెళ్ళే అవసరం పాతికేళ్ళ క్రితమే పోయింది. అక్కడేమీ స్థిరాస్తులులేవు. ఇంకెందుకు వెళ్ళాలి?

నరేంద్రపురం వెళ్ళి తిలక్‌ని చూసి వచ్చాడు. ఇక్కణ్ణుంచి మాధవి వూరు చాలా దగ్గర్లోనే వుందికదా... వాళ్ళింటి కెళ్ళాలనిపించింది.

"వెళితే బాగుంటుందా? చూసినవాళ్ళు ఎలా ప్రచారం చేస్తారో?"

అనుకునేవాళ్ళు ఎటూ అనుకొంటారు. లోకులు పలుకాకులు వాటితే తనకేం పని! వారివల్ల వుపయోగం లేకపోయినా అనవసర విషయాల్లో తలదూర్చడం చాలామందికి అలవాటు. ఆలోచనలని పక్కకు పెట్టి, ఆ ఊరి దారి పట్టాడు.

అర్జునరావుని చూడగానే అవధాని ఆశ్చర్యపోయాడు. ఎంత కూతురి కొలీగ్ అయినా తిలక్‌ని చూసేందుకొచ్చి తన దగ్గిరకు రావటంలో కారణం ఆయనకు ఓ పట్టాన బోధపడలేదు.

అనసూయమ్మ అతని రాకను మరో విధంగా వూహించుకుంది.

'ఎప్పుడూ చూడని ఓ యువకుడు. వూళ్ళోకి వచ్చాడు. అతను అవధాని ఇంటి కెళ్ళాడు. వారింట్లో భోజనం చేసాడు అతను ఎవరైనదీ అవధాని ఎవరికీ చెప్ప లేదు. ఎవరైవుంటాడు ? ఎందుకొచ్చి వుంటాడు? అవధాని ఆతిథ్యం స్వీకరించా డంటే ఏదో కథ వుండాలే!' లాంటి ప్రశ్నలు అందరికీ చర్చనీయాంశాలుగా తయారయ్యాయి. ప్రత్యేకంగా అవధాని చెల్లెళ్ళకు ! మాధవికి పెళ్ళి సంబంధం చెప్పినవాళ్ళకు...చెప్పాలనుకున్న వాళ్ళకి!

రెండు గంటలున్నాడు అర్జునరావు అవధాని ఇంట్లో! అతనికి ఊరు కొత్త కావటంతో అంబాజీపేట వెళ్ళి హైదరాబాదు బస్సు ఎక్కించి మరీ వచ్చాడు అవధాని.

రాత్రిభోజనాలయ్యాక అనసూయమ్మ భర్త దగ్గిరకు చేరింది. "అర్జునరావు మనింటికి ఎందుకొచ్చాడంటారు?" అడిగింది భర్తని.

"ఎందుకేమిటి! చెప్పాడుగా...అమలాపురం వచ్చాడుకదా, తిలక్‌నిచూసేందుకు. నరేంద్రపురం దారేకదాని ఈ ఊరు వచ్చానని!"

"అదయివుండదు..మరేదోవుంటుంది" అనుమానపడిందావిడ.

"అయితే ఓపనిచేయి మనచెరువుదగ్గర ఈ విషయం ప్రకటించు. ఎటూ అక్కడ దీనిమీద చర్చించుకుంటారు జనం..." విసుగ్గా అన్నాడు అవధాని-ఏం చెప్పినా ఆడవాళ్ళు అర్థంచేసుకోలేరన్న ధోరణిలో. అలా అని అవధాని తేలిగ్గా ఆవిషయాన్ని వదిలేయలేదు. అతనిద్వారా కొన్ని సంగతులు తెలుసుకున్నాడు. అనసూయమ్మ ఆత్రంగా వింది.

నిజానికి అవధాని అర్జునరావు కుటుంబం గురించి తెలుసుకోవాలనుకున్నప్పుడు ఎలా అడిగితే ఏ సమాధానం వస్తుందో, అతనేవిధంగా రియాక్టవుతాడో అని అడగలేకపోయాడు. కూతురిద్వారా అతని ఆస్తిపాస్తులు ముందే తెలుసుకున్నాడు. మంచిఉద్యోగం, సొంతఇల్లు... బాదరబందీలేని జీవితం...బాగానేవుంది.

అర్జునరావు వచ్చివెళ్ళాక, అవధాని చెల్లెళ్ళు మరింత తొందరపడ్డారు పెళ్ళి గురించి. మర్నాటినుంచి తమ ప్రయత్నాలు కొనసాగించారు. ఈ వచ్చిన కుర్రాడు అన్నగారిని లైనులోపెట్టి కట్నకానుకలు ఎగరేసుకుపోతాడేమోనన్న భయం వారికి పట్టుకుంది. అచ్చటముచ్చట తీర్చే అన్న




గారిని వదులుకోవటం వారికి ఇష్టం లేదు. వారి స్వార్థం వారిని మరింత తొందర పెట్టింది.

"నాదేంలేదు. మాధవి ఒప్పుకుంటే నేను సిద్ధమే" అని తప్పించుకున్నాడు అవధాని-చెల్లెళ్లు అడిగిన ప్రశ్నలకు సమాధానంగా.

అనసూయమ్మ ఈ విషయంలో అసలు తలదూర్చలేదు.

* * *

హైదరాబాదుకు తిరిగి వచ్చినప్పటి నుంచీ మాధవి అర్జునరావుని గమనిస్తూనేవుంది. ఇప్పుడు వూరునుంచి వచ్చాక అదోలా కనిపించాడు అతను. పైగా ఆరోజు ఆఫీసుకు వెళ్ళలేదు. మాధవికి అసలు కారణం తెలియలేదు. ఆమె మాత్రం మామూలుగానే ఆఫీసుకు వెళ్లిపోయింది.

సాయంత్రం ఇంటికి రాగానే మాధవి తిన్నగా అర్జునరావు దగ్గరికి వెళ్లింది.

అతను మంచంమీద రగ్గు కప్పుకుని వున్నాడు. సీలింగు ఫాను నెమ్మదిగా తిరుగుతోంది. కిటికీ తలుపులు వేసి వున్నాయి. గుమ్మం తలుపులు కొంచెంగా జారేసివున్నాయి. వంటమనిషి గుమ్మం దగ్గరున్న కుర్చీలో కూర్చుని కునికిపాట్లు పడుతోంది.

"ఆయన ఆఫీసుకు రాలేదేం?" అడిగింది మాధవి.

"జ్వరంగా వుందిట. వళ్ళు నొప్పులు, కళ్ళు మంటలు అంటున్నారు" వంటమనిషి చెప్పింది.

"మందేమైనా వేసుకున్నారా?"

"ఆయనకు మందులు వేసుకునే అలవాటు పెద్దగాలేదు. మరీ ఎక్కువగా వుంటేనే డాక్టరు దగ్గరకు వెళతారు"

మాధవికి అర్జునరావు తత్వం నచ్చలేదు.

"అలా వున్నప్పుడు మందు వేసుకోకపోతే ఎలా ... ఎలా తగ్గుతుంది?" వంటమనిషికి వినిపించేలా నెమ్మదిగా అంది మాధవి.

అంతకన్నా ఏమీ చేయలేకపోయింది మాధవి. మనసులో ఏదో విచారం. వంటమనిషి లేకపోతే తను కాస్త చనువు తీసుకునేదే-ఆవిడ ఏమనుకుంటుందోనని గానీ! పోనీ అతని తల్లిదండ్రులకు తెలియజేస్తే?

మేడమీదికెళ్ళిపోయింది ఆమె. కాని ఏమీ చేయలేకపోయానన్న నిస్సహాయత... బలహీనత.... చేతగాని తనం. తనని తనే నిందించుకుంది.

ఏడు గంటలయింది.

"అబ్బాయిగారు మిమ్మల్ని పిలుస్తున్నారు" వంటమనిషి వచ్చి చెప్పింది. మాధవికి ఆ పిలుపు వెయ్యి ఏనుగుల బలాన్ని, సంతోషాన్ని ఇచ్చింది.

"ఈ జ్వరం లక్షణాలు మందుల షాపులో చెప్తే టాబ్లెట్లు ఇస్తాడు...వెళ్ళగలవా?" అడిగాడు అర్జునరావు.

"వెళతాను ... కాని డాక్టరుకు చూపించుకుని, టాబ్లెట్లు వాడితే మంచిది కదా.... తెలిసీ తెలియని కేటలాగు వైద్యం ఈ స్థితిలో మంచిది కాదేమో!"

"ఏం ఫరవాలేదు .... ఇదేమంత తీవ్రమైనది కాదుకదా?" అన్నాడు.

మాధవి మందుల షాపుకు బయలుదేరింది.

దానిలో నలుగురైదుగురు డాక్టర్లు వున్నారు. వారిని సంప్రదించి మందులు తీసుకుంటే మంచిదనిపించింది. మందుల షాపువాళ్ళకి పూర్తిగా తెలియకపోయినా,



ఏవో టాబ్లెట్లు ఇచ్చి వాడమంటాడు. దానివల్ల ఫలితం వుంటే వుంటుంది... లేకపోతేలేదు. బాధపడేది, నష్టపోయేది రోగి!

"ఇదిగో టాబ్లెట్లు" వాడే విధానం చెప్తూ అర్జునరావుకి ఇచ్చిందామె.

"నాకు గుర్తుండదు" అంటూ వంట మనిషి వైపు చూశాడు.

దానర్థం 'వంటమనిషికి చెప్పమనా? లేక ఈ రాత్రికి తనని ఇక్కడే వుండి టైము ప్రకారం టాబ్లెట్లు వేయమనా?' మాధవి ఎటూ నిర్ధారణ చేసుకోలేకపోయింది. చివరికి ఆ టాబ్లెట్లు ఎలా

వాడాలో వివరించి వంటమనిషికి అప్పగించిందవి.

ఆ రాత్రి మాధవికి నిద్ర లేదు. మనసు, దృష్టి అతనిమీదే కేంద్రీకరించాయి. ఏదో తెలియని ఆరాటం!

తెల్లవారింది ... అర్జునరావుకి ఎలా వుందో? చొరవ తీసుకుందామంటే వంట మనిషి వుంది... ఏమనుకుంటుందో. భయం!

ఎనిమిది గంటలయింది.

"అబ్బాయిగారు రమ్మంటున్నారు" వంటమనిషి వచ్చి చెప్పింది.

'తెల్లవారి రెండు గంటలు గడిచిపోయింది....ఇంత ఆలస్యంగానా రమ్మనేది!' అనుకుంటూ మాధవి కిందకుదిగింది.

సోఫాలో కూర్చుని సిగరెట్ కాలుస్తున్నాడు అర్జునరావు.

"అలా కూర్చో..." అంటూ సోఫా చూపించాడు.

"ఎలా వుందిప్పుడు?" అడిగింది.

"నువ్వే చెప్పు...చూస్తున్నావు కదా"

"లోపల ఎలావుందో నాకేం తెలుసు? పైకి బాగానే కనిపిస్తున్నావు" చిరుకోపంతో సమాధానం ఇచ్చింది.

వంటమనిషి ఇద్దరికీ కాఫీలు తెచ్చింది.

'నాకోసం చాలా కష్టపడ్డావ్ నువ్వు' మందుల షాపుకు వెళ్ళి టాబ్లెట్లు తెచ్చావ్. చాలా థాంక్స్" చెప్పాడు అతను.

"డాక్టరు రాసిచ్చాడు ఆ టాబ్లెట్లు"

అని చెప్పలేకపోయింది మాధవి.

"సాయంత్రం గుడికెళ్ళి దేవుడికి కొబ్బరికాయ ఇవ్వాలి" అంది ఆమె.

"ఎందుకు... ఏదైనా శుభం జరిగిందా?"

"అవును..." అంతే చెప్పగలిగింది.

తనకు పూర్తిగా స్వస్థత చేకూరితే, కొబ్బరికాయ కొడతానని దేవుడికి మొక్కుకుంది మాధవి. కనిపించని దేవుడు కరుణించాడో....లేక డాక్టరు రాసిచ్చిన మందులే పనిచేసాయో... అర్జునరావు కోలుకున్నాడు.

"ఈవేళ ఆఫీసుకు సెలవుపెట్టి ఇంట్లో విశ్రాంతి తీసుకోండి. అలాగని కాగితాలు పాడుచేసి, సిగరెట్లు తగలెయ్యకండి!"

అది సలహానో, మందలింపో, హెచ్చరికో అర్థం కాలేదతనికి.

"ఇంట్లో వుంటే బోర్‌గా వుంటుంది.. ఆఫీసులో అయితే దేవీ దర్శనంతో మరింత త్వరగా కోలుకోగలను... ఊరికే కూర్చుంటే సిగరెట్లమీదకు ధ్యాస పోతుంది" అర్జునరావు ఆమె కళ్ళల్లోకి చూస్తున్నాడు.

"ఈసారికి నా మాట వినండి.... ప్లీజ్!" మాధవి అప్రయత్నంగా నోరు జారిన మాటలు అవి.

అర్జునరావుకి ఎందుకో మాధవిమీద గౌరవభావం కలిగింది. ఇంట్లోనే వుండిపోయాడు. ఆవిడ మాటప్రకారం కాగితాలు పాడుచేయలేదు. సిగరెట్లూ ముట్టుకోలేదు.

మాధవి ఆఫీసుకు వెళ్ళింది.

మధ్యాహ్నం వంటమనిషికి టెలిగ్రాం వచ్చింది-ఆమె అత్తగారు చనిపోయినట్లుగా.

తనకి భర్త లేకపోవచ్చు...తన వునికి ఆవిడ గుర్తించకపోవచ్చు ... తన గురించి ఆలోచించకపోవచ్చు ... కాని ఆవిడ తన భర్తకు జన్మనిచ్చిన మాతృమూర్తి. తన దురదృష్టంతో విధి పగబూనాడు. మరిది ఇచ్చిన టెలిగ్రాం అది. ఒకనాటి ప్రయాణం ఈవిధంగా పడింది. అర్జునరావు వంటమనిషిని బస్సు ఎక్కించి వచ్చాడు. రెండు వందలిచ్చాడు ఖర్చుల కోసం.

సాయంత్రం ఆరు గంటలయింది మాధవి వచ్చేసరికి.

తిన్నగా తన గదిలోకి వెళ్ళిపోయింది. తన వెనుకే అర్జునరావు వచ్చినట్లు మాధవి గమనించలేదు.

"ఏమిటింత ఆలస్యం?" అడిగాడు.

"అబ్బో... అబ్బాయిగారికి టాబ్లెట్లు బాగా పని చేసాయిలా వుందే!" అంటూ కొబ్బరిముక్క అతనికిచ్చింది, తను తెచ్చిన కుంకుమ నుదుట పెడుతూ.

"ఏమిటో విశేషం?" అడిగాడు.

"ఏమీలేదు...గుడికెళ్ళి దేవుడికికొబ్బరికాయ కొట్టాను..."

అర్థంచేసుకున్నాడు అర్జునరావు.

"మాధవీ...నా గురించి నీకెందుకింత ఇది!"

"ఇది కాదూ అది కాదూ. మీరేమో ఒంటరివారు. ఎదురుగా నేనున్నాను కాబట్టి ఓ కొలీగుగా ఈమాత్రం చేయవలసిన బాధ్యత నాకుంది. మీరనుకున్న 'ఇది'కి మీ సాహితీభాషలో ప్రేమ, అభిమానం, అప్యాయత, జాలి, సానుభూతి, ఇష్టం లాంటి మాటలున్నాయేమో.. నాకు తెలియదు. మీరెలా అన్వయించుకున్నా సరే!"

ఆమె మాటలమీదే ఆలోచిస్తున్నాడు అతను.




"నాకు తెలిసినదొక్కటే-చూసినది, చూస్తున్నది, చూడబోయేది, చూడగలిగేది ఒక్కటే-అదే మొదటి మాట... ప్రేమ!"

అతను ఆమెనే తదేకంగా చూస్తున్నాడు.

"తమరిక కిందకు దయచేస్తే, నేను చీర మార్చుకుంటాను. వంటమనిషి చూస్తే బాగోదు" అంది మాధవి నవ్వుతూ.

"ఓస్... అదా నీ భయం. వంటమనిషి కాకినాడ వెళ్ళింది. పోతే హెడ్మాస్టరుగారి ఫామిలీకి ఇదేమీ బోధపడదు. అయినా చీర మార్చుకుంటే నేనెందుకు వెళ్లాలి" అన్నాడు అర్జునరావు వెళ్తూ.

* * *

"అన్నపూర్ణా...ఏమిటదోలా వున్నావ్? అబ్బాయి కోసమేనా బెంగ" రంగనాథం భార్యను అడిగాడు. ఆయన అర్జునరావు తండ్రి.

భార్య పరాకుకు, ఆలోచనలకు అసలు కారణం రంగనాథంకు తెలుసు. తనకు అన్నయ్య, వదిన, చెల్లెళ్లు గుర్తుకొచ్చారు. కాని ఆ మాట పైకి అంటే భర్త ఈ విధంగా అంటాడని అన్నపూర్ణకుతెలుసు.

"పిచ్చిదానా!వారికి లేని ప్రేమాభిమానాలు నీకు మాత్రం దేనికి? వారికి లేని బెంగ, దిగులు నీకుమాత్రం ఎందుకు? ఏరోజు నువ్వు నా భార్యవయ్యావోఆనాటి నుంచే నిన్ను వారినుంచి తొలగించుకున్నారు..." అంటాడాయన.

కాని మాటలనుంచి తప్పుకున్నా రక్త సంబంధం, అనుబంధం మనసులనుంచి తొలగలేదని రంగనాథంకు తెలియనిది కాదు.

"అబ్బాయిని చూసి అప్పుడే ఆరేడు నెలలవుతోంది. ఒక్కసారి చూసొస్తాను. ఇప్పుడు వంటమనిషి కూడా లేదుట...ఏం అవస్థపడుతున్నాడో!" అంది అన్నపూర్ణ.

రంగనాథం, కొంచెంసేపు ఆలోచించాడు.

"సరే... అయితే వెళ్లు"

రెండు రోజుల తరువాత అన్నపూర్ణ హైదరాబాదు బయలుదేరింది. ఓవేపు కొడుకుని చూడబోతున్నా నన్న ఆనందం, మరోవేపు కోడలుని వెదికితెచ్చుకోవాలన్న తహతహ! అంతలోనే ఏదో నిర్లిప్తత... విచారం. తన గతం...ఆరోజు రంగనాథం తెగించి తనని పెళ్ళిచేసుకోబట్టి తనకి ఈనాడు ఈమాత్రం హోదా, భాగ్యం! పదహారేళ్ళకే తను వితంతువయింది. తన తండ్రితో కలసి పనిచేసే రంగనాథం, ఆమెతో పరిచయం పెంచుకున్నాడు.అదే వివాహానికి దారితీసింది.

ఆరోజునుంచీ ఆత్మీయులు, రక్త సంబంధీకులు అందరూ దూరమయ్యారు. రంగనాథం చేసిన పొరపాటు ఒక్కటేవారి దృష్టిలో-అతను వేరే కులంవాడు. పైగా వితంతువుని వివాహం చేసుకుని ఆమెకు సంఘంలో ఓ స్థానం కల్పించాడు. తను తనకున్న స్థానం పోగొట్టుకున్నాడు.

అలా ఎన్నో ఏళ్లు గడిచిపోయాయి.

తల్లి, తండ్రి మరణించినా చూసే భాగ్యానికి నోచుకోలేదు తను. చూడాలన్న ఉద్దేశాన్ని గతంలోని సంఘటనలు దూరంచేశాయి.

మర్నాడు రంగనాథం భార్యను రైలు ఎక్కించి వచ్చాడు. తను వెళ్ళేందుకు పిలవలేదు.

* * *

అర్జునరావు తల్లిని రిసీవు చేసుకునేందుకు స్టేషనుకెళ్ళాడు. అలవాటు తప్పకుండా, ఆలస్యంగానే వచ్చింది రైలు.

అన్నపూర్ణని చూసి కంపార్టుమెంటు

వేపు పరుగెత్తాడు అర్జునరావు.

ఆటోలో తల్లీకొడుకులు ఇల్లుచేరారు. ఇంటికి తాళం లేకపోవటంతో, అన్నపూర్ణ గుండెలు గుభేలుమన్నాయి.

"ఏరా అర్జున్! తాళం వేయలేదా?" అడిగింది.

వెంటనే ఏం చెప్పాలో తోచలేదు. కాలింగ్ బెల్ నొక్కాడు. మాధవి తలుపు తీసింది.

ఆ మెను చూడగానే అన్నపూర్ణ ఆశ్చర్యపోయింది. ఒక్కక్షణం అలాగే నిలబడి పోయింది.

'ఎవరామె?' అన్నట్లు చూసింది అన్నపూర్ణ.

"రండి!" అంటూ మాధవి లోపలికి నడిచింది.

"మన మేడమీదగదిలోవుంటోంది.... మా ఆఫీసులోనే ఉద్యోగం చేస్తోంది. వంటమనిషివూరికెళ్ళింది కదా...'' అర్జున రావు ఇంకా మాట్లాడాలనుకున్నాడు కాని తల్లి దగ్గర ఎలా ప్రారంభించాలో తెలియ లేదు. తనుచేసిన పనికి ఆవిడ ఏమంటుందో అన్న భయం!

అన్నపూర్ణకు తెలివితేటల్లో లోపం లేదు. పత్రికలు చదువుతుంది. యువకుల గురించి,వారి ప్రవర్తన గురించి తెలియక పోలేదు.

తన కొడుకు ఎన్నాళ్ళనుంచి మాధవీ లోకంలో విహరిస్తున్నాడు మరి! మేడ మీద గది ఆమె కోసమే పూర్తిచేసి, ఆమెనందులో ప్రవేశపెట్టి...వంటమనిషి వూరికెళ్ళగానే మాధవిని కిందకు ఆహ్వానించాడంటే...

ఎన్నో ఆలోచనలు.... ప్రశ్నలు....

ఇంతకీ మాధవి ఎవరు? వారి ప్రేమాయణం ఏ స్థాయిలో వుంది?? తనేమీ అమితంగా వూహించటంలేదు కదా?

అన్నపూర్ణ దృష్టి 'టీవీ' మీద నిలిచింది.

"ఎప్పుడుకొన్నావురా ఇది?" అడిగింది కొడుకుని. అర్జునరావు చెప్పాడు.

ఈరోజుల్లో వ్యక్తి హోదా, అంతస్తు, చేసే వుద్యోగం మీదకంటే అతనికున్న ఆస్తులు, పలుకుబడి వచ్చే జనం మీదే కేంద్రీకృతమవుతోంది. ఇంట్లో ఎలా వున్నా, నలుగురి దృష్టి నాకర్షించేందుకే తాపత్రయపడే స్థితికి నాగరికత పెరిగి పోతోంది. వంట గ్యాసు, బట్టలనుతికే వాషింగు మెషిను, గ్రైండరు, స్కూటరు, చేపురికార్డరు, టీవీ లేని ఇళ్ల తక్కువే. వాటిమీద సరదా, మోజు పెంచుకోటం పరిపాటవుతోంది.

* * *

వారం రోజుల్లోనే మాధవి నడవడికకూ, అందచందాలకూ ముగ్ధురాలయింది అన్నపూర్ణ. తను కోడలయితే! అంతలోనే ఆవిడకు ప్రమీల గుర్తొచ్చింది. అప్పుడు తానే ఆమెను కొడుకు నుంచి దూరంచేసింది. ఇప్పుడు వీడు మాధవిని తిన్నగా తెచ్చి ఇంట్లోనే పెట్టుకున్నాడు. ఏమిటో ఈ ప్రేమలు! కొడుకు మాధవిని గురించి అన్నీ తెలుసుకునే వుంటాడనిపించింది. కాని తాము కూడా తెలుసుకోవాలి కదా!

రాత్రి ఎనిమిది గంటలు. అర్జునరావు ఇంటికింకా రాలేదు. మాధవి తన గదిలో కూర్చుని ఏదో నవల చదువుకుంటోంది.

అన్నపూర్ణ మాధవి దగ్గరకెళ్ళింది. ఆవిడ రాకను ఆమె గమనించలేదు. నవల రసవత్తరంగావుంది. ప్రేమాయణం మంచి పట్టులోవుంది. శృంగారంలో ఓ చేయి పైనేవుంది. నవలలోని నాయికా నాయ

కుల్ని–తను, అర్జునరావుల్లా వూహించుకుంటోంది.

"మా అర్జున్ ఇంకా రాలేదేమిటి... నీకేమయినా చెప్పాడా?" సంభాషణకు నాందీ సూచకంగా అడిగింది అన్నపూర్ణ.

"తెలీదండీ ... నాకేం చెప్పలేదు" అంది మాధవి ఆహ్వానిస్తూ.

"ఎప్పుడూ ఇలాగే ఆలస్యంగా వస్తుంటాడా?"

"ఏదో పత్రిక ఆఫీసులో పార్ట్‌టైం పనిచేస్తున్నట్లు చెప్పారు. బహుశా అక్కడికి వెళ్ళివుంటారు. ప్రత్యేక సంచిక పని ఎక్కువగా వుందని మొన్నోసారి అన్నారు" చెప్పింది మాధవి.

అన్నపూర్ణ ఏదో ఆలోచిస్తోంది. ఏం మాట్లాడాలో తోచటం లేదు. మాటల మధ్యలో మాధవి తన వూరు...తల్లి.... తండ్రి గురించి చెప్పింది. అందు మీవాట ఎవరెవర్ని గురించో అడిగింది అన్నపూర్ణ. "వాళ్లు మీకు తెలుసా?" అని అడగాలనుకొంది మాధవి. కాని ఆవిడ వయసుకు గౌరవాన్నిచ్చి అడగలేక పోయింది.

"నాన్నగారు సంబంధాలు చూస్తున్నారా నీకు?" అడిగింది అన్నపూర్ణ.

గతంలో చూసిన సంబంధాల గురించి, తను నాసికకు చేయించుకున్న ప్లాస్టిక్ సర్జరీ గురించి చెప్పాలనుకుంది ఆమె. కాని నోరు పెగలలేదు.

"నువ్వు మావాడిని చేసుకుంటావా?" హఠాత్తుగా వేసిన ప్రశ్న మాధవిని ఉక్కిరి బిక్కిరి చేసింది.

తనేం చెప్పగలదు?

"మీ చుట్టాల్లోగాని, మేనరికంలోగాని కుర్రాళ్ళున్నారా?"

'ఏమిటి ఇవాళ ఇలా ప్రశ్నిస్తోంది?' అనుకుంటోంది మాధవి.

"మా నలుగురి అత్తయ్యలందగ్గర పెళ్ళి కొడుకులున్నారు. వారికి మొదట్లో నన్ను చేసుకునేందుకు అత్తయ్యలు ఇష్టపడలేదు. ఇప్పుడు ఉబలాటపడుతున్నారు. కాని నాన్నగారికి ఇష్టంలేదు"

"ఎందుకని?"

"ఎందుకంటే వారు డబ్బు మనుషులు"

"మావాడెప్పుడైనా నిన్ను పెళ్ళి చేసుకుంటానని చెప్పాడా?"

"ఇంతవరకూ ఆ ప్రసక్తి రాలేదు కదండీ!"

"అయితే విను. నాకు నిన్ను కోడలిని చేసుకోవాలనుంది. వాడిని కన్నతల్లిగా నిన్ను అడుగుతున్నాను. నీ సమాధానం ఏమిటి?" అన్నపూర్ణ మరింత దగ్గరగా వచ్చి అడిగింది.

మాధవి సిగ్గుపడుతోంది.

అంతలో అర్జున్‌రావు వచ్చాడు.

"ఏమిటి...ఇద్దరూ ఏదో శిఖరాగ్ర చర్చల్లోవున్నట్లున్నారు విశేషం ఏమిటో?" అడిగాడతను.

"ఏమీలేదు...నువ్వింకా రాలేదేమిటని అడుగుతున్నాను. ఎందుకు ఆలస్యం అయింది?" అన్నపూర్ణ మాట మార్చేసి కిందకు దిగింది.

అర్జునరావు తల్లిని అనుసరించాడు.

"మాధవిని కూడా పిలుచుకురావెళ్ళి.. ఇద్దరూ భోజనంచేద్దురుగాని" అన్నపూర్ణ అంది.

అతను పైకి వెళ్ళాడు.

"దేవిగారిని అమ్మగారు భోజనానికి ఆహ్వానిస్తున్నారు. ఏమిటి... అప్పుడే అత్తగారిని పట్టేశావా?" అన్నాడు అర్జునరావు మాధవి బుగ్గలపై చిటికవేస్తూ.

"నాకు ఆకలిగాలేదు. మీరు వెళ్ళి తిని

రండి. మీ అమ్మగారు మీకోసం చూస్తుంటారు....నడవండి" అంది.

"ఎందుకు ఆకలిగా లేదు... ఏం తిన్నావని?అదేంకుదరదు. ముందు నడు" కొంచెంచనువుతీసుకున్నాడు అర్జునరావు.

"ముందర మీరు నడుద్దురూ...లేక పోతే అమ్మగారే ఇక్కడకు వచ్చేస్తారు. మన సరసం ముందు ముందు..."

మాధవి అతన్ని ముందుకుతోసింది.

గుమ్మందగ్గర నిలబడి వారి ఆటను గమనిస్తూనేవుంది అన్నపూర్ణ. నవ్వుకుంటూ కిందికి దిగిందామె.




దసరా పండుగలుపదిరోజుల్లో ప్రారంభం కాబోతున్నాయి.

వారంరోజులైనా సెలవు పెట్టి రావలసిందని ఉత్తరం రాశారు అవధాని.

ఇప్పుడు మాధవికి మరో విచారం పట్టుకుంది. తను కొత్తగా ఉద్యోగంలో చేరింది. సెక్షనులో పని ఒత్తిడిగావుంది. ఆఫీసరు, సూపర్నెంట్ సెలవు పెట్టద్దని స్టాపుని మరీమరీ హెచ్చరించారు. ఈ ఇబ్బందులన్నీ కన్నవాళ్లకి తెలీవు. చెప్పినా అర్థంచేసుకోరు. రావటం ఇష్టం లేక ఏదోవంక అనుకుంటారు. పైగా అర్జునరావు ఆమధ్య తమ ఇంటికి కూడా వెళ్ళాడు. తమ గురించి పెద్దలు మరో విధంగా ఆలోచిస్తారేమో? ఐతే ఇబ్బంది వచ్చిపడిందే! ఆలోచనలతో సతమతమవుతోంది మాధవి.

సాయంత్రం సరాసరి ఇంటికి వచ్చేసి దిగులుగా,పరాకుగావున్న మాధవిని చూసి అన్నపూర్ణ ఆశ్చర్యపోయింది.

"ఏం మాధవీ....అలా వున్నావేమిటి! ఆఫీసులో ఏదైనా గొడవయిందా? ఎవరైనా ఏమైనా అన్నారా?"అన్నపూర్ణ అడిగింది.

"ఏం లేదండీ...." క్లుప్తంగా జవాబు ఇచ్చిందామె.

"ఆమాత్రం తెలుసుకోలేనిదాన్ని కాదమ్మా నేను. మావాడుఏమైనాఅన్నాడా నిన్ను!"

"బాగుంది... ఆయన నన్నెందుకు అంటారు చెప్పండి!"

"మరేం జరిగిందమ్మా... నా దగ్గర దాపరికందేనికి? పెద్దదాన్ని నేను వున్నాను కదా!" ఆ మాటల్లో ఎంతో ఆప్యాయత, ప్రేమ కనబడింది.

"ఏమీ లేదులెండి... నాన్నగారు ఇంటికి రమ్మనమని ఉత్తరం రాసారు. ఆఫీసులో పని ఎక్కువగా వుంది. పైగా సెలవు పెట్టవద్దని సూపర్నెంటూ,ఆఫీసరూ కూడా చెప్పారు. వెడితే ఆఫీసులో గొడవ. వెళ్ళకపోతే అమ్మానాన్నలతో తంటా. ఎటూ తోచటంలేదు" మాధవి చెప్పింది.

"ఈమాత్రం దానికి అంతగా ఆలోచించటం దేనికమ్మా...ఉత్తరం రాసి పడేయ్. వాళ్లే అర్థంచేసుకుంటారు" సలహా ఇచ్చింది అన్నపూర్ణ.

అర్జునరావు అప్పుడే వచ్చాడు.

"ఏదో సమస్య చర్చలో వున్నట్లుందే" అన్నాడు.

అన్నపూర్ణ చెప్పింది.

"ఓస్...ఇంతేకదా! ఈ ఆఫీసుపలకు ఇదో మాయరోగం. వాళ్ల నెలల తరబడి

సెలవు పెట్టేస్తారు. గుమాస్తాలు పెడితే చాలు ఏడుస్తారు. తన జేబులోనుంచి ఏదో పోతుందని బాధపడిపోతారు. ఇటు వంటివారికి చెప్పేందుకే ఓ చిట్కా వుంది" అర్జునరావు మాధవి వైపు పరిశీలనగా చూసాడు.

"ఏమిట్రా నీ భాష? ఏదీ సరిగా చెప్పవ్!" అన్నపూర్ణ విసుక్కుంది.

"ఏమీలేదమ్మా! పెళ్ళిగాం చూపెడితే సరి....ఆటోమాటిక్‌గా సెలవు మంజూరవుతుంది. ఇది అందరూ అనుసరించేదే!" అన్నాడు.

మాధవి ముఖం మతాబులా వెలగసాగింది.

"అలా చేయటంవల్ల గొడవలేమీ రావుకదా!"

"గొడవాలేదు...గోంగూరాలేదు. ఓ మెమో ఇస్తారు. జాగ్రత్తగా మడతపెట్టి జేబులో పెట్టుకుంటేసరి"

• • •

రాత్రి పడుకునేముందు...

"మాధవి ఇంటికెడుతుందేమో! రేపు తనని బట్టలషాపుకు తీసుకువెళ్ళి కావలసిన చీర, జాకెట్టు తీసుకో" అంది అన్నపూర్ణ.

అతను ఆశ్చర్యపోయాడు.

నిజానికి పండక్కి తనే ఇవ్వాలనుకున్నాడు. కాని మాధవి స్వీకరిస్తుందో లేదోనన్న అనుమానం. మరోవైపు తల్లి ఏమనుకుంటుందోనన్న భయం!

"ఎందుకమ్మా...ఆమె మనింట్లో అద్దెకుంటోంది. అంతేగదా! ఆమాత్రంవానికి బహుమతి దేనికి!" మాటవరసకు అన్నాడు.

"అర్జున్..నువ్వు ఆ అమ్మాయి దగ్గర నిజంగా అద్దె తీసుకుంటున్నావా?" నిలదీసినట్టుగా వుంది ఆ ప్రశ్న.

తల్లి దగ్గర తలవంచాడు కన్న కొడుకు.

మర్నాడు మాధవి ఆఫీసుకు బయలుదేరుతుంటే అన్నపూర్ణ చెప్పింది- "సాయంత్రం అబ్బాయి నిన్ను బట్టల షాపుకు తీసుకువెళతాడు. నీకు నచ్చిన చీర, జాకెట్టు తీసుకో?" అని.

"ఇప్పుడెందుకండీ నాకు!" అంది మాధవి.

"కాదనకు. పెద్దాన్ని చెప్తున్నాను. ఎందుకు, అనవసరంలాంటి ప్రశ్నలు లేయకు" మందలింపు ధోరణిలో అంది ఆమె.

సాయంత్రం నాలుగు గంటలకు అర్జునరావు ముందుగా సెక్షనునుంచి బయలుదేరాడు.

"నేను బస్టాపులో నిలబడతాను. నువ్వు అయిదు నిమిషాల్లో అక్కడకు వచ్చేసెయ్. ఇద్దరం కలిసి సెక్షనునుంచి వెడితే గూఢచారులకు అనుమానం రావచ్చు" అని కాగితంమీద రాసి మాధవికిచ్చాడు ఎవరూ చూడకుండా చూసి.

మాధవి అలాగే చేసింది.

"బస్సు ఎందుకులే. ఆటోమీద వెళదాం....మన లైన్ క్లియర్ అయింది కదా" ఆటోలో కూర్చుంటూ అన్నాడు.

'ఏమిటి ధోరణి ! ఆవిడ తనమీద ఎందుకింత ఆదరణ చూపెడుతోంది?' అని ఆలోచిస్తోంది మాధవి.

బట్టలషాపులోకి ప్రవేశించారు ఇద్దరూ. షాపువాడు చీరలు మడతలు విప్పి చూపిస్తున్నాడు.

"చూడు..ఏది బాగుందో!" అన్నాడు అర్జునరావు.

"మీ ఇష్టం...మీకు నచ్చిందే నాకు



నచ్చుతుంది!"

"బాగుంది. నేనెప్పుడూ చీరలు కొనలేదు. వాటి గురించి నాకు అసలు తెలియదు" చెప్పాడతను.

ఒక చీర తీసింది ఆమె. మాచింగ్ బ్లవుజ్ తీసుకుంది.

ఇద్దరూ హోటలుకెళ్ళారు.

"నువ్వేం తీసుకుంటావ్?" అడిగాడు.

"మీరు తీసుకొనేదే నేనూను" అంది తను.

ఇల్లు చేరేసరికి ఎనిమిదిగంటలయింది.

మర్నాడు తండ్రికి ఉత్తరం రాసింది- సెలవుకోసం టెలిగ్రాం ఇమ్మని.

నాలుగురోజుల తరువాత టెలిగ్రాం ఇచ్చాడు అవధాని.

అర్జునరావు సలహా బాగానే పని చేసింది.

మాధవి ఊరికి వెళ్ళిపోయింది. అర్జునరావు బస్సు ఎక్కించి ఇంటికొచ్చాడు.

'నేనన్నానని మీ నాన్నకు చెప్పు- అర్జున్‌ని పెళ్ళిచేసుకోమన్న విషయం గురించి. మీ అమ్మనికూడా ఆలోచించమను' అన్నపూర్ణ మాటలు చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి.

* * *

అవధాని ఈసారి దసరా పండుగలకు నలుగురు చెల్లెళ్ళని ఆహ్వానించాడు. అయిదో చెల్లెలు లేదే అన్న విచారం ఆయన్ని తరచు వేధిస్తోంది. ఏం చేయగలడు?

చెల్లెళ్ళు ఈసారికూడా మాధవి వివాహం గురించి అన్నగారిని అడిగారు. ఎవరికి వారికే ఆమెని కోడల్ని చేసుకోవాలన్న ఆలోచన బాగావుంది. ఆ విషయమే మాధవిని అడిగేసేరు అత్తయ్యలు.

"నేను ఎవరినీ చేసుకోను. నామీద మీరు ఆశపెట్టుకొని, మీ కొడుకులకి వివాహాలు చేయకుండా వుండద్దు" అని చెప్పింది మాధవి.

"ఉద్యోగం చేస్తోందికదా....ఎవడో ఆఫీసువాడినే చేసుకుంటుందేమో! ఎన్ని చూడటంలేదు ఇటువంటి ఉద్యోగపు పెళ్ళిళ్ళు" ఒక అత్తయ్య వెటకారంగా

అంది.

"చేసుకుంటాను...నా ఇష్టం. మీకేమిటి అభ్యంతరం?" మాధవి చెప్పేసింది.

"దాని పెద్ద త్త ఇలాగే ఎవడినో పెళ్ళా డింది. ఎంతయినా మేనత్త పోలికలు రాక పోతాయా. మంచి రాకపోయినా చెడు రావటానికి ఏముంది?" అంది మరో అత్తయ్య హేళనగా.

"అందుకు బాధపడాల్సింది మా అమ్మా నాన్న. మధ్యలో మీకెందుకు? మీరన్నట్లే నేను నా సహోద్యోగిని పెళ్ళి చేసుకుందుకు నిర్ణయించుకున్నాను. ఇందులో మీ ఎవరి ప్రమేయం అవసరం లేదు..." చెప్పేసింది మాధవి ఇహ సహించలేక.

అవధాని, అనసూయమ్మతో సహా అందరూ కొయ్యబారి చూడసాగారు మాధవిని.

మధ్యాహ్నం అత్తయ్యలు అమలా పురం సినిమాకు వెళ్ళారు. మేనకోడలుని కూడా రమ్మన్నారు. కాని రానంది మాధవి.

"మనతో ఎందుకు వస్తుంది" మాటల్లో వెటకారం ధ్వనించారు వారు.

ఆమెకు వళ్ళు మండిపోయింది. కాలు తున్న పెనంమీద నీళ్ళు చల్లటం మాధవికి ఇష్టం వుండదు.

"అమ్మా...ఈ చీర ఎలా వుంది?" అడిగింది మాధవి తల్లికి చూపిస్తూ.

"దీనికేమమ్మా...చాలా బాగుంది. ఎంతేమిటి?" అనసూయమ్మ ప్రశ్న.

"ఎంతుంటుందో చెప్పుకో చూద్దాం?"

"నాకేం తెలుసునే. నేనెప్పుడయినా ఇటువంటి చీరలు కట్టేనా...కొన్నానా!"

అవధాని అప్పుడే అక్కడికొచ్చాడు.

"నేను కొనుక్కోలేదమ్మా...అర్జున రావుగారి తల్లి ఇచ్చారీ బహుమతి. మా ఇద్దరినీ షాపుకెళ్ళి తీసుకోమన్నారు. విజయదశమినాడు తప్పకుండా కట్టుకో మని చెప్పారావిడ" మాధవి చీర మడత పెడుతూ చెప్పింది.

అవధాని ఆలోచిస్తున్నాడు. తన అయిదో చెల్లెలు పేరు కూడా అన్నపూర్ణే!

"అమ్మాయ్ మాధవీ ... ఓ ప్రశ్న అడుగుతాను సూటిగా జవాబు చెప్పు. మీ అర్జునరావు గురించి ఏమిటి నీ అభిప్రాయం" తల్లి అడిగింది.

"నా వుద్దేశాన్ని అత్తయ్య లెదురు గానే చెప్పాను... మేమిద్దరం పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాం. అన్నపూర్ణ గారు కూడా మా వివాహానికి సుముఖంగా వున్నారు... ఆవిడే ఈ విషయాన్ని మీతో ప్రత్యేకంగా చెప్పమన్నారు"

అనసూయమ్మ, అవధాని ఆలోచిస్తు న్నారు.

'ఏమిటి ఈవింత? ఆడపిల్ల తరఫువాళ్ళు అడగవలసినది పోయి, ఆవిడే అడుగు తోందా?'

"వారి కులం ఏమిటి?" అడిగాడు అవధాని.

"నాన్నా! గౌరవప్రదమైన ఉపాధ్యాయ వృత్తి చేసి రిటైరయ్యావు. వేల విద్యార్థు లకి చదువు చెప్పావ్...నన్ను అడగ వలసిన ప్రశ్న అదేనా? అతని కులం ఏమైనా నేనతన్నే వివాహం చేసు కుంటాను. అతను మనింటికే వచ్చాడు కదా... మీరే అడగవలసింది. ఆడదాన్ని, నేనెలా అడుగుతాను. అసలు అతని కులంతో నాకు పనిలేదు.... అతను మంచివాడు... ఉద్యోగస్తుడు. తల్లి, తండ్రి ఎంతో మంచివాళ్ళు. వాళ్ళల్లో చూడవలసింది అవేగాని కులగోత్రాలు




కాదు గదా"

మాధవి జవాబు ఆ దంపతులని ఆలోచింపజేసింది.

"నిజమేననుకో.... వారికి అభ్యంతరం లేకపోవచ్చు. కాని మనకి వుంటుంది కదా. మనమింకా అంతగా ఎదగలేదు కదా! మరోసారి ఆలోచించు... ఈ కన్న వాళ్ళని క్షోభపెట్టకు. ఇప్పటికే నా చెల్లెలు ఇలా పెళ్ళిచేసుకొనే మనందరికీ దూరం అయింది. ఇప్పుడు నువ్వూ అదే దారిలో నడుస్తావామ్మా!" అవధాని మాటల్లో అర్థింపువుంది.

"ఏమిటండీ! ఈ పట్టింపులు కట్టుబాట్లు, ఆచారాలు? రోగం వస్తే డాక్టరు దగ్గరికెళ్ళి చికిత్స చేయించుకుంటున్నాం, అప్పుడు డాక్టరు కులం ఏమిటని ఆలోచిస్తున్నామా? వృత్తులని బట్టి ఏర్పాటైన కులాలను, నేడు మనమే చేసుకోటం లేదు? ఈ అడ్డుగోడలను అడ్డం పెట్టుకుని వేలాడటం వల్లనే నేటి వివాహ వ్యవస్థ ఇలా దిగజారిపోతోంది. కట్నాలు, కానుకలు ఆకాశాన్నంటుతున్నాయి. వాటిని ఇచ్చుకోలేనివాళ్లు తమ పిల్లలకు పెళ్ళిళ్లు చేయలేకపోతున్నారు. ఫలితంగా తమ సంతానమే కన్నవాళ్ళనెదిరించి తమదారి చూసుకుంటున్నారు. ఆ పరిస్థితిని ఎందుకు ఆహ్వానించాలి? తమ పిల్లలముందు కన్నవాళ్ళు ఎందుకు చులకనకావాలి...ఆలోచించండి నాన్నా!" మాధవి ధోరణి మరింత వింతగా కనపించింది వారికి.

'దీనికేదో మత్తుమందు ఎక్కించారు వాళ్లు' అనుకున్నారు అవధాని దంపతులు.

• • •

అర్జునరావుకు తండ్రి ఉత్తరం రాసాడు. అన్నపూర్ణను పంపించమనీ ... తనకు వంటకు ఇబ్బందిగా వుందనీ. అతను తల్లిని పంపించివేసాడు. తాను పండగ ముందు రోజున వెళ్లాలనుకున్నాడు.

ఈ మధ్య అతని ఆలోచనలు ప్రమీల గురించి తగ్గిపోయి...మాధవి వైపు పెరిగాయి. ప్రమీలవైపు తను ఇంకా ఆరాటపడటం తెలివి తక్కువతనం. ఆమె ఇప్పుడు మరొకరి సొత్తు. అయినా దిక్కుమాలిన మనసు ఎందుకో ఆగదు. మాధవి తననాకర్షించింది. కాని తనతల్లి, తండ్రి ఏమంటారో! ఆమె తల్లిదండ్రుల ఆలోచన ఏవిధంగా వుందో? ఎలా ఆలోచించినా, తాను మాధవిని పెళ్ళాడి, గతాన్ని మరిచిపోవటంలోనే ఔచిత్యం వుందనిపించింది.

తల్లి, మాధవి వూరికెళ్ళటం...వంట మనిషి కూడా లేకపోవటంతో అర్జునరావుని ఒంటరితనం మరింత వేధిస్తోంది-ఏవో ఆలోచనలు, ప్రశ్నలు....

ఆఫీసుకు వెళ్ళిపోయాడు అర్జునరావు, అరగంట తర్వాత....

"సార్...తమరికోసం ఎవరో ఆడ మనిషి వచ్చింది. రిసెప్షను రూములో కూర్చొంది" అంటూ చెప్పాడు ప్యూను వచ్చి.

తనకోసం ఆడమనిషా .... ఎవరై వుంటారు? మాధవికాదు. మరెవరూ రారు. ఆశ్చర్యం వేసిందతనికి. తాను ఓ స్నేహితుని కోసం ఎదురుచూస్తున్నాడు. కాని అతనికి సెక్షను తెలుసు. సరాసరి ఇదే వస్తాడు.

అర్జునరావు రిసెప్షను రూము వైపు నడిచాడు.

ప్రమీల...తన హరియాలీ!

ఒక్కసారిగా ఆశ్చర్యం ... అనుమానం... సందేహం... మరెన్నో

ఆలోచనలు. ఆమెకోసం తను కాళ్ళకు బలపం కట్టుకుని ఆరోజు తిరిగాడు. కాని శ్రమేగాని ఫలితం దక్కలేదు. ఇప్పుడు తనెందుకు వచ్చినట్లు...ఎలా వచ్చింది?

ఇద్దరికళ్లూ ఆశ్చర్యంతో చెమర్చాయి.

ప్రమీల..హరియాలీ...ఓ దేవకన్యలా దివినుండి భువికి దిగివచ్చిన అప్సరసలా తనకోసం ప్రత్యేకంగా దిగివచ్చిన ఊర్వశిలా...

మరి, పిన్ని ఆరోజు అలా ఎందుకు చెప్పినట్లు? ఇప్పుడు తన కళ్ళను తానే నమ్మలేకపోతున్నాడు. ఇది కలా,వాస్తవమా? తదేకంగా ఆమెవైపు పరిశీలనగా చూస్తున్నాడు అర్జునరావు.

ఇప్పుడు కూడా ప్రమీల హరియాలీ దుస్తుల్లోనేవుంది. కాని కళ్ళల్లో ఆనాటి కాంతి లోపించింది.

"బాగున్నారా ?" పలకరించాడు అర్జునరావు నవ్వుతూ.

"బాగున్నాను కనుకనే మీ దగ్గరకు రాగలిగాను. బతికున్నాను కాబట్టే ఒక్కసారి మీకు కనబడాలని వచ్చాను. మీపనికి అంతరాయం కలిగించానా?" అంది ప్రమీల.

ఆమెలో ఆ దర్పం, కోపం అలాగే ఉండటం గుర్తించాడు అతను.

"రండి...మా సెక్షను కెళదాం" అన్నాడు.

"సారీ...అర్జునరావుగారూ!ఆఫీసుకు రాకూడదనే అనుకున్నాను. కాని ఎందుకో దిక్కుమాలిన మనసు మీకోసం ఆరాటపడింది... పదిహేనురోజుల్నుంచి మీరే కనిపిస్తున్నారు. మీ ఇల్లు నాకు తెలియదు. అఫ్‌కోర్స్...తెలుసుకోవటం కష్టంకాదు. ఇంటికొచ్చి మీ శ్రీమతి చేత మాటలనిపించుకోవటం ఇష్టంలేక, ఇక్కడికే వచ్చాను...నన్ను క్షమించండి" అందామె.

"కాని ఇక్కడ ఎవరైనా చూస్తే బాగుండదు. పోట్లాడుకుంటున్నామనుకుంటారు కనుక మా ఇంటికి వెళదాం. మీకోసం సెలవు పెడతాను....సరేనా?" అభ్యర్థిస్తున్నట్లుగా అన్నాడతను.

ప్రమీల ఏమనుకుందో, సరేనంది.

ఇద్దరూ ఇంటికి బయలుదేరారు.

అర్జునరావు తాళం తీస్తోంటే అంది ప్రమీల, "తాళం వేశారేమిటి?" అని.

"బాగానేవుంది. తాళం వేయకపోతే ఇంట్లో సామానులుపోవూ" అన్నాడు అతను.

"ఇంట్లో ఎవరూ లేరా?"

"లేరు కాబట్టే తాళం. ఇంట్లో మనుషలను పెట్టి తాళం వేసేవారుకూడా లేకపోలేదు" అన్నాడు అతను నవ్వుతూ.

"కూర్చోండి" అంటూ కుర్చీ చూపించాడు తలుపులు తీయగానే.

'ఏమిటీమనిషి...కొత్తవారితోమాట్లాడినట్టు 'అండీ'అంటున్నాడుఅనుకుందామె.

"మంచినీళ్ళు కావాలా?" అడిగాడు.

"వద్దు" అందామె.

ప్రమీల ఇంటిని పరికించి చూస్తోంది. తను హాల్లో కూర్చుంది. దాని వెనుక కిచెన్. హాలుకు ఆనుకునే బాత్‌రూమ్, లావెటరీ, కుడివైపు రెండు బెడ్‌రూములు వున్నాయి. హాల్లోసోఫా, టీపాయ్, రెండు కుర్చీలు, మూలగా టీవీ, కిటికీ పక్కనే వున్న అలమారాలో పుస్తకాలు, రేడియో వున్నాయి. టీపాయ్‌మీద ఓ ఇంగ్లీషు, ఓ తెలుగు పేపర్లు వున్నాయి.

అర్జునరావు కాఫీ చేసి తెచ్చాడు.

ఓ కప్పు ఆమెకి ఇచ్చాడు—"ఆపదిక్కులేనికొంప ఏదో చేతయినట్లుగా చేశాను. తిట్టుకోకండి" అంటూ.

 

ఆమాటలంటున్నప్పుడు అతని పెదాలు వణికాయి.

"మీరు తాగరా?" అందామె.

"నేను భోజనం చేసే ఆఫీసుకు వెళ్ళాను" చెప్పాడతను.

"మీ శ్రీమతి పుట్టింటికెళ్ళిందా?" ప్రశ్నించింది.

అర్జునరావు విరగబడి నవ్వాడు. ఆమెకు అర్థంకాలేదు.

"పిల్లల్ని తీసుకురాకుండా ఒంటరిగా వచ్చేరా? మీ శ్రీవారికి పిల్లల్ని నమ్ముదా యించటంచేతనవుననమాట" అన్నాడు.

ఆమె తల వంచుకుంది. కళ్ళనుంచి కన్నీళ్ళువడిలో పడటం గమనించాడు అర్జునరావు.

"ఇంతకీ ఎప్పుడు బయలుదేరారు? ఏం పనిమీద వచ్చారు? మీ బంధువులెవరైనా వున్నారా ఇక్కడ?" అడిగాడు.

"మీ ఆవిడ లేరా?" అడిగింది మళ్ళీ ఆమె.

"భలేవారండీ నేను పెళ్ళి చేసుకోలేదు''

"ఎందుకని?"

"ఎందుకో మీకు తెలియదా?"

"దాందేముంది? నచ్చినపిల్ల దొరకకో లేక కట్నం చాలకనో !" వెటకారంగా అందామె.

"మీరెలా అనుకున్నా ఫరవాలేదు" అన్నాడు అర్జునరావు.

''భోజనం చేద్దువుగాని లేవండి !" అన్నాడు కొంచెంసేపయ్యాక.

"మీరు మాటకారులే! లేకపోతే ఏమి టండీ...? మీరు భోజనంచేసేసి, గిన్నెలు కడిగేసుకుని, ఇల్లుచక్క బెట్టుకుని ఆఫీసుకు వెళ్ళి నన్ను భోజనంకు లెమ్మంటారేమిటి?" నవ్వేసింది ఆమె.

"అన్నట్టు మరిచేపోయాను..మీ అమ్మ గారు, అక్కయ్య అంతా కులాసాయేనా?" అన్నాడు.

"అందరూ క్షేమమే. కాని మీరేమిటి, అలా కొత్తవారిని చూస్తున్నట్టు 'అండీ' అంటున్నారు?'' అందామె.

"మీరు కొత్తవారే కదా. మన పరిచయానికి మీ పెళ్ళితోటే తెరపడింది. అసలు మీరిలా ఒక్కరూ రావడమేతప్పు! ఎవరయినా చూసే నా మాట అటుంచి మీకు ప్రమాదం. మీవారికి తెలిస్తే..."

"మీకేం భయంలేదు. నా భర్తకు నేనే కట్టను, మీ గురించి కూడానా ?" అంది ప్రమీల.

ఆమె భర్త గురించి అడగాలనుకున్నాడు అర్జునరావు.

కాని వాటివల్ల తనకేం ప్రయోజనం? అందుకే వూరుకున్నాడు.

"మా విమల అక్కయ్యకు పెళ్ళయింది....ఓ కొడుకు. అమ్మ అక్కడే వుంటోంది" అందామె. కళ్ళల్లో నీళ్ళూరుతున్నాయి ఆమెకు.

'మరి మీరు పెళ్ళినాటినుంచే ఫామిలీ ప్లానింగు అమలుపరుస్తున్నారా' అనా లనుకున్నాడు.

''మీరు హైదరాబాదు వచ్చినట్లు మీ శ్రీవారికి తెలుసా?''

''ఆయన వారం క్రితం కాన్పూరు వెళ్ళారు. ఎప్పుడొస్తారని అడిగితే, 'నీకనవసరం' అన్నారు. అసలు పెళ్ళినాటినుంచే ఆయనకు నేను పనికిరాకుండా పోయాను. మనగురించి ఎవరయినా ఆయనకు చెప్పారేమోనని నా అనుమానం"

"మరి ఇప్పుడెందుకు వచ్చినట్లు?"

హరియాలీ కళ్ళల్లో మళ్ళీ కన్నీరు.

ఆ కన్నీటికి అప్రయత్నంగానే కరిగి చలించిపోయాడు అర్జునరావు.

"మీరు ఎందుకో విచారిస్తున్నారు. మీకు పెళ్ళయింది. లేకపోతే ఆ కన్నీళ్ళని నేనే తుడిచేవాడిని. ఎందుకు బాధ పడుతున్నారు?'' అడిగాడు అర్జునరావు. ఆమె జవాబు చెప్పలేకపోయింది.

"సరే...అవన్నీ తర్వాత మాట్లాడుకోవచ్చు. ఇప్పుడు వంట చేసే ఓపిక లేదు నాకు. అలాగని ఆ పని మీకు అప్పగించటం నాకిష్టంలేదు. కాబట్టి హోటలుకెళ్దాం...పదండి" అన్నాడతను.

అర్జునరావు ఆతిథ్యానికి పొంగిపోయింది ప్రమీల.

''పదండి...'' అంది.

ఇద్దరూ హోటలుకు బయలుదేరారు.

కౌంటర్లో డబ్బు చెల్లించి భోజనం టిక్కెట్టు తీసుకుని, ఇద్దరూ ఫామిలీ రూము లోపలకు నడిచారు.

బేరరు భోజనం పళ్ళెం తెచ్చి ప్రమీల ఎదుంచాడు.

అర్జునరావు ఆమె ఎదురు సీటులో కూర్చున్నాడు.

హరియాలీ వేళ్ళు నాజూగ్గా అన్నం మీపకదులుతుంటే,అతనికెంతోఆనందం.. మరోవేపు విచారం ....కన్నార్పకుండా చూస్తున్నాడు.

"ఏమిటలా చూస్తున్నారు?'' అంది తను.

"ఏమీలేదు.. గతం గుర్తుకొస్తోంది. జీవితంలో ఏం పోగొట్టుకున్నానో ఇప్పుడిప్పుడే అర్థమవుతోంది. దేనికయినా యోగం, ప్రాప్తం వుండాలంటారు. నా జీవితమే అందుకు నిదర్శనం'' టేబులు మీద వేళ్ళు కదిలిస్తూ తలపంచుకుని అన్నాడతను.

"ఇప్పుడేమయింది.. మీకేం తక్కువని?"

"నిజంగా మీకు తెలియదా లేక నా నోటినుంచి వినాలనా?" అడిగాడు.

"నిజంగా నాకేమీ తెలియదు. ఒకవేళ తెలుసుకోగలిగినా, అది నాకు దూరమయిందని భావిస్తున్నాను"

"సరే...ముందు భోజనం చేయండి. తరువాత తీరిగ్గా మాట్లాడుకోవచ్చు. అన్నపూర్ణాదేవికి అంతరాయం కలిగించకూడదంటారు" అన్నాడు అర్జునరావు.

అతనెందుకో ఆమె ముఖంలోకి చూసి మాట్లాడలేకపోతున్నాడు. ఏదో గిల్టీగా ఫీలవుతున్నాడు. ఇబ్బందిగా వుంది.

"ఒక అప్పడం మీరు తీసుకోండి... రెండు నేను తినలేను" అంది ప్రమీల.

"తప్పు..మీరు ఆ మాట అనకూడదు. నేను మీ భర్తనయితే తినేందుకు నాకేమీ అభ్యంతరం వుండేది కాదేమో. దయచేసి మీరు భోజనంచేస్తే ఆనందిస్తాను"

"మీరు సంబోధన మారిస్తే బాగుంటుంది'' అందామె.

''నిజమే మరి. ఆ సంబోధన ఎందుకు మారిందో తెలియదా మీకు! మీరిప్పుడు మరొకరికి భార్య. ఆ గౌరవం కాపాడవలసిన బాధ్యత నాకుంది. నా హద్దులు నేను దాటలేను"

అర్జునరావు ధోరణి పూర్తిగాభిన్నంగా వుంది. మునుపటి మనిషికాదని తను గ్రహించకపోలేదు. ప్రేయసిగా కాకపోయినా, కనీసం స్నేహితురాలిగానైనా చూడటంలేదేమోని ఆమె విచారం. ఇటువంటి మర్యాదకోసమేనా తను వచ్చిందీ! తన మనసులో మాట ఎలా బయటపెట్టాలా అని ఆలోచిస్తోంది ప్రమీల.

ఇద్దరూ హోటలు బయటకొచ్చారు.

రోడ్డుమీద పక్క పక్కన నడుస్తుంటే ప్రమీలకెల్లాగో వుంది. ఎందుకు పెళ్ళి చేసుకున్నట్టు? ఏనాడైనా తన భర్తపక్కన

ఇలా తను నడిచిందా? అసలు షికారుకైనా రమ్మన్నాడా ఒక్కసారన్నా?

తనొక బంగారాయి.... భర్త ఒక కొండరాయి.

టైము ఒంటిగంటన్నర దాటుతోంది.

"ఇప్పుడేం చేద్దామంటావు?" అడిగాడు అర్జునరావు.

"మీ ఇష్టం... నేను మిమ్మల్ని ఎప్పుడూ కాదనలేను" అందామె.

"ఆ మాట అనకండి. ఇప్పుడు మన మధ్య ఒక సరిహద్దురేఖవుంది. అది దాట నంతవరకూ మీరేంచెప్పినా నేను చేస్తాను. చెప్పండి... ఏంచేద్దామంటారు?" అర్జున రావు అన్నాడు.

"అయితే 'ప్రేమనగర్' సినిమా కెడదాం" ఎదురుగా కనిపించిన వాల్ పోస్టరుని చూస్తూ చెప్పింది.

"థియేటరు చాలాదూరం. బస్సులో వెడదామా...కాని టైమయిపోవచ్చు..." వాచీకేసి చూసి అన్నాడు.

"ఆటోమీద వెడదాం" ప్రమీల అన గానే ఆటో పిలిచాడు.

ఇద్దరూ ఆటోలో పక్కపక్కన కూర్చుంటే ఏదో అనుభూతి...ఆనందం గతంలోని జ్ఞాపకాలు వూపిరిపోసుకున్న ట్టుగా తోస్తోంది.

టిక్కెట్లు తీసుకుని హాలు లోపలకు అడుగుపెట్టారు. పాత సినిమా అనేమో లోపల జనం అంతగాలేరు. ఓ మూలకెళ్ళి కు ర్చున్నారిద్దరూ.

సినిమా ప్రారంభమైంది. సినిమా చూడటంలో లీనమయ్యారు. అర్జునరావు చేయి అప్రయత్నంగా ప్రమీల చేతిమీద పడింది.

పట్టనట్టుగా వుండిపోయింది ప్రమీల.

సినిమా వదిలాక సెంటర్లో వున్న హోటల్లోకి నడిచారు వారు.

టిఫిను,కాఫీ అయ్యాకఇంటికి బయలు దేరారు.

ప్రమీల రాకలోని ఆంతర్యం అర్జున రావుకు అర్థంకావటంలేదు. అడిగితే ఏమనుకుంటుందో అన్న భయంతోపాటు అడక్కపోతే తన రాక ఎంతో అవకా శంగా వుపయోగించుకుంటున్నాడనుకుం టుందేమోనన్న ఆందోళన!

''మీకేం అభ్యంతరం లేకపోతే నేను వంటచేస్తాను. వంటసామానులు చూపిం చండి'' అంది ప్రమీల.

అర్జునరావుకి ఆవిడని చూస్తుంటే మునుపటిఅనుభూతులుగుర్తుకొస్తున్నాయి. కాని, ఆమెమెడలోవున్న మంగళసూత్రాలు కనబడేసరికి మర్యాదగా వుండాలన్న వివేకం హెచ్చరిస్తోంది.

ప్రమీల బాత్‌రూముకెళ్ళి స్నానం చేస్తోంది.

''ఏమండీ...టవల్ ఇస్తారా, మరిచి పోయాను" తల బయటకుపెట్టి అడిగింది ఆమె.

అర్జునరావు టవల్ఇవ్వబోతూ అనుకో కుండానే ఆమెను చూసి చలించాడు.

ఆమె ఒళ్లుతుడుచుకుని పక్కగదిలో బ్రీఫ్‌కేసుదగ్గిరకెళ్లి బట్టలు కట్టుకుంది.

"కొంచెం హుక్సు పెడతారా !" అందామె- మరికాసేపట్లో అతని దగ్గిర కొచ్చి.

"ఇది మరీ బాగుంది. అయినా ఇంటి దగ్గిర రోజూ మీవారే పెడుతున్నారా? నా వల్ల కాదు! బెడ్‌రూములో నిలువుటద్దం వుంది....వెళ్లి ఆ హుక్సు సంగతి మీరే చూసుకోండి. తెలుగుసినిమాలు చూడరా మీరు? ఏమిటండీ ఇది !" అన్నాడు అర్జునరావు నవ్వుతూ.

"పోనీలెండి.... మీ శ్రీమతి వుంటే ఆమెనే అడిగేదాన్ని...

ప్రమీల కళ్లల్లో తడి!

అర్జునరావు ఇబ్బందిగా కూర్చుండి పోయాడు. ఆమె ధోరణిని ఇబ్బంది కరంగా భావిస్తున్నాడతను.

"సినిమా హాలులో మీకు చేసినపనికి లేని అభ్యంతరం హక్కు పెట్టమనగానే వచ్చేసిందా? పోనీలెండి.... దేనికైనా యోగం ప్రాప్తం వుండాలి" అంది ప్రమీల హాల్లోకొచ్చి అర్జునరావు ముందు నిలబడి.

తలెత్తి చూసాడు అర్జునరావు.

హరియాలీ... పూర్తి ఆకుపచ్చని వస్త్రధారణలో!

ఉద్రేకం ఉరకలు వేస్తుంటే నిగ్రహం అడ్డుపడింది.

''నేను ఆమధ్య విజయవాడ...కేవలం మిమ్మల్ని చూసేందుకు వచ్చాను. దాదాపు మీ ఇంటికోసమే రెండు గంటలు తిరిగాను. ఏంలాభం! కాళ్ళు నొప్పులు తప్ప మీ దర్శనం కలగలేదు" అన్నాడు విచారంగా.

ప్రమీల ఛాతీ పొంగింది- తనకోసం పనికట్టుకుని వచ్చాడా అన్నట్లుగా.

''నాకు ఈమధ్య మీ రూపం తరచు కళ్లముందు కదులుతోంది. గతంలో మీరు చూపించిన అనుభూతులు నన్ను పిచ్చిదాన్ని చేస్తోంటే ఇక ఆగలేక బయలుదేరి వచ్చేసాను. మావారు ఊరి కెళ్ళినా, ఊళ్ళోనేవున్నా నాకు ఒకటే! ఆయనకన్నా గొంగళి పురుగు నయ మేమోననిపిస్తుంది నాకు. ఇంత శ్రమపడి మీకోసం వచ్చినా, నేను మీముందున్నా ఏమీ పట్టటంలేదు మీకు. అదేమంటే పెళ్ళయింది నీకు అంటున్నారు. కొంచె మైనా నా గురించి, నా పరిస్థితిని గురించి ఆలోచించరేం?''

ప్రమీల వేళ్ళు ముందుకు వేసుకున్న జడ పాయలమీద నాజూగ్గా కదులు తుంటే జైపు వేస్తున్నట్లుగా అనిపిస్తోంది అతనికి.

గంటలో వంట పూర్తయింది.

''రండి... భోజనం చేద్దురుగాని!" అందామె.

అర్జునరావు ప్రమీల వెనుకేనడిచాడు.

మనిషి, అప్పుడప్పుడైనా గతంలోని జ్ఞాపకాలతో, వర్తమానాన్ని, భవిష్యత్తుని దిద్దుకోవాలనుకుంటాడేమో అనిపించిందా సమయంలో.

''నేను రేపు పదిగంటల బస్సులో వెళ్ళిపోతాను" అంది ప్రమీల.

మనసులో అతనికి ఆనందంగానే వుంది. కాని పైకిమాత్రం ''అప్పుడే వెళ్ళి ఏంచేస్తారు? మీవారు ఎప్పుడొస్తారో తెలియదన్నారుకదా?" అన్నాడు.

''నేనుంటే మీకు ముళ్లకంచెమీద వున్నట్లుగా వుందేమో! అందుకనే వెళ్ళి పోవాలనుకుంటున్నాను" ప్రమీల మాటల్లో ఉసత్వం ధ్వనిస్తోంది.

''అదేంలేదు. నేనేంచేసినా మీ శ్రేయస్సుకోరే! నా చేతలవల్ల మీ భవిష్యత్తుకు మచ్చ కలగకూడదనే నా ఉద్దేశం. మీరు సరిగా అర్థంచేసుకోగలరనే నా నమ్మకం"

"ఈ కాసేపైనా మీరు నన్ను ఏక వచనంతో.. మన తొలినాటి పరిచయంలో మాదిరిగా పిలవలేరా?"

ప్రమీల ఎందుకిలా ప్రవర్తిస్తోందో తెలుసుకోవాలనుకుంటున్నాడు అర్జున రావు. కాని అలక్ష్యం చేస్తున్నాడు.

తొమ్మిది గంటలు కొట్టింది.




"మీరు పాటలు అవగానే రేడియో కట్టేసి పడుకోండి. నాకు రోజూ ఈ టైముకే నిద్రపోవటం అలవాటు" అంటూ అర్జునరావు తన బెడ్‌రూములోకెళ్లాడు.

"మరి నన్నెక్కడ నిద్రపొమ్మంటారు...డాబామీదకెళ్లమంటారా?" అంది ప్రమీల.

"ఎందుకు హాల్లో పడుకోండి. డాబా మీద చలిగా వుంటుంది. అయినా ఇంత ఇంటిలో మీకు చోటే లేనట్లు డాబా మీద పడుకుంటాననటారేమిటి?" అన్నాడు అర్జునరావు.

అర్జునరావు అలాగే నిద్రలోకి జారిపోయాడు.

ప్రమీల సోఫామీద పడుకుంది. సీలింగు ఫాను నెమ్మదిగా తిరుగుతున్నా ఆమెకెంతో వుక్కగా వున్నట్లుంది. నిద్ర పట్టటంలేదు. దిక్కుమాలిన బతుకులా వున్నట్లుంది.

గోడ గడియారంలో ముల్లు ఎంతో అన్యోన్యంగా కదులుతున్నాయి- టిక్ టిక్ టిక్‌మంటూ చప్పుడుచేస్తూ.ఎప్పుడో ప్రమీలకు నిద్ర పట్టేసింది.

పన్నెండు గంటలు కొట్టినపుడు మెలకువ వచ్చింది.

ప్రమీల లేచి అర్జునరావు గదికేసి చూసింది తలుపుల్లోంచి. గదిలోని బెడ్ లైటు వెలుగులో అతన్ని సరిగా చూడలేకపోయింది.

లోపలికి అడుగుపెట్టి మంచం దగ్గిరకు నడిచింది.

ఆదమర్చి నిద్రిస్తున్నాడు అర్జునరావు.

ఉచ్ఛ్వాసనిశ్వాసాలకు ఎగిసిపడుతున్న విశాల వక్షం! గతంలో తననెన్నో సార్లు గాఢంగా హత్తుకున్నదే ఆ వక్షం.

ఆమె అతని ముఖంమీదకు వంగింది. ఆవిరిగా వున్న వూపిరి వెచ్చగా తగులుతోంది. నెమ్మదిగా మంచం పట్టెమీద కూర్చుంది. అయినా కిర్రుమంది అది.

అర్జునరావు ఉలిక్కిపడి లేచాడు.

ప్రమీల అతనిమీద వాలిపోబోయింది. మరుక్షణం అర్జునరావు ఆమె చెంపమీద చెళ్ళుమనిపించాడు.

ప్రమీల మంచంమీద ఒరిగిపోయింది నిస్త్రాణగా.

"ఏమండీ....ఏమయింది..లేవండి.." అంటున్నాడు. ఆమెలో చలనం కనబడకపోయేసరికి అతనికి భయం వేసింది. మంచంమీద సరిగా పడుకోబెట్టి ఫాను స్పీడు పెంచి, వంటింట్లోకెళ్ళాడు... స్టవ్వు వెలిగించి వేడినీళ్ళు పెట్టాడు. హార్లిక్సు కలిపాడు.

"తీసుకో ప్రమీలా!" ఆ మాటల్లో అభిమానం...ఆప్యాయత....ఆత్మీయత వున్నాయి. ఆమె పరవశించిపోతూ గ్లాసు అందుకుంది.

"నన్ను క్షమించండి. ఆవేశంలో, ఉద్రేకంలో మీదగ్గరకొచ్చాను.... తోటమాలి నేలలో విత్తనం వేస్తేనే బాధ్యత తీరిపోదు. మొక్క మొలకెత్తాక ఆలనా పాలనా చూడాలి. నా భర్త ఈ మెడలో తాళి కట్టాడు. కాని భార్యగా నన్నెప్పుడూ చూడలేదు. ఈ బాధ ఎవరితో చెప్పుకోమంటారు? అతను నన్ను వదులుకోలేడు. పోనీ అందేవేలుకోలేడు. ఎప్పుడూ ఏవో వూళ్ళు తిరుగుతూనే వుంటాడు.. మా అమ్మ, అక్కయ్యలు నేను తల్లిని కాలేదేమో అనుకుంటున్నారు తప్ప ఇదంతా వారికేం తెలుసండీ!"

"అయితే నన్ను మీవారిని కలవమంటారా? మీ జీవితాలను కలిపే మార్గం చూడమంటారా?"




ప్రమీల మాట్లాడలేదు. ఏం చెప్పేందుకూ తోచలేదు.

అర్జునరావు హాల్లోకెళ్ళి పడుకున్నాడు...తెల్లవారింది.

ప్రమీల లేచి కాఫీ చేసింది. తర్వాత వంట చేసింది.... ఇద్దరూ మౌనంగా భోజనం చేసారు. ఆ తరువాత బస్టాండుకు బయలుదేరారు.

విజయవాడ వెళ్ళే బస్సులో కూర్చుంది ప్రమీల.

"నేను అమర్యాదగా ప్రవర్తిస్తే క్షమించండి. మీ భర్తను అర్థం చేసుకోండి. మీ సంసారం బాగుపడాలనే విధంగా ఆలోచించండి. మళ్ళీ జన్మంటూ వుంటే.. అప్పుడు మనం కలిస్తే....అందరినీ ఎదిరించి పెళ్ళి చేసుకుందాం... ఇటువంటి అనుభూతులు వ్యక్తిత్వాన్ని పాడుచేస్తాయి. దయచేసి సహృదయంతో ఆలోచించి చూడండి" అర్జునరావు అనునయంగా చెప్పాడు.

ప్రమీల కళ్ళు చెమరింపును దాచుకుంటున్నాయి.

బస్సు బయలుదేరుతోందని సూచనగా డ్రైవరు బెల్ కొట్టాడు.

బస్సు కనుమరుగయిపోయింది.... అర్జునరావు వెనక్కు మళ్ళాడు.

* * *

అవధాని, అనసూయమ్మ మాధవి గురించి ఆలోచిస్తున్నారు. ఆయన ఆలోచనలు ఒకలా వున్నాయి. ముక్కూ ముఖం తెలియనివాడిని ... ఏదో ఇల్లు చూపించిన అర్జునరావుని ....పెళ్ళాడటం ఆయనకి ఎందుకో ఇష్టంగా లేదు. ఎర్రగా, బుర్రగా, అందంగా వుండని బుట్టలో వేసుకున్నాడేమో అతను! ఇటువంటివి ఈ రోజుల్లో ఎన్నో జరుగుతున్నాయి.

భార్యతో సంప్రదించాక తన ఆలోచనని మాధవి ముందుంచాడు.

"నాన్నా! కాపురం చేసేది నేను. నాకిష్టమైన వాడిని పెళ్ళి చేసుకోటంలో నాకు స్వేచ్ఛ లేదా?" నిలదీసినట్లుగా అంది మాధవి.

అవునన్నట్లుగా చూసింది అనసూయమ్మ.

"అసలు తప్పు దానిది కాదు ఆ సుజాతది. ఆవిడగారు ప్లాస్టిక్ సర్జరీ చేయించిందికదూ ... తరువాత ఉద్యోగస్తురాలయింది. అందుకే ఇలా మాట్లాడుతోంది....ఈకాలంలో కుర్రాళ్ళ గురించి ఇంకా తెలిసినట్టులేదు" అవధానికి కోపం వచ్చింది.

"ఏవిటండీ ఆమాటలు. మనమ్మాయిని మనమే నిందించుకుంటామా! అర్థం పర్థం లేకుండా మాట్లాడుతున్నారు'' కూతురుని సమర్థిస్తూ అంది అనసూయమ్మ.

"నీ ముఖం..నువ్వు నోరు మూసుకుని కూర్చో''అనేసి అవధాని వెళ్ళిపోయాడు. అరగంటకే ఇంటికొచ్చేసాడు.

పన్నెండు గంటలకు పోస్టుమాను వచ్చాడు.

మాధవి పేర ఇన్లాండు లెటరు వచ్చింది. అవధానికిచ్చాడు పోస్టుమాను. ఫ్రం అడ్రస్ చూసాడాయన. కవరు మీద 'అర్జునరావు' అని వుంది. పైగా పెద్ద అక్షరాలతో 'పర్సనల్' అని వుంది.

''చూపాలా వద్దా" రెండు క్షణాలు ఆలోచించాడాయన. మాధవి మునుపటి కూతురు కాదని ఆయన గ్రహించాడు, ఇప్పుడీ ఉత్తరం ఇవ్వకపోతే ఏ గొడవ చేస్తుందో అన్న భయం అవధానిలో లేక

పోలేదు. అందుకే ఉత్తరం ఇవ్వాలనుకున్నాడాయన.

"అర్జునరావు అమ్మాయికి ఉత్తరం రాసాడు. వ్యవహారం చాలా దూరమే వచ్చింది. ఆడపిల్లలు కూడా మగపిల్లల్లా ఎదిరించి మాట్లాడుతున్నారు. కాల మహిమ!" అంటూ కవరు అనసూయమ్మ చేతికిచ్చాడు అవధాని- మాధవికిమ్మన్నట్లుగా. తర్వాత లైబ్రరీకెళ్లాడాయన.

అనసూయమ్మ కూడా భర్త ధోరణి లోనే ఆలోచించింది కాసేపు. పిల్లల స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు అడ్డుపడకూడదనుకుందావిడ. వాళ్ళు తప్పుదారిన నడుస్తున్నప్పుడు, సరిచేయవచ్చునన్న ఉద్దేశంతో.

మాధవి తప్పుదారిలో నడుస్తోందని ఆ తల్లి భావించటం లేదు. అరగంట తరువాత కూతురు స్నేహితురాలింటి నుంచి వచ్చింది.

అనసూయమ్మ మాధవికొచ్చిన ఉత్తరాన్ని అందించింది.

పెరట్లోకి వెళ్ళి చదవసాగింది.

"డియర్ మాధవీ... అమ్మా, నేను విజయవాడ వచ్చాను. ఇక్కడ నాన్నగారు ఒక్కరే వున్నారు కదా... పండగలు కదాని నాలుగురోజులు సెలవు పెట్టాను. నువ్వు తిరుగు ప్రయాణంలో ఇక్కడకు రావాలెను. ఆ తరువాత ఇద్దరం హైదరాబాదు వెళ్ళచ్చు. ఇంటి చిరునామా రాస్తున్నాను. అమ్మ ఇలా రాయమంది. తప్పకుండా రావాలెను.

కొత్త చీర ఎలా వుంది?

అర్జునరావు"

నవ్వుకుంటూ లోపలికి నడిచింది.

"ఏమని రాసేడే?" అడిగింది అనసూయమ్మ.

[illegible] ... వచ్చే 

మాధవి చెప్పింది.

ఉత్తరం గురించి తండ్రికి చెప్పవద్దని కూడా కోరింది మాధవి.

"మరి ఉత్తరంలో అతనేం రాసాడని అడిగితే ఏం చెప్పాలిట?" అనసూయమ్మ ప్రశ్నించింది కూతురుని.

"ఏమిటమ్మా... అదీ నేనే చెప్పాలా! ఆఫీసులో సెలవు పొడిగించకుండా త్వరగా రమ్మంటున్నారని చెప్పమ్మా. అసలు విషయం నాన్నగారికి చెప్తే కోప్పడతారు" మాధవి అర్థించింది.

"ఏమిటోనే... నీ ధోరణి నాకేం బోధపడటంలేదు. మీ నాన్న నిన్ను తన స్నేహితుడి కొడుక్కివ్వాలనుకుంటున్నారు. నువ్వేమో అతన్నే చేసుకుంటానంటున్నావు. చూడమ్మా.. ఆడపిల్లవు. నువ్వు మాత్రం జాగ్రత్తగా వుండు. రోజులు బాగోలేవు. ఎవరినీ నమ్మడానికి లేదు. చదువుకున్నదానివి, మంచీ చెడు బేరీజు వేసుకోగలిగినదానివి. ఆలోచించి మరీ చేయి ఏ పనయినా..." అనసూయమ్మ పెద్దతరహాని ప్రదర్శించింది.



## 10

అనసూయమ్మ కూతురి ప్రయాణానికి ఏర్పాట్లు చేస్తోంది. మాధవికిష్టమని జంతికలు, సున్నుండలు తయారుచేస్తోంది.

"ఏమిటమ్మా అవన్నీ.... నేనేమన్నా తీర్థయాత్రలకెడుతున్నానా! నేనేం తీసుకెళ్ళను.... హైదరాబాదులో

దొరకవా ఏమిటి? డబ్బు పడేస్తే ప్రతిదీ ప్లేటుల్లోకి వచ్చి పడుతుంది. ఈ లగేజి నేను మోయలేను బాబు!" గారం వలకబోసింది మాధవి.

"పోనీ అతను తింటాడులే!"

"ఏమిటి... అల్లుడుగారిని ఇప్పట్నుంచి లోబరుచుకుంటున్నావేమిటి?"

ఆ మాటలకు అనసూయమ్మ కళ్ళు చెమర్చాయి. "పిచ్చిపిల్లా... నీకు ఆ దేవుడు ఏ అపకారం లేకుండా పుట్టిస్తే నీకీపాటికి పెళ్ళయిపోయేది. నీ చెల్లెలు అప్పుడే బిడ్డ తల్లి అయింది. ఎనిమిది నెలలయినా, అపకారం తొలగించుకున్నా పెళ్ళికి తొందరపడటం లేదు నువ్వు! ఏమిటో నమ్మా, నీ పద్ధతి" పెదవులు దాటి రాలేకపోయాయి ఆ మాటలు.

మాధవి తల్లిని గమనించింది.... తడి కళ్ళు ఆ భాషని అర్థంచేసుకున్నాయి. ఇంకా పెళ్ళిచేసుకోలేదన్న మాటేగాని, ఆ ఆరాటం తనకు తెలియదా... వయసు లేదా.. అర్థంచేసుకోలేని పసిపిల్లా!

తెల్లవారింది.

"నాన్నా... నేను రాత్రి ప్రయాణం చేయలేను. ఈమధ్య ప్రయాణాల్లో దోపిడీలు ఎక్కువై పోయాయి. అందుకని పదిగంటల బస్సులో వెళ్ళిపోతాను. అక్కడికెళ్ళేసరికి సాయంత్రం ఆరు గంటలవుతుంది" అంది మాధవి.

"ఆరు గంటలకు విజయవాడ చేరుతుంది బస్సు. నువ్వు వెళ్ళేది హైదరాబాదు కాదా?"

"అవును నాన్నా! అన్నపూర్ణమ్మగారు వాళ్ళింటికి రమ్మని రాసారు. ఆవిడతో కలిసి హైదరాబాదు వెళతాను. వెళ్ళకపోతే బాగోదుకదా!" తల్లివైపు చూస్తూ చెప్పింది మాధవి.

"నేనేం చెప్పదలుచుకోలేదు. అయినా అక్కడికెందుకమ్మా.... నేను వారం రోజుల్లో నా స్నేహితుడిని కలిసి పెళ్ళి సంబంధం గురించి మాట్లాడుతాను. బహుశా ఆ అబ్బాయి నిన్ను ఆఫీసులో గాని, ఇంటి దగ్గిరగాని కలవచ్చు. పెళ్ళి చూపులంటూ ప్రత్యేకంగా వుండవు. మీ ఇద్దరు చూసుకుని మాట్లాడుకోనేవే.... అంతే! కాబట్టి ఈ విషయం మాత్రం అర్జునరావుకు తెలియకుండా జాగ్రత్త పడు. ఈ తండ్రిని అర్థం చేసుకో అమ్మా! నీక్కూడా పెళ్ళి చేసేస్తే, నా బాధ్యత తీరిపోతుంది..."

అవధాని కళ్ళుకూడా చెమర్చాయి.

అంబాజీపేట వెళ్ళి అవధాని దంపతులు కూతురుని విజయవాడ బస్సు ఎక్కించారు. ముగ్గురి మనసుల్లోనూ ఏవో ఆలోచనలు... ఆందోళన...వేదన!

బస్సు విజయవాడ చేరేసరికి ఆరు గంటలయింది.

అర్జునరావు ఉదహరించిన చిరునామా చూసుకుంటూ రిక్షా పిలిచింది మాధవి.

గాంధీ నగరంలో గుర్తుల ప్రకారం వెళ్ళి రెండు కొబ్బరి చెట్లు, మధ్యలో రెండు అశోక వృక్షాలతో వున్న డాబా ఇంటిదగ్గర రిక్షా ఆగింది. 'రంగనాథం' అన్న నేంప్లేటు చూసి మాధవి రిక్షా దిగింది.

తలుపులు వేసివున్నాయి. కాలింగు బెల్ నొక్కింది మాధవి.

రంగనాథం తలుపు తీసాడు. 'ఎవరు కావాలి' అన్నట్లు చూసాడు. మాధవి లోపల ఆడవాళ్ళెవరూ లేరాన్నట్లు చూస్తోంది.

"నా పేరు మాధవి. హైదరాబాదులో

అర్జునరావుగారు పనిచేస్తున్న ఆఫీసులోనే పనిచేస్తున్నాను.ఆయనకోసం.."చెప్పింది.

"నువ్వేనన్నమాట మాధవి అంటే. మా ఆవిడచెప్పిందిలే! లోపలకురామ్మా!" అన్నాడు రంగనాథం.

"ఎవరూ లేరాండీ?" అడిగింది మాధవి.

"తెలిసినవాళ్ళు కాకినాడ నుంచి మద్రాసు వెడుతున్నారు. వారిని కలిసేందుకు మావాడు, అన్నపూర్ణ స్టేషనుకు వెళ్ళారు. కూర్చో...వస్తారు" చెప్పాడు రంగనాథం

మాధవి హాల్లో కూర్చుని అక్కడున్న పత్రికలు చూస్తోంది.

రంగనాథం బెడ్‌రూములో ఏవో ఫైళ్ళు చూసుకుంటున్నాడు.

పది నిమిషాల తరువాత ఆయనకేదో గుర్తుకొచ్చింది.

"చూడమ్మా...వంటింటి అలమారాలో హార్లిక్సు వుంది..కలుపుకో. పెద్దగా నాకు వంటింటి పనులేమీ రావు" అన్నాడు ఆయన.

"ఫరవాలేదు..ఏమీ వద్దులెండి!" అంది తను.

"అలాకాదు నాకూ్కడా కలుపు. నీకు కంపెనీ ఇస్తాను"

రంగనాథం ఆమెకు వంటింటిని చూపించి హాల్లోకొచ్చి కూర్చున్నాడు.

"ఇది సొంత ఇల్లేనాండీ?" అడిగింది మాధవి హార్లిక్సు కప్పు ఇస్తూ.

"అవునమ్మా యీ! ఏదో ఈ మాత్రం నిలువనీడ, తిండికి లోటులేని జీవితాన్ని ఏర్పాటు చేసినవారిని ఎప్పుడూ నేను తలచుకుంటూవుంటాను. ఆయనే నాకు సాయపడకపోతే, నాస్థితి ఎలావుండేదో.!



తలచుకుంటేనే భయంగా వుంటోంది!" కప్పు అందుకుంటూ అన్నాడు ఆయన.

మాధవి ఎదురుగావున్న కుర్చీలో కూర్చుంది.

"మా అర్జునరావునీకెలా పరిచయం?" ప్రశ్నించాడు.

'అయితే నాగురించి అతనేమీ చెప్పలేదన్నమాట' అనుకుంది.

"ఇద్దరూ ఒకే ఆఫీసు...పైగా ఒకే సెక్షన్" అంది.

"ఎక్కడుంటున్నావ్....? ఉమెన్స్ హాస్టల్లోనా?"

"లేదండీ...మీ అబ్బాయిగారింట్లోనే"

"అహా..అలాగా. మరి అక్కడ ఖాళీ వాటా లేదనుకుంటానే .... హెడ్మాస్టరు గారు ఖాళీచేసేసారా?"

"లేదండి...మేడమీదగదిలో వుంటున్నాను"

"అద్దె ఎంత?"

'ఏమని చెప్పాలి.. ఎంతని చెప్పాలి? ఉచితంగానే వుంటున్నానంటే ఈయన ఏమనుకుంటారో?' ఉక్కిరి బిక్కిరి ఆలోచనలు.

"అందరిలాగానే అద్దె ఇస్తానన్నాను. కాని మీ అబ్బాయి ఒప్పుకోలేదు. నేనేమీ అద్దెమీద బతకటంలేదు... హెడ్మాస్టరుగారిని కూడా ఇంతయిమ్మని అడగలేదు..అద్దెవాళ్ళు ఫలానా ఇంట్లో ఆనందంగా వున్నారన్న పేరు చాలట అర్జునరావుగారికి. అందుకని వందఇమ్మన్నారు. కాని రెండు నెలల్నుంచీ అదికూడా తీసుకోటంలేదు...నాకేమో పూరికే వుండేందుకు చిన్నతనంగా వుంటోంది" చెప్పేసింది మాధవి.

"వాడు నా కొడుకు. వాడికి నా అలవాట్లు వచ్చినందుకు గర్విస్తున్నాను. దేవుడిదయవల్ల నాకు రెండుఇళ్ళున్నాయి.

త్నాల్లాంటి పిల్లలున్నారు.. నాలుగైదు
షలదాకాఆస్తిపరుడినయ్యాను.నాతరంకు
గాళ్ళ తరానికి ఏలోటు వుండదు. ఈ
గామీద ఎలాపుట్టానో అలాగే వెళ్లి
తాం. ఈ ఆస్తిపాస్తులు, సిరిసంపదలు
ంటరావు. బతికినంతకాలం హాయిగా
ృప్తిగా గడిచిపోవాలి. ఈ మాత్రం
ృప్తి, సంతోషం మిగుల్చుకుంటేచాలు.
ేను నిన్ను బోరు కొడుతున్నానమ్మా?
ాకో పిచ్చివుంది. అప్పుడప్పుడు ఈ
ేదాంతం వల్లిస్తుంటాను.." రంగనాథం
ెప్తున్నాడు.

"లేదండీ...మీ మాటల్లో వాస్తవం
వుంది"

"అంతేనంటావామ్మా...అన్నపూర్ణని
ఏపరిస్థితుల్లో వివాహం చేసుకున్నానో
నేను చెప్పినా నీకు అర్థంకాదు. ఈ పురుష
ఆధిక్యత సమాజంలో మగవాడికో రూలు,
ఆడదానికో రూలు. మగాడికి పెళ్ళాం
పోతే స్మశానంలో శవం కాలుతుండగానే
పెళ్ళిమాటలు కొస్తారు. అదే ఆడదానికి
అయితే చనిపోయిన భర్తను తలచు
కుంటూ జీవితాంతం ఒంటరి జీవితం
గడపాలి. ఇదెక్కడిన్యాయం? ఆడదాన్ని,
మగవాణ్ని ఒకే విధంగా సృష్టించిన
దేవుడినే ఈ మనుషులు లెక్కచేయటం
లేదు. దానికోఆచారం, సంస్కారం, కట్టు
బాటు లాంటి పిచ్చి పేర్లు పెట్టారు. అవును..
నీకు ఇదేమీ అర్థంకాదు. కాని ఇది సత్యం.
మరుక్షణంలో జరిగేదేమిటో తెలియ
కుండానే ఇటువంటి వేర్పాటుధోరణులతో
ఈ సమాజం కుళ్ళిపోతోంది. ఈ
కుళ్ళును తొలగించేందుకు అందరూ
ముందుకు రారు. వచ్చినవాళ్ళని నింది
స్తారు.... హేళనచేస్తారు.. రాళ్ళేస్తారు.
ఆవిధంగానే అన్నపూర్ణ నా భార్య
అయింది"

రంగనాథం చెప్పటం ఆపి మాధవికేసి
చూసాడు పరీక్షగా.

"నాకు వేదాంతం పట్ల నమ్మకం
వుంది. అటువంటివారంటే గౌరవం"
అంది మాధవి ఆయన వైపు చూస్తూ.

"కాని దీనికంతకూ నా వెనుక
అండగా నిలిచిన నా స్నేహితుడికో
ఉపకారం చేసి ఇప్పుడు నా కృతజ్ఞత
తెలుపుకోవాల్సి వుంది"

"ఏమిటి... ఉపకారానికి కృతజ్ఞత
ద్వారా బదులు తీర్చేసుకుంటారా?" అనే
సింది మాధవి హఠాత్తుగా.

"అవునమ్మా...! దానివల్ల మా
కుటుంబాలు మరింత దగ్గరవుతాయి"

"అయితేసరి... అలాగే చేయండి"

"కాని అప్పట్నుంచీ మరో సమస్య
ఇబ్బంది ఏర్పడుతోంది!" రంగనాథం
ఒక్కసారి బెడ్‌రూములోకెళ్ళి కళ్ళు
తుడుచుకుని నోట్లో వక్కపొడి వేసుకుని
వచ్చాడు.

"మీరేదో చెప్పాలనుకుంటున్నారు"
అంది మాధవి.

"సో...నౌ కమింగ్ టు ది పాయింటు!
మన జీవితాల్లో కొందరు వ్యక్తులు
అనుకోనిపరిస్థితుల్లో ఎదురవుతారు.కొన్ని
మరపురాని సంఘటనలు జరిగి మరింత
సన్నిహితులవుతారు. వారి మధ్య
ప్రేమాభిమానాలుచిగురిస్తాయి. ఏడడుగులు
వేసే జీవితాన్ని ఆరంభించాలను
కుంటారు. కాని దేవుడు వారిని ఏదో
విధంగా వేరు చేసేస్తాడు. ఆ జ్ఞాపకాల
నీడల్లో, బతికున్న మనిషి పిచ్చివాడవు
తాడు. వికారి అవుతాడు. సరిగ్గా అటు
వంటిసమయంలోనే ఆదేదేవుడు మరొకరిని
ఆ వ్యక్తి జీవితంలోకి పంపుతాడు.

నిజంగా దేవుడు హీరోగాను, విలన్‌గాను ద్విపాత్రాభినయం చేస్తూ రెండు పాత్రలకు న్యాయం చేకూరుస్తాడు"

రంగనాథం మాధవి వైపు చూసాడు. ఆమె ఆయన మాటలు అర్థంచేసుకునే ప్రయత్నం చేస్తోంది.

"నిన్ను మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను'' అన్నాడు రంగనాథం హఠాత్తుగా.

"ఎందుకండీ?'' నవ్వుతూ అడిగింది మాధవి.

''ఎందుకేమిటమ్మా... మావాడికున్న చెడ్డ అలవాటు... అదే సిగరెట్టు కాల్చటం నువ్వు మాన్పగలిగావని అన్నపూర్ణ చెప్పింది. అసలు మనిషికి ఏదీ అలవాటు కాకూడదు. వ్యసనంగా మారిన తరువాత వదుల్చుకోటం అంత తేలికయినది కాదు. ఇప్పుడు వాడికి సిగరెట్టు అంటే రోత పుట్టింది. ఇది గొప్ప విషయం కాదూ!" రంగనాథం సంబరంగా చెప్పాడు.

మాధవి ఇబ్బందిగా కదుల్తూ దిక్కులు





చూడటం ఆయన గ్రహించాడు.

"బాత్‌రూం అదేనమ్మా! ముఖం కడుక్కోవాలంటే వెళ్లొచ్చు"

ఆమె బాత్‌రూముకెళ్ళింది. పది నిముషాల్లో తిరిగొచ్చింది.

'ఈ పిల్ల తన కోడలయితే ఎంత బాగుంటుంది! తన కొడుకుని తీర్చిదిద్దిన ఉత్తమురాలు. ఆ రోజు ప్రమీల ఈరోజు మాధవిలా ప్రవేశించిందేమో! అన్నపూర్ణకు కూడా ఇష్టమేమో, అందుకే తరచూ చెప్తోంది!' అనుకొన్నాడాయన స్వగతంలోనే.

ఎనిమిది గంటలు కావస్తోంది.

'సర్కార్ ఎక్స్‌ప్రెస్ ఈరోజు లేటయి వుంటుంది. దిక్కుమాలిన రైళ్లు.. టైముకు వచ్చినా రావు. సరిగ్గా మాధవి వచ్చే రోజునే పీళ్లు లేకుండాపోవాలా, ట్రెయిను ఆలస్యంగా రావాలా?' విసుక్కున్నాడాయన.

మాధవికేమీ తోచటంలేదు. పరిచయం లేని మగాడితో ఏం కబుర్లు చెప్పగలదు... కాలక్షేపం కావటంలేదామెకు.

"నువ్వు భోజనం చేయమ్మా... వాళ్ళు ఎప్పుడొస్తారో!" కొంచెం సేపు అయ్యాక అన్నాడు రంగనాథం.

'ఏమిటో ఈయన ధోరణి! ఓవేపు అన్నపూర్ణగారు, మరోవేపు ఈయన తనమీద ఆప్యాయత కనబరుస్తున్నారు. వీరికి తనకు ఒకప్పుడున్న అవకరం గురించి చెప్పే మంచిదేమో లేకపోతే దాచా ననుకుంటారేమో! అదినిష్ఠూరం మంచిది!' అనుకుంటోంది మాధవి.

రంగనాథం, మాధవి భోజనం చేశారు.

తొమ్మిది గంటలకు అన్నపూర్ణ, అర్జునరావు వచ్చారు.

చాలా సేపటివరకూ నలుగురూ కబుర్లు చెప్పుకున్నారు.

రాత్రి పదకొండు గంటల బస్సులో అర్జునరావు, మాధవి హైదరాబాదు వెళ్ళి పోయారు.

"ఏమండీ!వారిద్దరినీ అలా పక్కపక్క చూస్తుంటే మీకేమనిపిస్తోంది?" అడిగింది అన్నపూర్ణ భర్తని.

"నాకు నువ్వు,నీకు నేను ఏమవుతాం" నవ్వుతూ అన్నాడు రంగనాథం.

* * *

అవధాని, అనసూయమ్మ విజయవాడ వెళ్లారు. అన్నపూర్ణ అవధాని చెల్లెలే!

"రండి...రండి బావగారూ! చాలా కాలానికి వచ్చారు" రంగనాథం వారిని లోపలకు ఆహ్వానించారు.

అన్నపూర్ణ అన్నగారి కుటుంబంనుండి వేరుపడ్డాక ఎప్పుడూ వారి వూరుగాని, ఇంటికిగాని వెళ్ళలేదు. ఏ మూడు నాలుగు నెలలకోసారి అవధాని వచ్చి చూసిపోయే వాడు. మిగిలిన చెల్లెళ్ళకు ఈ వార్త తెలిపేవాడు కాదు.

"మా చెల్లెలు లేదా?" అడిగాడు అవధాని.

"లేదు... నిన్ననే ఊరెళ్ళింది"

"మీ వాడు ఎప్పుడొచ్చినా కనబడడే. ఏ ఆఫీసులో పనిచేస్తున్నాడన్నావ్. త్వరలో హైదరాబాదు వెళ్లాలనుకుంటు న్నాను... అప్పుడు చూస్తాను" అవధాని, మాధవి వివాహం గుర్తుకురాగానేఅడిగాడు బావమరిదిని.

"చూసావా... మనం ఇంతదగ్గరి బంధువులమే అయినా నా పిల్లలు కూడా నీకు తెలీదు. వాళ్లొచ్చినప్పుడు నువ్వు రావు.... నువ్వొచ్చినపుడు వాళ్లుండరు తప్పు నాదేనేమోనని అప్పుడప్పుడు నాకు అనిపిస్తూవుంటుంది. మీ చెల్లెల్ని కట్టుకుని మీ అందరికీ దూరం చేశానేమో!" రంగనాథం మనసులో మాట బయట పెట్టాడు.

అనసూయమ్మ గోడకున్న అర్జున రావు ఫొటో చూసి ఆశ్చర్యపోయింది. భర్తని అటు చూడమన్నట్టుగా చూసింది. కాని ఆయన చూపులు ఏ ఆశ్చర్యాన్నీ ప్రకటించలేదు.

"చూడు రంగనాథం...మీ అర్జునరావు ముందే మా ఇంటికి వచ్చాడు. అమ్మాయి మాధవి వాళ్ళాఫీసులోనే పనిచేస్తోంది. మనం కావలసినవాళ్ళమని వాళ్లకు తెలియకపోయినా, ఆ దేవుడే వారిని ఒకేచోట చేర్చాడు" అవధాని వుండబట్టలేక అనేశాడు.

ఈసారి ఆశ్చర్యపోవటం రంగనాథం వంతు అయింది.

"మనమధ్య రాకపోకలు పెద్దగా లేక పోయినా, నువ్వు నాకోసం చాలా శ్రమ పడ్డావు. నువ్వే గనుక నన్ను పరోక్షంగా నయినా ఆదుకోకపోతే ఏమయిపోయే వాడినోకదా!" భయం కనబరిచాడు రంగ నాథం.

"తప్పుడుకదా...నువ్వు నా చెల్లెలు సౌభాగ్యం నిలిపావు. నా తండ్రి కన్న

కూతురు చేసినపనికి అందోళనపడినా, అన్నపూర్ణ భవిష్యత్తు దృష్ట్యా ఏదో చేతనయిన సాయంచేయవలసి వచ్చింది. అప్పుడు నీ పరిస్థితినిబట్టి మంచో చెడో మిగిలినవారిని కాపని మీకోసం సాయ పడటం నా బాధ్యతగా భావించాను" అన్నాడు అవధాని.

రంగనాథం ఆలోచిసున్నాడు.

"ఏళ్ళక్రితం విడిపోయిన కుటుం బాలని కలపాలంటే మాధవిని నా కోడలుగా చేసుకోవడమే మార్గం... ఏమం టావ్?" అన్నాడు రంగనాథం కొంచెం సేపు ఆగి. బావమరిది ఆలోచన అవధాని దంపతులకు బాగానే వుందనిపించింది.

"మా చెల్లెల్ని కూడా చూసి వెళ్ళా లనుకున్నాను. కాని ఏం చేస్తాను"

"మీరన్నదీ నిజమే. ఏ కారణంవల్ల మన కుటుంబాలు విడిపోయాయో, తిరిగి అదే కారణంతో మనం ఒకటవ్వాలి. మీ ఆలోచన బాగానే వుంది" అనసూయమ్మ భర్తవైపు చూస్తూ అంది.

"కాని ఒక్క విషయం మరిచి పోయావ్ నువ్వు!" అన్నాడు రంగనాథం

"ఏమిటి?"

"అబ్బాయి, అమ్మాయి ఉద్యోగాలు చేస్తున్నారు కాబట్టి హైదరాబాదులోనే వుంటారు. కాని మీరు తిరిగి సంబంధం కలుపుకుంటే వూళ్ళో మీకు గొడవలు తల ఎత్తుతాయేమో! పట్నాలు, నగరాలు ఇటువంటి పట్టింపులకు విలువలు ఇవ్వక పోయినా, గ్రామాల్లో ఎక్కువే. ఆలోచించు" రంగనాథం మస్తిష్కంలో కదిలిన సందేహాన్ని బావమరిది ముందు వుంచాడు ముందాలోచనతో.

"ఒక్కటి నిజం. భయపడేవాళ్ళని ఈ సమాజం మరింత భయపెడుతుంది. ఓసారి ఎదురుతిరిగితే మళ్ళీ మన జోలికి రారు ఈ మనుషులు. నేనేం తప్పు చేయలేదు. దొంగతనం చేయలేదు. మోసం చేయలేదు. ఎప్పుడో చేసిన అన్యాయాన్ని ఈరోజు తెలుసుకుని సరిదిద్దుకుంటున్నాను ఇది తప్పా?"

"ఈ ధైర్యం ఎప్పట్నుంచి?" అవధాని మాటలకు అడ్డుపడ్డది అనసూయమ్మ.

"తరాలు మారుతున్నాయి. అంత రాలు మారుతున్నాయి. రోజులు, పరి స్థితులు వాటితోపాటే మారుతున్నాయి. మనుషుల ఆలోచనలు, పద్ధతులు కూడా కాలాన్నిబట్టి మారాలి. మంచిని అనుస రించటం ఎప్పుడూ మంచిదే! ఒకప్పుడు నేత చీరలు కట్టే జనం, ఇప్పుడు వాటిని ఇష్టపడటం లేదు. ఓవిధంగా ఆధుని కతను అందరూ ఆహ్వానించాల్సిందే! కట్నకానుకలు వివాహవ్యవస్థ నుంచి పోవాలంటే కులాంతర వివాహాలు జరగా ల్సిందే! ఆదర్శాలు ఆచరణలోకి వచ్చి నప్పుడే వాటికి గుర్తింపు, విలువ. కాబట్టి నేను నీ ఉద్దేశంతో ఏకీభవిస్తున్నాను" అవధాని ధోరణికి రంగనాథంతోపాటు అనసూయమ్మ కూడా ఆశ్చర్యపోయింది.

"మనపిల్లలే మనల్ని సరిదిద్దుతు న్నారు" రంగనాథం వైపు చూసిందావిడ.

అవధాని దంపతులు ఆ రాత్రికి బావ మరిది ఇంటనే వుండిపోయారు.

"అన్నపూర్ణ రాగానే మేమిద్దరం మీ వూరు వస్తాం... అందరినీ ఈవిధంగా అయినా చూస్తాం...." రంగనాథం తన మంచితనం మరోసారి మాటల్లో వ్యక్త పరిచాడు. అనసూయమ్మ, అవధాని మర్నాడు వెళ్ళిపోయారు.

* * *

అర్జునరావు సీరియసుగా పనిచేస్తున్నాడు. ఈమధ్య తరచు ఆఫీసుకు సెలవు పెట్టటం... సరిగ్గా పనిచేయక పోవటంతో పని పేరుకుపోయింది. ఆఫీసరు మంచివాడు కాబట్టి అంతగా పట్టించుకోకుండా చూసీ చూడనట్లు వుంటున్నాడు.

అంతలో ఆఫీసరు నుంచి పిలుపు వచ్చిందతనికి. డిక్టేషను కోసమేమోనని షార్టుహాండు పుస్తకం, పెన్సిలుతో ఆఫీసరు రూములోకి అడుగుపెట్టాడు అర్జునరావు.

"మీరు ఈమధ్య తరచు సెలవు పెడుతున్నారు, అదోలా కనిపిస్తునారు... ఏమైనా ప్రాబ్లమా?" సూటిగా అడిగాడు ఆఫీసరు.

"ఏంలేదుసార్...మనసే బాగుండటం లేదు" క్లుప్తంగా చెప్పాడు.

"ఎందుకు బాగుండటం లేదు... ఏదైనా లవ్ అఫైరు బ్రేక్ అయిందా! నాతో చెప్పండి ఫరవాలేదు...సరిచేస్తాను"

"అదేం లేదు సార్... ఉంటే మీకుకాక ఎవరికి చెప్తాను?"

"చూడండీ అర్జునరావుగారూ... మిమ్మల్ని నా తమ్ముడిగా భావిస్తున్నాను. మనసు నిలకడగా వుండాలంటే వయసుకు స్థిరత్వం కావాలి. దానికి ఓ తోడు వుండాలి. ఆతోడు పెళ్ళిద్వారాపొందచ్చు. జీవితంలో ఏదైనా తిరిగి సంపాదించచ్చు. కాని ఆడదాని ప్రేమను,పోయిన వయసుని పొందలేము. ఏవయసుకా ముచ్చట అన్నారు పెద్దవాళ్ళు. మీరిప్పుడు మంచి వయసులో వున్నారు. ఆ వయసును మీ జీవిత భాగస్వామికి అంకితం చేయాలి. మీ ఆలోచనలకు పరిష్కారం దొరుకుతుంది. మరో విషయం— మీరు మీ కొలీగ్ మాధవిని పెళ్ళి చేసుకోబోతున్నారని, ఆమె ప్రస్తుతం మీ ఇంట్లోనే వుంటోందని విన్నాను. నిజమే అయితే ఆమెనే పెళ్ళిచేసుకోవచ్చుగదా!"

ఆఫీసరు ధోరణి ఈరోజు అర్జునరావుకు ఆశ్చర్యంతోపాటు కొంత శక్తిని కలిగించింది.

అటెండరు ఇద్దరికీ కాఫీ తెచ్చి వారి ముందు పెట్టాడు.

"ఓ విషయం మీరు గుర్తుంచుకోండి. కట్నకానుకల కోసం ఆశపడకండి. ప్రస్తుతం తీసుకుంటుండే బాగానే వుంటుంది. రేపు మీకు పిల్లలు పుట్టి వాళ్ళకి వివాహాలు చేస్తున్నప్పుడు బాధ, బరువు గుర్తుకొస్తుంది. మీ జీవితంలోకి అడుగుపెట్టే అమ్మాయే కట్నం... కానుక.... లాంఛనం. ఏ ఆడపిల్ల తండ్రీ సంతోషంగా కట్నం ఇవ్వడు. తన బాధ్యతను, బరువును దింపుకొనేందుకే డబ్బుని ముష్టిరూపంలో విదిలిస్తాడు. ఆ ముష్టి డబ్బుతో జీవితం జరిగిపోదు.చదువు సంస్కారంవున్నవాడు ఈ స్థితికి దిగజారటం దురదృష్టం. మీరే మాత్రం ఆలస్యం చేయకుండా ఎవరినో ఒకరిని వెంటనే పెళ్ళిచేసుకుంటే సంతోషించేవాళ్ళల్లో నేను ప్రథముడిని"

అర్జునరావు మస్తిష్కంలో ఆఫీసరు మాటలు కొత్త ఆలోచనలకు వూపిరి పోస్తున్నాయి. ఆయన తన జీవితానుభవాన్ని సలహాగా చెప్పి వుంటాడని భావించాడు తను.

* * *

అనుకున్న ప్రకారం అందరి ఆశీస్సులతో మాధవికి, అర్జునరావుకి పెళ్ళయిపోయింది. ప్రమీలకు కూడా శుభలేఖ పంపించాలనుకున్నాడు గానీ అతని




మనసు అంగీకరించలేదు. ఈ కారణంతో ఆమెకు భర్తతో అపోహలు రావటం ఇష్టంలేదు.

పెళ్ళి నిరాడంబరంగా జరిగిపోయింది. ఆఫీసు సిబ్బంది, స్నేహితులు, మాధవి తరఫున తల్లి, తండ్రి, సోదరులు హాజరయ్యేరు.

పెళ్ళికొచ్చినవారంతా అయిదోరోజుకి వెళ్ళిపోయారు.

ఓ ఆదివారం... అర్జునరావు ఏదో సాహితీ సమావేశానికి వెళ్ళాడు. మాధవి పత్రిక చదువుకుంటోంది.

ప్రమీల వచ్చింది. మాధవి పత్రికా పఠనాన్ని భంగపరుస్తూ కాలింగు బెల్లు కొట్టింది.

"ఎవరుకావాలి?" అడిగింది మాధవి.

ప్రమీలకు ఓ క్షణం నోటమాట రాలేదు. ఈవిడెవరు? అర్జునరావు కోసం తనలాగే వచ్చిందా... లేక తనతో చెప్పాపెట్టకుండా పెళ్ళాడిన భార్యా?

"అర్జునరావుగారు లేరా?" అడిగింది ప్రమీల.

ఈసారి మాధవి ఆశ్చర్యపోయింది. పేరుపెట్టి అడుగుతోంది. అందులో ఇంటికి తిన్నగా వచ్చింది....

"లేరు. ఎక్కడో సాహితీ సదస్సు జరుగుతూంటే వెళ్ళారు... ఇంతకీ మీరెవరు?" ప్రమీలవైపు అదోలా చూస్తూ అడిగింది మాధవి.

"మీరెవరో తెలుసుకోవచ్చా?" అని అడిగింది ప్రమీల.

"మీరడిగిన వ్యక్తి నా భర్త" హుందాగా చెప్పింది తను.

మనసులోని భావాలను, కళ్ళల్లోని ఆశ్చర్యాన్ని, శరీరంలోని వణుకుని బయటపెట్టదలచుకోలేదు ప్రమీల.

"లోపలకు వచ్చి కూర్చోండి. బహుశా ఓ గంటలో వచ్చేయచ్చు. మీటింగు అయిపోయి వుంటుంది. సిటీ బస్సు దొరికిఇంటికొచ్చేసరికే ఆలస్యం... ఇంతకీ ఆయన మీకెలా పరిచయం?" అసలు పాయింటు గురించి అడక్క తప్పలేదు మాధవికి.

ప్రమీల లోపలకొచ్చింది.

"విజయవాడలో మేమిద్దరం ఒకేచోట ఇనిస్టిట్యూటులో టైపు నేర్చుకున్నాది. అదిగాక మావారు మీవారి స్నేహితులు. క్రితంసారి మేమిద్దరం వచ్చాము. మీరు లేరు. ఇప్పుడూ కాన్ఫరెన్సుకు వచ్చి హోటల్లో దిగాం. రూంలో ఒక్కదానికీ బోరుగా వుంటే ఇలా చూసి వెళదామని వచ్చాను" ఓ నిజానికిమరికొంతఅబద్ధాన్ని జోడించి మరీ చెప్పింది ప్రమీల.

నిజానికి ప్రమీల రాకలోని ఉద్దేశం వేరు. అర్జునరావు ఎటూ బ్రహ్మచారిగా వున్నాడు. వయసులో వున్నాడు, పైగా స్నేహంకంటే ప్రేమే ఎక్కువ కావటంతో ఎట్లాగైనా అతన్ని తనవైపుకు తిప్పుకోవాలని ఆశ, ఆరాటం, ప్రయత్నం తన భర్త మనసులో ఏముందో ప్రమీల ఇంతవరకు తెలుసుకొనే ప్రయత్నం. చేయలేదు. దానివల్ల తనకేం ప్రయోజనం? తనలాగే అతనికీ ఏదైనా లవ్ ఎఫైరు వుందేమో? పరిస్థితులకు లోబడి పెళ్లాడాడేమో? ఇపుడు భర్త కాంపుల పేరుతో ఆ ప్రేయసి దగ్గరికెళుతున్నాడేమో. అలాగే తను అర్జునరావుని ఆశ్రయించటంలో తప్పేముంది? తనని తృప్తిపరచలేని భర్తతో కాపురం చేసేకన్నా విడిపోయి అర్జునరావుతోనే వుండిపోవాలని నిర్ణ



యించుకుంది.

కాని ఇపుడు కథ అడ్డం తిరిగింది. ఏం చేసేందుకు తోచటంలేదు. బ్రహ్మ చారిగా వున్న ఒకనాటి ప్రియుణ్ని మళ్ళీ చేరుకోవటం సంతోషమే. కాని ప్రియుడు వివాహితుడైతే చస్తే ఏ విధంగానూ ఒప్పుకోలేదు తను. తను కోరుకునే స్థానం, అవకాశం మరో స్త్రీకి లభించటంతో తను తప్పుకోవలసిందే.

మాధవి ప్రమీలకు హార్లిక్స్ కలిపి ఇచ్చింది.

ఆమెలో అప్పుడే అనుమానబీజాలు నాటేసుకున్నాయి.

ప్రమీల బయలుదేరబోయింది "వస్తానండీ" అంటూ.

"కూర్చోండి... వచ్చేస్తారు" చెప్పింది మాధవి.

"ఈపాటికి మావారు వచ్చేస్తారు. ఈ రాత్రికే వెళ్ళిపోతాం... మరోసారి వచ్చినపుడు కలుస్తాం"

"ఆయనతో ఏదైనా చెప్పాలా?" మాధవి అడిగింది.

"ఏం చెప్తారులెండి వచ్చామని చెప్పండి"

ప్రమీల వెళ్ళిపోయింది.

మాధవిఅర్జునరావు గతజీవితం గురించే ఆలోచిస్తోంది. అతను రాగానే అడగాలని నిర్ణయించుకుంది. అంతలోనే మరో ఆలోచన-'అతనికితనకున్న అవకరాన్ని ప్లాస్టిక్ సర్జరీద్వారా తొలగించుకున్న నిజాన్ని చెప్పలేదు. భర్తకు తెలుసో తెలియదో! దాచిపుంచటం మోసంచేసినట్టే ప్రమీల గురించి అడిగినప్పుడు_అవకరం గురించి అడిగితే? కనుక ఈ వ్యవహారం కొన్నాళ్ళు కనిపెట్టి అప్పుడు తెలుసు కోవాలి' అనుకుంది మాధవి.

అర్జునరావు వచ్చేసరికి బాగా ఆలస్య మయింది.

"మీ కోసం ఎవరో ప్రమీలట వచ్చి వెళ్ళింది" కాఫీ ఇస్తూ చెప్పింది మాధవి.

అర్జునరావు ఓ క్షణం అదిరిపడ్డాడు. తనటువంటి మనిషిని ఎరగనట్లు నటించా లనుకున్నాడు. కాని, మనసెందుకో ఎదురుతిరిగింది.

"ఏమంది?" ఆత్రంగా అడిగాడు.

"ఏమంటుంది నాతో....మీరు ఎంతో సరదాగా మాట్లాడేదేమో! ముక్కూ ముఖం తెలియనిదానితో కబుర్లు వుంటాయా!" అందామె.

అతను కాఫీ తాగుతున్నాడు.

"మీరిద్దరూ పెళ్ళి చేసుకోవాలను కున్నారట కదా"

మాధవి దబాయిస్తోందని అర్జునరావు గ్రహించాడు. ఎందుకంటే పెళ్ళయిన ఏ ఆడదీ అలా చెప్పదని అతని నమ్మకం. అయినా మాధవిని తనూ దబాయించ దలచుకోలేదతను.

"అవును మాధవీ....పెళ్ళిచేసుకుందా మనుకున్నాం. కానీ అమ్మ అడ్డుపడింది. ప్రమీల జీవితంలోకి తోటమాలిగా ప్రవే శించాను. నేనందించేతొలకరి ప్రేమజల్లులు ఆమె జీవితంలో ప్రేమపందిరి కావాలను కుంది. నేనామె ప్రేమపందిరిమీదపవళిస్తే తను నా కళ్ళల్లోకి ఆశగా, మత్తుగా చూసి తరించాలనుకుంది. నా చూపులుపేచే ఆశల పల్లకిలో విహరించాలనుకుంది. నా ప్రణయ సంగీతసారథ్యంలో ప్రేమగీతాలు పాడు కోవాలనుకుంది. మా అనుభవాల అను భూతుల్లో వేయి వసంతాలు చిగురించా లనుకున్నాం.కాని ఓ చిన్న పొరపాటు... అదీ నావల్లే జరిగింది. పెళ్ళిచూపులకోసం ఎదురుచూస్తున్న ఓ అమ్మాయి ఫొటో

మా ఇంట్లో చూసింది. దానికితోడు అమ్మ మందలింపు, హెచ్చరిక... అంతే! నా జీవితంలోకి ప్రవేశించిన తను మాయ మయింది"

"ఏదయినా కథలో రాస్తున్న సంభాషణా ఇది?" సూటిగా అడిగిందామె.

"ఇది కథకాదు.... వాస్తవం"

"అయితే నేనొచ్చి మీ ప్రణయ సామ్రాజ్యంమీద దండయాత్ర చేసానా?" ఎత్తిపొడుపుగా అంది మాధవి.

"కాదు మాధవీ! ఇది చాలా పాతకథ. నిజానికామె భర్తతో ఏ విధంగాను సర్దుకోలేకపోయింది. భర్తకు విడాకులిస్తాననీ, తనని పెళ్లిచేసుకోమనీ, తనుచేసిన తొందరపాటు పనులకు క్షమించమనీ కోరింది..." అర్జునరావు ఆవేశంగా చెప్తున్నాడు.

భర్తలోని నిజాయితీని, చిత్తశుద్ధిని మనసులోనే అభినందిస్తోంది మాధవి. కాని స్త్రీ సహజమయిన అనుమానం అడ్డుపడుతోంది.

"అయితే నాకు విడాకులిచ్చి మీ ప్రేమీలను సింహాసనంమీద కూర్చోపెడతారన్నమాట"

"నా గురించి ఎంత పొరపాటుగా వూహిస్తున్నావ్ మాధవీ! అదే నా ఉద్దేశం అయితే కథ ఇంతవరకూ వచ్చేది కాదు. ఆరోజే అమ్మనీ, నాన్ననీ ఎదిరించి ప్రమీలను పెళ్లాడేవాడిని. మా పరిచయాన్ని నీకు ఇపుడిలా వినిపించేవాడినే కాదు. నీకు తాళి కట్టాక, నిన్ను అన్యాయం చేస్తానని ఎలాఅనుకున్నావ్?" అర్జునరావు సూటిగా అడిగాడు.

మాధవి ఏం చెప్పలేకపోయింది.

"నేను రేపు విజయవాడ వెడుతున్నాను. నా ఫ్రెండు సుబ్బారావుని కలవాలి. అతను ఓ విషయంలో నా సలహా, ప్రమేయం అర్థించాడు" అర్జునరావు చెప్పాడు.

"నిజంగా అతన్ని కలిసేందుకేనా లేక ప్రమీలను చూసి వచ్చేందుకా?" అనాలనుకుంది మాధవి.

కాని అనలేకపోయింది.

"నన్నునమ్ము .... నిజానికి నువ్వు దాచిన నీ ముక్కు రహస్యం నాకు తెలుసు. అయినా నేను నిన్ను నా భార్యగా చేసుకున్నాను. ఈ ఒక్క కారణం చాలు... నువ్వు నా వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకునేందుకు"

అర్జునరావు మాటలకు మాధవి భుజాలు తడుముకుంది.

"మళ్ళీ ఎప్పుడు వస్తారు?" చెమరింపు కళ్ళతో అడిగింది మాధవి.

"పిచ్చిదానా ... అనవసరంగా ఆలోచించి మనసు పాడుచేసుకోకు. రేపీపాటికి ఈ దాసుడు ఈ దేవిగారి ఎదురుగావుంటాడు"

ఆ ఒక్కమాటతో అన్నీ మరిచిపోయి పరవశించింది మాధవి. గతం అంతా ఆమె కళ్ళముందు తిరిగింది.

"వెర్రిపిల్లా" అంటూనే అక్కున చేర్చుకున్నాడు అర్జునరావు. "ఈ లౌకిక ప్రపంచంలో తప్పుచేయని వారెవరూ ఉండరు. తప్పునే తెలుకుతూ కూర్చుంటే జీవితంలో మిగిలే సుఖం అంటూ ఏదీ ఉండదు. తప్పు దిద్దుకోగలిగితేనే గొప్ప" అన్నాడు కౌగిట్లో బిగిస్తూ.

సరిగ్గా అదే క్షణంలో రెండు కన్నీటి బొట్లు రాలాయి మాధవి తలమీద.



# పక్క సీటు

థియేటర్ దగ్గర రష్ విపరీతంగా వుంది. కొత్త సినిమా ఆ రోజే విడుదలైంది! అంచేత బాల్కనీ కౌంటర్ దగ్గర క్యూలో కూడా జనం బాగా వున్నారు.

క్యూలో నిలబడే ఓపికలేక నేను ఏ సినిమా అయినా సాధారణంగా పాత బడ్డాకగాని చూడను. కాని, ఈ సినిమాలో హీరో హీరోయిన్లు ఇద్దరూ నా అభిమాన నటీనటులే! అందుకే మొదటి రోజునే ఎగబడటం, తెగించి క్యూలో నిలబడటం!

ఓ గంటసేపు అలా క్యూలో నిలబెట్టి మా సహనాన్ని పరీక్షించారు థియేటర్ వాళ్లు. తర్వాత బుకింగ్ తెరుచుకుంది. టికెట్లివ్వడం మొదలైంది. బాల్కనీ టిక్కెట్టుకి స్త్రీలకీ, పురుషులకీ ఒక్కటే క్యూ! నాకన్నా ఇద్దరికి ముందు ఓ యువతి వుంది. ఆమె అందంగా వుందనే కంటే అలా అలంకరించుకుంది అని చెప్పటం సబబు! ఏమైతేనేం, ఆమెను





...సిన వారికెవరికైనా వెంటనే 'బావుంది' ...ప్పస్తుంది. క్యూ క్రమక్రమంగా తగ్గి ...రికి ఆ యువతి కౌంటర్ దగ్గరికెళ్లింది. ఆమె డబ్బులకోసమన్నట్టు చేతిలో ...న్న హేండ్ బాగ్ తెరచి 'మైగాడ్!' ...ంది తలెత్తి. అందమైన ఆమె ముఖం ...వెలబోతోంది.

బుకింగ్ క్లర్క్, "ఏమిటమ్మా" ...న్నాడు మొహం చిట్లించి. ఆమె ...క్కెట్ తీసుకోకపోవడం చూసి, "మీరు ...ప్పుకోండి" అన్నాడు.

వెనక వాళ్లిద్దరూ ముందుకు జరిగి ...క్కెట్లు తీసుకుని వెళ్లిపోయారు. ...ఏమైందండీ?" అన్నాను. బ్రహ్మచారి ...న నాకు వాళ్లలా పట్టించుకోకుండా ...ళ్లిపోబుద్ధికాలేదు.

"డబ్బులు మర్చిపోయి వచ్చానండీ! ...... అనవసరంగా క్యూలో ఇంతసేపు ...బడ్డాను" అందామె ఎంతో ...స్పృహగా.

నేను బదులుగా ఏమీ మాట్లాడక ...ఉందే, "దయచేసి మీరు టిక్కెట్ ...నిస్తారా? తర్వాత ఇచ్చేస్తాను" అంది ...ాధేయపడుతున్నట్టుగా.

నేనే కాదు, ఆ పరిస్థితిలో ఏ మగాడూ ...రస్కరించలేడేమో! ఆమె థియేటర్‌లో ...ా పక్కనే కూర్చుంటుంది కదా అన్న ...త్సాహంతో రెండు టిక్కెట్లు తీసుకుని, ...ామెకు ఒకటి ఇచ్చేశాను. థియేటర్‌లోకి ...డవబోతుంటే, "ఎక్స్‌క్యూజ్ మీ...చిన్న ...పనుంది. నేను తర్వాత వస్తాను" అంది. ...ేను అర్థంచేసుకుని లోపలికి నడిచాను.

థియేటర్‌లో నా సీట్లో కూర్చుని ...మె కోసం ఆత్రుతగా నిరీక్షించసాగాను.

ఆట మొదలయ్యే ముందు ఓ నడివయసు వ్యక్తి వచ్చి నా పక్కసీట్లో కూలబడ్డాడు.

"ఈ సీటులో వేరే వాళ్లున్నారు! నెంబరు సరిగ్గా చూసుకున్నారా? మీ సీటు ఇదికాదు?" అన్నాను అతనితో.

"కాదయ్యా బాబూ! పొరబడ్డావు. నేనొకమ్మాయి దగ్గర బ్లాకులో పది హేను రూపాయలకి ఈ టిక్కెట్టు కొనుక్కున్నాను" అన్నాడతను తొణుకుబెణుకు లేకుండా!

—జాస్తి శ్రీకృష్ణ వరప్రసాద్

## ఐడియా

ఎట్టకేలకు భారతీయ శాస్త్రజ్ఞులు అంతరిక్షంలోకి ఓ మానవుడ్ని పంపించాలని నిశ్చయించారు. వెంటనే దినపత్రికల్లో 'అంతరిక్షంలోకి వెళ్ళగల ధైర్యవంతుడు కావలెను' అంటూ ప్రకటించారు.

ప్రకటన వెలువడ్డ వారంలోగా అనేక మంది అభ్యర్థులు ముందుకొచ్చారు.

అయితే అన్ని రకాల పరీక్షలకు విజయవంతంగా తట్టుకొని ముగ్గురే నిలబడగలిగారు

ఇక లావాదేవీల విషయం మాట్లాడితే మంచిదను:కొని సెలక్షన్ బోర్డ్ ఛైర్మన్ "మీరెంతో ధైర్యంగా ముందుకొచ్చినందులకు నా అభినందనలు. అయినా ఇది ఎంతో అపాయకరమైన వ్యవహారం కాబట్టి మీకు డబ్బు రూపేణా ఎంత పరిహారం కావాలో చెప్పండి..." అని అడిగాడు.

"ఓ లక్షరూపాయలివ్వండి చాలు" అన్నాడు బెంగాలీ యువకుడు తటపటాయించకుండా.

కొంచెం సేపు ఆలోచించిన తమిళ



యువకుడు "రెండు లక్షలు ఇవ్వండి. ఓ లక్షతో కొంత పొలం కొంటాను. మరో లక్షతో నా కుటుంబ సభ్యులచేత వ్యాపారం ప్రారంభిస్తాను" అన్నాడు.

తన వంతు వచ్చిన ఆంధ్రుడు- "మూడు లక్షలకు ఒక్క పైసా తక్కువయినా నేను ఒప్పుకోను" అన్నాడు దృఢ నిశ్చయంతో.

అతడి డిమాండుకు కోపం వచ్చింది ఛైర్మన్‌కి.

"నా మాటలు మీకు కోపం తెప్పించాయని నాకు తెలుసు. ఓ రెండు నిముషాలు మీతో అంతరంగికంగా మాట్లాడి, నా మాటలు సబబైనవని రుజువుచేయగలను" అన్నాడు ఆంధ్రుడు.

సరేనని పక్కరూంలోకి నడిచాడు ఛైర్మన్. చుట్టూ ఓమారు పరికించాక, అతడి చెవిదగ్గర హాస్యంగా చెప్పాడు ఆంధ్రుడు-

"నన్ను ఈ పనికి తీసుకోండిసార్! మీకో లక్ష సమర్పించుకుంటాను! మరో లక్ష ఆ బెంగాలీ యువకుడికిచ్చి, నా బదులు అంతరిక్షంలోకి పంపిస్తాను. మిగిలిన లక్ష నేనుంచుకొంటాను. ఎలా వుంది నా ఐడియా!?"




# నేరం

విద్యార్థుల తెలివితేటల్ని పరీక్షించటానికి స్కూల్‌కొచ్చాడు ఇన్‌స్పెక్టర్.

అంతకుముందే సిద్ధంగా ఉంచిన కాఫీ టిఫెన్లు ఆరగించాక ఓ సెక్షన్‌లో అడుగుపెట్టాడు ఇన్‌స్పెక్టర్.

విద్యార్థులంతా సీట్లలోంచి లేచి 'గుడ్ మార్నింగ్ సర్!' అనేసి కూర్చొన్నారు.

"నమస్కారం! రండి సార్... కూర్చోండి!" అన్నాడు క్లాసుటీచర్ ఓ కుర్చీ చూపిస్తూ.

ఆ కుర్చీలో కూర్చొన్నాక క్లాసంతా ఓమారు కలియజూసి "మిమ్మల్నో ప్రశ్న అడుగుతాను. జవాబు చెప్పాలి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అడగండి సార్!" ముక్తకంఠంతో అన్నారు పిల్లలు.

"శివధనస్సును ఎవరు విరిచారో చెప్పండి?"

గుసగుసలు బయల్దేరాయి విద్యార్థుల్లో. ఓ కుర్రాణ్ని లేపి తిరిగి అదే ప్రశ్న అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"నాకు తెలియదు. నేను విరక్కొట్టలేదు!" అన్నాడా విద్యార్థి వణికిపోతూ. అతడి పక్క కుర్రాడు కూడా అలానే భయపడ్డాడు జవాబు చెప్పడానికి. తల తిరిగిపోయిందా స్కూళ్ళ ఇన్‌స్పెక్టర్‌కి.

"మీరయినా జవాబు చెప్పి వీళ్ళ సందేహాన్ని, భయాన్ని తొలగించండి!" అన్నాడు చివరికి క్లాసు మాస్టర్ని.

"అబ్బే! నాకు మాత్రం ఏం తెలుసు? దయచేసి ఈ విషయం హెడ్‌మాస్టారు గారి దృష్టికి తీసుకువెళదాం! ఆయనే తేల్చేస్తారు...." తడబడుతూ చెప్పాడు క్లాసు మాస్టారు.



ఈసారి జ్వరం వచ్చినంత పనయిందా ఇన్స్పెక్టర్‌కి! "సరే ఏమయితే అదయింది ఆ హెడ్‌మాస్టర్‌నే అడుగుదాం పదండి!" అన్నాడు మాస్టర్‌తో హెడ్‌మాస్టరు రూంకేసి కదుల్తూ.

విషయం తెల్సుకొన్న హెడ్‌మాస్టర్, స్కూల్స్ ఇన్స్‌పెక్టర్‌కి రెండు చేతులూ ఎత్తి మొక్కుతూ– "ఇక్కడి విద్యార్థు లొఠ్ఠి రౌడీమూక. ఏ కొంటె వెధవో ఆ ధనస్సును విరగ్గొట్టి వుంటాడు. మీరు మరోలా అనుకోక ఆ ధనస్సుకైన ఖర్చెంతో చెబితే వాళ్ళందరి దగ్గరా ఫైన్‌వేసి వసూలు చేసి ఇచ్చేస్తాను. ఈసారికేదో క్షమించండి!!" అన్నాడు.

పాపం!! ఆ స్కూల్ ఇన్స్పెక్టర్ అతడి మాటలు వింటూనే మూర్ఛవచ్చి పడిపోయాడు.

## ఫ్యాన్సీ డ్రెస్

ఈసారి ప్రతి యేడాదికంటే ఘనంగా కాలేజీ వార్షికోత్సవాలు ప్రారంభ మయ్యాయి.

ఫాన్సీడ్రస్ కాంపిటీషన్ ఎంతో ఉత్సాహంగా మొదలయింది.

రౌడీగా పేరొందిన రాజారావు ఏ వేషంలో దర్శన మిస్తాడా అని తోటి విద్యార్థులంతా ఆత్రంగా చూస్తున్నారు.

బి. ఏ. రెండో సంవత్సరం చదువు తున్న సుధాకరం లాయర్ డ్రస్ వేశాడు. ఇంటర్‌లోని సంధ్యారాణి కోయరాణి వేషం వేసింది. అలాగే బిచ్చగాడు, డాక్టరు, రాజకీయ నాయకుడు, శ్రీకృష్ణుడు దర్శనమిచ్చారు స్టేజీమీద.

ఉన్నట్టుండి జనంలో కలకలం మొద లయింది. చారల బనీను, లుంగీలో నాలు గంగుళాల వెడల్పున్న బెల్టుతో టక్‌చేసి, చేతిలో కర్ర తిప్పుతూ, కిర్రు చెప్పులను టకటకలాడించుకొంటూ, నల్లటి తుమ్మ మొద్దులాటి శరీరం, రింగుల జుట్టుతో ఉన్న ఆరడుగుల ఓ వ్యక్తి ప్రేక్షకుల మధ్యనుంచి నడుచుకొంటూ వచ్చాడు.

ముందుగా ప్రిన్స్‌పాల్ దగ్గరకెళ్ళి కత్తి చూపిస్తూ ఆయన కోటు జేబులోని పెన్నూ, పర్సూ తీసి తన సంచీలో వేసేసుకున్నాడు. తరువాత జడ్జి, ఇతర మాస్టర్ల దగ్గరా పర్సులూ, ఉంగరాలూ, వాచీలూ గుంజుకున్నాడు. స్టేజీ దిగిపోతూ పోతూ విద్యార్థుల్లో కూడా కొందరి వాచీలు, విద్యార్థినుల గాజులు, గొలుసులు గుంజుకున్నాడు. అయినా ఎవరూ గుర్తు పట్టలేకపోయారతన్ని. ఆ తర్వాత స్టేజీ ఎక్కి సైడ్ వింగ్‌లోకి మాయమయ్యాడు ఆ వ్యక్తి. అలా గజదొంగ వేషం వేసి అంత ధీమాగా నటించింది ఎవరా అని అందరూ సస్పెన్స్‌లో ఉండిపోయారు.

అందరూ అనుకొన్నట్లుగానే ఆ తర్వాత ఫాన్సీడ్రస్ పోటీలో 'దొంగ' పాత్రధారి గెలుపొందినట్లు ప్రకటించ బడింది.

కానీ ప్రకటించిన పదిహేను నిముషాల వరకూ బహుమతి అందుకోవడానికి స్టేజీమీదకు ఎవరూ రాలేదు.

మరో ఐదు నిముషాల తర్వాత గానీ వాళ్ళకు బోధపడలేదు– తమని దోచు కొన్నది ఎవరో!

ఒక్కసారిగా గొల్లుమన్నారందరూ.

—హరిబాబు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd.No. H/HD

# మీ డబ్బుకి ఇంతకంటె మంచి రక్షణ అవసరం !



ఫలానా చోట భద్రత ఉంటుందని గట్టిగా నమ్మి మీ డబ్బును అక్కడ దాస్తారు. ఆ నమ్మకం కాస్తా వమ్మయితే...! అలా జరిగే అవకాశాలు లేకపోలేదు. అందుకే - కష్టార్జితాన్ని ఎక్కడ మదుపు పెట్టాలా అన్న విషయంలో మీరు బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రావడం చాలా ముఖ్యం.

రెండు దశాబ్దాల అనుభవం ఉన్న మార్గదర్శిలో మీరు పొదుపుచేసే మొత్తాలకు పూర్తి రక్షణ ఉంటుంది. అందరి అవసరాలకూ సరిపడే విధంగా వివిధ రకాల చిట్‌లు మార్గదర్శిలో మీకు అందుబాటులో ఉన్నాయి. అంతేకాదు, మీరు పొదుపుచేసే మొత్తాలకు ఆకర్షణీయమైన డివిడెండ్లు కూడా తోడవుతాయి.

మార్గదర్శిలోని హితులు మీ ఆశలకూ, ఆశయాలకూ ఒక ఆకృతి కల్పిస్తారు. మార్గదర్శిలో పొదుపు చేస్తే ధనానికి పూర్తి రక్షణ ఉంటుందని లక్షమందికి పైగా ఇప్పటికే గ్రహించారు.

మరి మీ మాటేమిటి ?

డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత!



## మార్గదర్శి

చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్

మార్గదర్శి హౌస్, ఆబిద్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

**శాఖలు:** ● ఆబిద్ సెంటర్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● కాబ్రా కాంప్లెక్స్, ఎమ్.జి.రోడ్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● నెహూర్ రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్, ● వైరారోడ్, ఖమ్మం